# మట్టి మనుషులు

(నవల)

ఒరియా మూలం :

కాళిందీచరణ పాణిగ్రాహి

తెలుగుసేత :

పురిపండా అప్పలస్వామి



సాహిత్య అకాదెమి తరఫున

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
చంద్రంబిల్డింగ్స్ విజయవాడ-52000

# అభినందనలు

"మట్టి మనుషులు" మొదట ఒడియా భాషలో పాతికేళ్ళ కిందట వెలువడింది. పూరీ జిల్లా దెలాంగ గ్రామంలో వొక కృషక పరివారంలోని ఇద్దరు అన్నదమ్ముల కలహం ఎలా సమాధాన మయిందీ, అది వాళ్ళలో పెద్దతని నోట విని, ఈ చిన్న నవల రాయడానికి నాకు ప్రేరణ కలిగింది. ఆ ప్రేరణకి వొక స్వరూపం కలిగించడానికి, సాహిత్య ప్రకాశకులూ, ముద్రాక్షరశాలాధిపతులూ అయిన శ్రీయుత దాలకృష్ణకరగారు నన్ను ఉత్సాహ పరిచారు. ఆ మహాశయుల ఆనందలహరి గ్రంథమాలలో ఇది మొట్టమొదట వెలువడింది. ఇదే నేను రాసిన తొలి నవల. దీని కథా భాగం గాంధీ దర్శనం మీద ఆధార పడింది.

వెలువడడంతోనే పాఠక లోకంలో ఇది ఆదరణ సంపాదించుకుంది. దీని నాటక రూపాలూ, కావ్య రూపమూ కూడా తయారయాయి.

సాహిత్య అకాడమీ ఆనుకూల్యంతో దీని హిందీ అనువాద మున్నూ వెలువడింది. తెలుగు కవులూ, సాహిత్యకులూ అయిన శ్రీయుత పురిపండా అప్పలస్వామిగారు ఇప్పుడు దీనిని ఒడియా మూల గ్రంథం నించి తెలుగులోకి అనువదించారు. అకాడమీ దీనిని స్వీకరించింది. అయితే వొకటి రెండు మాసాల్లో శ్రీ అప్పలస్వామిగారు సార్థకంగా ఈ తెలుగు అనువాదం పూర్తి చెయ్యడం మాత్రం నిజంగా విస్మయకరమైన విషయం. అంతేకాదు. ఒడియా, తెలుగూ— ఉభయ భాషలలోనూ వారికున్న గంభీర మైన సామర్థ్యానికిన్నీ ఇది నిదర్శనం.

శ్రీయుత అప్పలస్వామిగారితో మౌఖికమైన పరిచయం కానీ, ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే సౌభాగ్యం కానీ నాకు కలగకపోయినా, నా యింకో ప్రియమిత్రుడు, 'అస్థి సంచయనం' కావ్య రచయిత శ్రీమాన్ దండపాణి మిశ్రగారు మా ఉభయుల మధ్యా పరిచయం కలిగించి, పని చేశారు. అంచేత ఇది తెలుగు కావడానికి శ్రీ దండపాణి కూడా చాలా వరకు కారకులయ్యారు. ఈ ఉభయులకీ నా హృదయపూర్వక మయిన అభినందనలు తెలుపుతున్నాను.

కాళిందీ చరణపాణిగ్రాహి,
కటకం.

# రెండు మాటలు

నవలా సామ్రాట్టు ప్రేమచందు విషయం సమాలోచన చేస్తూ, ఆయన సాహిత్యమంటే అనురాగం కల వొక బంధువు వొకసారి అన్నారు: "నానాజీ నవలలు గ్రామస్థుల గురించి రాసినవే, కాని గ్రామస్థుల కోసం రాసినవి కావు."

భాషా, భావమూ— ఈ రెంటి దృష్ట్యా "మట్టి మనుషులు" చదివినప్పుడు "ఈ చిన్న నవల కేవలం గ్రామస్థుల గురించి రాసిందే అయినా, ఇది గ్రామస్థుల కోసమున్నూ రాసింది" అని అనిపించింది నాకు. ఇది కేవలం దేశంలోని వాస్తవికమైన నాగరిక జీవనం మాత్రమే చిత్రించడం లేదు, దానికి మార్గమున్నూ నిర్దేశిస్తున్నది. యథార్థవాదమూ, ఆదర్శోన్ముఖమూ— రెండూ కలిగి వుందిది.

ఒడియాలో సుప్రసిద్ధ సాహిత్యకారులు శ్రీ కాళిందీ చరణపాణిగ్రాహిగారి ఈ కృతికి నా హృదయపూర్వకమైన ధన్యవాదాలు.

ధర్మోదయ విహారం,
కాలింపోఙ్— 2.

ఆనంద కౌసల్యాయన.

# భూమిక

శ్రీ కాళిందీ చరణపాణిగ్రాహిగారు రాసిన "మట్టి మనుషులు" లో గ్రామ జీవనం తాలూకు చిత్రముంది. అక్కడ మనిషికీ మనిషికీ మధ్య ఇప్పుడుకూడా ఎంతో కోమలమైన ప్రేమమయ సంబంధం గోచరిస్తుంది. ఆ సంబంధం సమిష్టి పరివార వ్యవస్థ చాలా సుదృఢం చేసేసింది. కొన్ని సంవత్సరాల క్రితం గాంధీజీ నాయకత్వం కింద గ్రామ జీవనంలో వొక ఆదర్శవాదం లేచింది. ఆ గ్రామీణ ఆదర్శ జీవనమే చిరస్థాయిగా వుంటుందని ఆశ కలిగించి. అదిగో ఆ దినాల్లో ఈ పుస్తకం రాయడం జరిగింది. పరిస్థితుల వొత్తిడి కారణంగా, ఆదర్శమని అంగీకరించిన ఆ జీవనం ఇప్పుడు త్వరత్వరగా మారిపోతూ వుంది. ఇప్పుడు గ్రామీణ జీవనం కంటే నాగరిక జీవనం తాలూకు ఆదర్శమే స్థాపితమై పోయింది. అయినా శ్రీ పాణిగ్రాహిగారి నవల చదివిన పాఠకులకి ఒడిశా గ్రామాల జీవనం ఎలా వుండేదో అవగతమవుతుంది. దాంతో పాఠకుల హృదయంలో సమిష్టి పరివార వ్యవస్థ ఇప్పటి దాకా భారతీయ జీవనం వికసితం చేస్తూవున్న కోమలమైన ఆ మానవ గుణాల మీద ఆదరమూ, సహానుభూతీ కలుగుతుంది.

శ్రీ కాళిందీ చరణపాణిగ్రాహిగారు రూఢివాదం వొదులుకుని, జీవనంలోని యదార్థత ఉన్నది ఉన్నట్లు వ్యక్తం చేసే ఆధునిక రచయితల కోవలోని వారు. కవిగా, నవలా రచయితగా, ఒడియా సాహిత్య జగత్తులో శ్రీ కాళిందీ చరణపాణిగ్రాహిగారి స్థానం ఎంతో అంత పైన. ఆయన పేరంటే దేశంలోఎంతో ఆదరణం. అందుచేత సాహిత్య అకాడమీ జనా

దరణ కల ఈ నవల యితర భారతీయ భాషల్లోకి అనువదించడం కోసం ఎంచడం సముచితంగా వుంది. ఈ పుస్తకమూ, పుస్తకంతో రచయితా దూర దూరాల విస్తృత క్షేత్రంలో తెలియ వస్తారు.

ఒక భారతీయ భాషలోని గ్రంథాలు ఎన్ని అధిక భారతీయ భాషల్లోకి అనువాదమయితే అంత అధికంగా ఈ దేశం తాలూకు భావనాత్మకమైన ఐక్యత దృఢపడుతుందని నా నమ్మకం. ఏమంటే ఇందువల్ల భారత దేశమంతటా భాషాభేద మెంతవున్నా, జీవనం మాత్రం వొక్క మాదిరిదే అని అర్థమవుతుంది.

హరేకృష్ణ మహతాబ్.

# 1

మనకు బాగా తెలిసిన అతి పురాతనమయిన ఈ సూర్యుడిలాగ, కోటి కోటి సూర్యులు విశ్వబ్రహ్మాండంలో రోజూ ఉదయించి రోజూ అస్తమిస్తున్నారు. ఒక్కొక్క సూర్యుడి చుట్టూ కోటి కోటి గ్రహాలూ, ఉపగ్రహాలూ 'ఒప్పులకుప్ప వొయ్యారి భామా' ఆడుతుంటాయి–పగళ్ళూ రాత్రుళ్లూ రుతువులూ మాసాలూ సంవత్సరాలూ తయారు చేస్తాయి. వాటి మధ్య ఎంతో అంత చిన్న గ్రహం మన ఈ చిరకాలం నాటి భూదేవి. అందులో భారతదేశం మరీ చిన్న దేశం. అందులో ఒడిశా. దానిలో కటకం జిల్లాలోని విరుపానది వొడ్డున పధానపడ– ఎంతో చిన్నది. ఉప్పూ పత్రీకాని మానవజాతి నివసిస్తూ వున్న పిసరంత వూరు అది. ఆ వూళ్ళో శామపధాను తాలూకు రవంత మట్టికొంప. విశ్వబ్రహ్మాండంలో దాని స్థాన మేమాత్రం! అణువా పరమాణువా! ఎవడు చెప్పగలడు!

ఆ గడ్డమీద ఏ వ్యక్తి వచ్చి మొదట అడుగు పెట్టాడో, అతడి పద చిహ్నం లేదు. ఆ మట్టిలో ఎవడు ముందు వచ్చి విత్తు నాటాడో, ఫల మనుభవించాడో ఆ వైనం విరుపానది చెపితే చెపుతుంది. ఈ సూర్య చంద్రులు చెపుతారు! అయితే, ఆ మట్టి ఇపుడు ధాన్యంతోనూ, జనప చేల తోనూ నవ్వుతూ వుంది. మనుషుల కోలాహలంతో కలకలలాడుతూ వుంది. ఆ వీధిలో ఎంత మంది పిల్లలో ఆటలాడుకుని పోయారు– శామ పధానూ, ఆతడి తండ్రీ, తాతా– ఏడు తరాలవాళ్ళు.

విరుపానదీ తీరంలో, నోములు నోచిన ఊరి ఆడంగులు ఎంతోమంది ఆనందంతో హుళహుళి ధ్వనులు* చేశారు. ఊరిలో కాలం చేసిన వాళ్ళని ఎందరినో చితాగ్నులు ఆహాస్తుని మండాయి. ప్రేత కార్యాలలో స్నానానికి వచ్చి, జాలిగా ఏడ్చిన వితంతువుల ఎంత మంది కన్నీళ్ళతోనో విరుపా గర్భంలో ఈ పొడి ఇసక తడిసిపోయింది-ఎన్నాళ్ళయో ఎవరికి తెలుసు!

శామపధానుడి ఏ తరం వాళ్ళు పధానపడాలో నివేశనం కట్టారో దాని చరిత్ర లేదు. హిందూ, ముసల్మాను, మరాటా - ఎన్ని రాచరికాలో గడిచిపోయాయి. ఈ నేలమీద హిందూ, బౌద్ధ, ముసల్మాన్, కిరస్తాన్- ఎన్నో ధర్మాలు ప్రవహించి పోతాయి. అయితే పధానపడా మాత్రం వీటి వేటి గుర్తులూ అట్టే పెట్టలేదు. అవి అలాగే వుంచి, ఎల్లకాలాలూ తల వొంచిన గరికిపోచలాగ, తుఫాను గాలిలో మహా మహా వృక్షాలు పెల్లగిలి పోయాయి. కాని ఆ గరికిపోచకి మాత్రం ఆ కబురే* పుండదు. శామ పధాను మస్తికొంపకూడా అలాంటిదే. ఎవ్వరి రాచరికంలోనూ అతడు రాతిప్రాపంచాలు కట్టలేదు. ఎవరి రాచరికంలోనూ అతడి ఇంటిలో ఎవ్వడూ రంగేళీ వేషం వేసి, పాతికా పరకా ఎగరగొట్టెయ్యలేదు. లేదా గల్లా బనాయించి వొక వెయ్యిరూపాయలు వెనక వేసిన పాపాన పోలేదు.

పధానపడాలోని ధర్మం యావత్తూ ఆదికాలం నించీ అదిగో ఆమండారచెట్టు మొదట నల్ల జానపరాతి మంగళా అమ్మవారి దగ్గిర కుప్పపడి వుంది. ఊరిలోకి గొట్టాలమ్మ వచ్చినా, మశూచికం వచ్చినా మంగళా అమ్మవారే, శుభ కార్యాలకీ పండుగ పబ్బాలికీ మంగళా అమ్మవారే. ఎవరిదయినా వొక చెట్టుకాపు లేదనుకోండి, ఎవరి పిల్లయినా ఎప్పుడూ నీరసంగా

---

* శుభకార్యాల్లో ఒడిశా స్త్రీలు "ఉలి" "హులి" అంటూ మధురధ్వని చేస్తారు. గంజాం, శ్రీకాకుళం జిల్లాల తెలుగువారు దీన్ని ఉలివల హుళ్ళుళిం అంటారు. —పురిపండా

* మాటే

వుంటుందనుకోండీ, ఎవరికయినా పాడుకల వచ్చిందనుకోండీ, లేదా ఎవరి పెరటిలో అయినా కొత్తగా అరటిగెల వేసిందనుకోండీ, లేదా ఎవరి పందిరిలో అయినా బీఃపాము కొత్తగా పిందె వేసిందనుకోండీ— మంగళా అమ్మవారు తెలుసుకునేది, ఆనాది కాలం నించీన్నీ. ఊరిలో మంచీచెడ్డా, సుఃఖమూ దుఃఖమూ అన్నీ వినేది. ఎంతో కాలమయింది— చువానూనె సిందూరాలతో ఆమె శరీరంలో పిసరంత• ఖాళీలేదు* ఇలాంటిదీ పురాతనమయిన ప్రధాన పడగ్రామం, ఇలా చిన్న దీన్నీ, సామాన్యమైనదీన్నీ.

గ్రామంలో వున్న ఇళ్ళన్నింటిలోకీ శామపధాను ఇల్లంటే ఎంతో అంత ప్రసిద్ధి— రాతి పావంచాలు• లేకపోతేనేం గాక, ఇటికి గోడలు లేకపోతేనేం గాక! తరాతరాలయి ఎన్నోసార్లు కూలిపోయిందా యిల్లు. ఒకసారి తయారుచేస్తే, పదేళ్ళు నిలిస్తే నిలిచినట్టు. మట్టిగోడలూ, పూరికప్పు గాలీ, వానా ఎన్నాళ్ళని నిభాయిస్తుంది? శామపధాను తండ్రినీ, తాతనీ చూస్తూ వచ్చాను మాంచి ముఖండీలవండి మనుషులు! యిల్లు ఒకసారి కూలిపోయిందో, రెండురోజుల్లో మళ్ళీ మన్ను తొక్కీ—, పెండి కట్లుకట్టి కొత్తకొంప నిలబెట్టేసేవాళ్ళు. అడుగు వేస్తే ఆముడ— మళ్ళీ పదేళ్ళు కొట్టుకుపోయేది. శామపధాను కాలంలోనూ అలాగే సొంత చేతులతో అన్నీ చేసేవాడు. అతడి తరంలో మూడుసార్లు ఇల్లు కూలిపోయింది, మూడుసార్లూ తయారయింది.

ఇంటి గొప్పతనం వల్ల కాదు, యజమాని యాజమన్యం వల్ల శామపధాను ఇల్లు పదానుపద చుట్టుపట్ల యావన్మందికీ వినికిడి. ఊరిలోకి వొక బికారి వచ్చినా, వొక సన్యాసి వచ్చినా జనం శామపధాను ఇల్లు చూపించేసే వాళ్ళు. ఊరిలో కానీ, బైటకానీ ఎవళ్ళయినా తగాయిదా

---

• కొంచెమైనా

* చువానూనె సింధూరమూ గ్రామదేవతికి మర్దనా చేస్తారు.

• మెట్లు

పడ్డారో శామపదానుని పిలవాలి. ఎవళ్ళకయినా జబ్బు చేసిందో, లేదా ఎవళ్ళకయినా ఏదయినా ఆపద వచ్చిందో శామపధానుకి కబురు వెళ్ళాలి. ఎవళ్ళింటిలో అయినా పెళ్ళికి జాబితా రాయాలంటే శామపధాను రావాలి. శామపధానుకి చదువు సంధ్యలేమంతరావు. ఏదో భాగవతం మాత్రం చదువుతాడు. * పద్ధతులూ, అవీ ఏమీ ఎరగడతడు. మందులు మాకులున్నా ఎరగడు. లెక్కా డొక్కా కట్టడం అంతకన్నా తెలియదు.

అయితే, ఏ పని వచ్చినా అతడి సహాయం లభించేది. అర్ధరాత్రి ఎక్కణ్నుంచయినా "నిధి" వైద్యుడికి పిలుపు వచ్చినా, అద్దసారం చెక్క ఎక్కణ్నుంచి తేవలసి వచ్చినా, ఎక్కణ్నుంచి బాజా భజంత్రీలు రావాలన్నా, పెళ్ళి సంతర్పణలయినా- శామపధాను వుండవలసిందే. అతడిసొంతానికి లాభమంటారా, చిల్లిగవ్వ ఉండేది కాదు. ఇలాంటి వాళ్లో అతడు లాభం చూస్తాడూ! ఛీ, ఛీ, కడుపునిండా అతడి కింత కూడు లేదుకనకనా!

ఎవళ్ళకయినా ఆపదో బాధో వచ్చి, వొకవేళ శామపధానుని పిలవలేదే అనుకోండి, వినీ వినడం తోటే పరిగెత్తుకు వెళ్ళేవాడతడు. "ఏంరా? శామపధాను చచ్చిపోయాడా ఏం?" అనేవాడు. తన ఇంటిపక్క ఇంత వరకూ వచ్చి, తన చెవిలో ఈ మాట పడలేదంటే- ఛీ, ఇంకెందుకూ తాను!

ఊరిలో ఇద్దరి మధ్య తగాయిదా రాజుకుందో, బుర్రలు పగలగొట్టుకోడం, కేసులూ, కచేరీలూ- రెండు కొంపలూ కూలిపోతాయి! అందుకని శామపధాను మధ్యని దూరేవాడు. వాళ్ళ కాళ్ళావేళ్ళా పడేవాడు. వాళ్ళ గడ్డం చేతులూ పట్టుకునేవాడు తిండీ తిప్పలూ మానుకుని, మిట్ట మధ్యాహ్నం దాకా పడిగాపులు పడి కూచునేవాడు. "వల్లకాదు, శామపధాను హరీ అని కళ్ళు మూశాక ఏమన్నా చేద్దురుకాని, కేసు చెయ్యండి,

* సామాన్యమైన అక్షరజ్ఞానముంటే చాలు. ఒడియా భాగవతం చదవడానికి అనువుగా వుంటుంది అర్థమున్నా అవుతుంది.

కచేరీకి వెళ్ళండి— వీడు బతికి వుండగా మాత్రం ఈ ఊళ్ళో ఇది జరగదు."

"ఎందుకని? మూన్నాళ్ళ ముచ్చటే కదా, తమ్ముడూ! మన తాత తండ్రులు ఏడు తరాలవాళ్ళు ఈ మట్టి తవ్వి, కొట్లాడుకునీ, తగాదాలు పడీ వెళ్ళిపోయారు. అదే పుట్టి ఎలాంటి దలాగ పడివుంది. ఎకరం నేల రెండెకరాలు కాలేదు కదా! అలాగే మనమూ వెళ్ళిపోతాం. మన కొడుకులూ మనమలూ కూడ వెళ్ళిపోతారు. ఈ పొలాలూ అవీ ఇలాగే పడివుంటాయి. విరూప ఇసకలో ఇలాగే ఏడాది కేడాది కుండ పెంకులు రెండూ, సగం కాలిన కొరకంచు వొకటీ పడి వుంటాయి. వరద వచ్చిందో అంతా సాఫయి పోతుంది— మచ్చా గిచ్చా ఏదీ ఉండదు.

కడుపులో వొకటి పెట్టుకునీ, పైకి వొకటి చేప్పే మనిషి కాడతడు. రాజు కొడుకయినా సరే, తాను ఏది సరైందని అనుకునేవాడో అది సరాసరి వెనకా ముందూ చూడకుండా మొహం ఎదట చెప్పేసే వాడు. కాని మర్నాడు అతడి ఇంటికి స్తంభ మెత్తాలంటే బుజం సాయం పట్టేసే వాడు. అతడి భార్య నొప్పులు పడుతూ వుందంటే, అయిదు వూళ్ళు తిరిగి మందూ మాకు తెచ్చి పెట్టేవాడు. అందుకనే అందరూ అతడి మాట వినేవాళ్ళు వేదవాక్కులాగ. పాతికమందీ వొక మాటంటే శామపధాను మరో మాటన్నాడనుకోండీ, అపుడు శామపధాను మాటే సారమయి నిలిచేది.

శామపధాను పుస్తె కట్టి ఎవతెనైతే పెళ్ళాడాదో, ఆమె కూడా ఎంతో అంత మంచి మనిషి. చొషా * వాళ్ళ ఆడబిడ్డ అయితే ఏం గాక, ఆమె బుద్ధి చిన్న బుద్ధి కాదు. ఇరుగూ పొరుగూ ఎవరికన్నా ఏదన్నా లేకపోపడమంటూ వస్తే వాళ్ళు ముందు పధాను యింటికి వచ్చేవాళ్ళు. ఎందుకంటే, ఇంట్లో వుండనీ లేకపోనీ, పధాను భార్య నందలూ, బానలూ

* మన కాపు చనం లాంటి వ్యవసాయపు వృత్తి చేసుపవే జాతిని చొషా జాతిఅంటారు.

తడివి ఎలాగో వోలాగ సోలెడో తవ్వెడో తెచ్చి వాళ్ళ వోళ్లోపోసి పంపించేది —"ఏమమ్మా, ఇంట్లో ఏమీ లేకపోతే మాత్రం! నీపిల్లల్ని నేను చూస్తే నా పిల్లల్ని అలాగే ఎవళ్ళనాన్నా చూస్తారు" అనేది.

ఆమె కాపరం కూడా వూరు వాడా పురాణంలా చెప్పుకునే వాళ్ళు.

"పధాను ముసిలమ్మా? - మనిషంటే ఆమే నమ్మా! ఆ పిసరంత అడ్డె గదిలో ఎన్ని పిడతలూ, ఎన్ని దానలూ, గూనలూ, కడవలూ పేర్చి పెట్టిందంటావు! యిందులో పచ్చి బియ్యం యిన్ని వుంటే, అందులో వుప్పుడు బియ్యం యిన్ని వుంటాయి. యిందులో యిన్ని నూకలుంటే అందులో పెసలు, యిందులో మినుము లిన్ని వుంటే, అందులో ఆవాలు. టక్కులాంటి ఆవు వొక్కటేనా వుంది. ఎన్ని పాలనియిస్తుందది! అందులోంచే పెరుగు తోడుపెట్టీ, వెన్న చిలికీ, నెయ్యి కాసీ యింత యింతా చేసి పిడతలో జాగ్రత్త పెడుతుంది. చుట్టాలూ పక్కాలూ చిన్నా పెద్దా యింటికి వస్తారని." శారదమ్మ అనేది. "ఆకాలం మనుషులు చూడా లన్నా మరి దొరకర(్రా! కోడళ్ళేదరూ యింట్లో తొంగోనే* వుంటాడు. ముసల్ది చీకటితో లేస్తుంది. కల్లాపు చల్లేసి, యిల్లూ వాకిలీ అలికేసి ఎలా సుబ్బరం చేస్తుందంటారు, కూడు కుప్పేసుకు తిన్నాఅనయ్యం వెయ్యదు."

సెబితి అనేది, "అంతేనా, సూడూ, ఆయేడు మావిండి కాయలు కుక్కు మురికిగా కాసేశాయే. అదిగో ఆ యేటి నించిన్ని ముసల్ది వూరగాయ దాచిపెట్టింది. పిసరంత • నాలిక్కి రాసుకుంటేనా, పురటాలు చెడిపోయిన నోరయినా రెండు దినాల్లో రుచిపడుతుంది."

ముసిలామె ఎన్ని దేవుళ్ళకో మొక్కి ఎన్నో వ్రతాలూ నోములూ నోచి యిద్దరు కొడుకుల్ని కంది– బరజూ, ఛకడీ. అయితే యిద్దరిలో ఎవ్వరినీ పేరు పెట్టి పిలిచేది కాదు. "అం వాళ్ళేమంత మనుషులని, వాళ్ళకో

---

* పడుకునే

• కొద్దిగా

పేరూ, ఆ పేరు పెట్టి పిలవడమున్నూ!" పెద్ద కొడుకుని "శాఘఖియా" అనిపిలిచేది. చిన్నవాణి "చగలా" అనేది. *

అయితే ఆమె కొడుకుల్ని ఎలా చూసేదో కోడళ్ళనలా చూడలేక పోయేది.- "ఆడజన్మ ఎంతో అంత అనాకారి జన్మ - దెబ్బలు తినడం అన్నీ వోర్చుకుని పడి వుండడం. వాళ్ళ తిండీ గుడ్డా వొక లెక్కేమిటి? మగవాళ్ళ కోసమూ, పిల్లలకోసమూ కదా, వాళ్ళ బతుకంతా. అదే వాళ్ల సౌఖ్యం. అదే వాళ్ళ మంచి చెడ్డాను. ఆడజన్మకి సౌఖ్యమేమిటి; ఆయుర్దాయమేమిటి?"

ముసిల్ది తన తనువంతా అలాగే గడుపుకు వస్తోంది. "ఎంత పాపం చేస్తే ఆడజన్మ వస్తుంది." ఊహించలేక పోయేదామె. కోడళ్లిద్దరూ ఎప్పుడయినా గిల్లికజ్జాలాడితే ఆమె అనేది, "ఒలే తల్లీ, ఆడజన్మ ఎంతో అంత పాడు జన్మే మీరు కయ్యాలాడీ, గోలచేసీ, ఇల్లు రెండు ముక్కలు చేసేస్తారు, యింతేనా? చూడండీ, వాళ్ళిద్దరూ అన్నదమ్ములేనా! ఎన్నడయినా దెబ్బలాడారూ? వాళ్ళది మాత్రం కాదా ఇల్లు! వూరికే మీదేనా?"

అడపా దడపా అలా వొకటో రెండో మాట అనకపోతే కోడళ్ళిద్దరూ కలసీ మెలసీ ఎలా వుంటారు? ఒకామె కన్నవారు 'కంటాపడ' అయితే వొకామె పుట్టిల్లు నరద. బరజూ, చకడీల లాగ వాళ్ళు వొక్క తల్లి కడుపున పుట్టలేదు కదా, వొకరి మాట వొకరు గ్రహించడానికి!

అయితే చెప్పాలికదా, ముసలామె ఇంకో అత్తలాగ కోడళ్ళని సాధించేది కాదు. పరాయి ఇంటి పిల్లలాయె వాళ్ళు. వాళ్ళు తిన్నారో లేదో, కట్టుకున్నారో లేదో - అదంతా ముసిల్ది కనిపెట్టకపోతే ఎవరు కనిపెడతారు? అలా అని బరజూ చకడీలకంటే వాళ్ళు అధికం కాదు! లోకోక్తి వుండనే వుంది. 'ముందు కొడుకూ తరవాత కూతురూ' అని..

---

* శాఘఖియా: అత్తని చంపుకు తినేవాడు, చగలా: పిచ్చాడు

అంచేత, ఎప్పుడయినా బరజా ఉదయాన్నే లేచి పొలానికి వెళ్ళే వేళకి ఇంత చద్దికూడు వడ్డించక పోయారో, లేదా చకడి ఎటయినా వెళ్ళి వచ్చి, నీళ్ళు పోసుకుందికని రెండు మూడు సార్లు నూనెబొట్టు అడుగుతూ కూచున్నాడో, అతడిముందు నూనెగిన్నె వుంచకపోయారో, – ముసలామె కోపంతో అనేది, "ఏవఁఱ్రా, మీరు మరేం చేస్తారని ! మిమ్మల్ని రాణీలు చేసి కూచో పెట్టడానికా యింటికి తెచ్చాను !"

కోడళ్ళిద్దరిలోకీ చిన్న కోడలుమీద ముసలామెకి హెచ్చు దయ. దానికి కారణం ఆమె చిన్నది కావడమే – మరేమీ లేదు. లోకంలో చిన్న వాళ్ళనీ, కాస్త ఓటివాళ్ళనీ జనం కొంచెం హెచ్చు దయతో చూస్తారు. అంచేత చిన్నకోడలు స్నానం చేసిందో లేదో, తిండి తిందో లేదో, తల దువ్వుకుందో లేదో, పసుపు రాసుకుందో లేదో – పాపం ముసలామె సదా సర్వదా కనిపెడుతూ వుండేది. అదంతా పెద్ద కోడలికి గిట్టేదికాదు. నలుగురు పిల్లల తల్లినని ఆమె కాళ్ళు కింద పెట్టేదికాదు. అత్తా, మామా, భర్తా – అందరి దగ్గిరా ఆమె హెచ్చు గారాము కావాలనేది. అందుకని, అత్త ఎప్పుడయినా చిన్న కోడల్ని పిలిచి, "ఒలే ఇటు రమ్మీ, నీ బుఱ్ఱ పీచులా చిక్కుపడి పోయి వుంది. మూనాళ్ళయి నూనెబొట్టు లేదు, కూచొమ్మీ, కొంచెం దువ్వేస్తాను" అనేసరికి, పెద్దకోడలు, "ఆఁ, పిల్లా ? జెల్లా ? కూచుని ఇంత సింగారం చేసిందికి ?" అనేది.

ముసలామె నవ్వుతూ అనేది, "ఏమే ఖండాయితు కూతురా ! నీకు మాత్రం ఏమీ చెయ్యలేదే ! జ్ఞాపకం చేసుకో "

"పేదింటి బిడ్డలం మేం. ఎవళ్ళయినా ఏదయినా మా కెందుకు చేస్తారు ?" అంటూ రుసరుస లాడుతూ తన పని తాను చూసుకొనేది పెద్ద కోడలు.

"అవ్వవ్వ ! ఇదెలా నిందిస్తోందో చూడూ !" అనేది ముసిల్ది— "చిన్నపిల్ల వచ్చిందికదా, అదేం తిన్నాకో లేదో, తొడిగిందో లేదో

ఫ్ నాడయినా అడిగిన పాపాన పోయావూ! దాని తల పీచులా వుంచి, ఓనాడయినా అన్నావూ, 'రావే కొంచెం దువ్వేస్తాను' అని. పైగా నోరెత్తే సరికి వూరికే మీద కలబడిపోతున్నావూ!" అనేది.

నాగుపాం తోకమీద పాములాడు చెయ్యి వేసేసరికి ఎలా అని పడగెత్తుతుంది, అదుగో అలాగ, అత్తమాటమీద వెనక్కి తిరిగి కస్సు మనేది పెద్దకోడలు. "ఏమమ్మా చిన్నపిల్లా! నా 'హోరా' 'సున్నా'ల కంటేనా చిన్నపిల్ల! పాపం ఇంకా పాలు తాగుతోంది! నా పిల్లలు ఆకలితో కిరకిరమని పోతూవుంటే, వాళ్ళకోసం ఎవ్వతే పిడికెడు కుంపటి మెతుకులు వండెయ్యదు, ఇంత పకాళీ అన్నంపిండి ఎదట పెట్టదు— నాకేం పట్టిందీ అంటా, అడ్డమానివాళ్ళ చాకిరీ చెయ్యడానికి!"

"ఒలే తోటికోడల్తో పంతం పెట్టుకుంటున్నావటే!— నువ్వెలా చెప్పితే అది అలా నడుచుకుంటుంది కానీ!"

"ఊఁ, నా మాట వినడానికే లోకులు కాచుక్కూచున్నారు!— మీరు చెప్పింది మాత్రం ఎవరంత చేసేస్తున్నారూఅంటా!"

ముసిలామెకి కోపం వచ్చేది—"నీను మప్పి మప్పి ఇంతయిందీ, ఇక దానికి మప్పేస్తే అయిపోతుంది! మీ ఇష్టం తల్లీ, మీకెలా తోస్తే అలా చెయ్యండి – నా పెరట్లో నా కూరమడి నాకు వుంది. నాకోసమేమీ చెయ్యమనడం లేదమ్మా, మా తల్లీ!"

పెరట్లో కొయ్యగూరమడి ముసిలామెకి ఉదయమూ సాయం కాలమూ పారాయణ గ్రంథం. ఎప్పుడు చూసినా ఒక బోడి కొడవలి పట్టుకొని, మడిలో ముడుచుకు కూచుంటుంది కొయ్యగూర కోస్తూను. మనవలూ, మనవరాళ్ళూ పెట్టుకొని వూసులాడడమూ, కొయగూర కొయ్యడమూ – ఇంతకి తప్ప లోకంలో ఆమెకింకో పనిలేదు.

కానైతే ముసిలామె అధికారం చాలావరకూ పెద్ద కోడలు చేతిలోకి వచ్చేసింది. ఇంటికి వచ్చిందీ పోయిందీ, ఇవ్వడమూ పుచ్చుకోవడమూ—

అన్నీ ఆమే చూసేది. తోడికోడలుమీద హెచ్చుగా అధికారం చెలాయించేది. చిన్న కోడలు అత్త ఎదట 'చూ⁽' * తప్ప మాట్లాడేదికాదు. అన్ని మాటలూ మౌనంగానే వినేది.

ఆవులూ, ఎడ్లూ, తక్కిన జంతువులూ మాట్లాడలేవు. మొద్దు మనిషికూడా అంతే. అంచేత వాళ్ళకేమీ తెలియదని అనుకుంటారు లోకులు. ఏమంటారా, నిష్కారణంగా ఎన్నో దెబ్బలు పడవలసి వస్తుంది వాళ్ళు. ఎంత అన్యాయమైనా నోరు విప్పలేరు. అదిగో చిన్నకోడలు అవస్థా అంతే. అన్నీ ఆమె మౌనంగా వినేది. కాని నోరు మెదపటానికి వల్లకాదు. ఆమెకోసం ఎప్పుడయినా అత్తమాత్రం కలగచేసుకొనేది అంతే.

ఎంతయినా ముసిలి మనిషి ; ఇంటిపనులు ఎంతని చూడగద్దు గనక ; అయితే ఇల్లు ఆమెదేకదా ; కోడళ్ళిద్దరి మూలాన ఇల్లు రెండు ముక్కలయి పోతుందేమో అని ముసిలామె మనస్సు మధ్యమధ్య కలత పడుతూ వుండేది.

---

* కొత్తకోడలు అత్తమామల ఎదట నోరు విప్పకూడదు. ఏమైనా చెప్పవలసివస్తే 'చూ⁽' అని ధ్వనిచేసి, సైగలతో చెప్పడం ఒడిశాలో ఒక పాతఆచారం.
—పురిపండా.

# 2

"పొద్దుటినుంచీ ధాన్యం ఎండలో అలా పడివున్నాయి. కసింత కలిపెయ్యడానికి ఎవళ్ళకీ కాళ్ళూ చేతలూ లేవా? ఏమమ్మా — నేను వొక్కతెనే తినేస్తున్నానా ఏమిటి ?— మరెవళ్ళకీ ముద్ద దిగటం లేదా ?"

"ఛీ. ఛీ. ఎప్పుడూ ఈ వొంతులాటే. ఎప్పుడూ ఇల్లు విరిచేసే మాటలే !"

"ఆఁ, అంతే మీకు తెలిసింది, మరేముంది ! నేనే ధాన్యం వుడికిస్తాను ! నేనే ధాన్యం దంచుతాను ! మరి, నేనే ఇల్లు ముక్కలు చేస్తాను ! తప్పంతా నాదే ! మిగిలినవాళ్లు మాత్రం తులిసి మొక్కలు !"

మిగిలిన వాళ్ళంటే మరెవళ్లూ కారు, చిన్నకోడలే. ఆమె మునసబు కూతురు — అపురూపమైన ఆడపిల్ల — కాస్తా ముద్దూ మురిపెంతో పెరిగింది. అత్తవారింటికి వచ్చినప్పుడు ఎంతో అంత సారె పట్టుకు వచ్చింది. ఇరుగూ పొరుగూ యావన్మందీ చూసి ముక్కుమీద వేలు పెట్టుకున్నారు. ఊరిలోని ఆడబిడ్డలు తండ్రులమీద అలిగారు. కోడళ్ళు లోపల లోపల సిగ్గు పడ్డారు. అత్తలు కోడళ్ళని గదమాయించినప్పుడు ఆమె మాటే సాటి తెచ్చేవాళ్లు. "ఏమే గొర్రెలి కూతురా, పధానుగారి కోడలు లాగ నువ్వేమయినా అందెల కడియాలూ, మురుగులూ సత్తూ, బావిలీలూ కన్నవారి దగ్గిరనుంచి పట్టుకు వచ్చి నా ఇల్లు నింపేసినట్టు విరగబడి పోతున్నావేమే !" అనేవాళ్ళు.

చిన్న కోడలికి ఏదయినా పెత్తాయించకపోతే * తనంతట తాను చొరవ చేసుకుని ఏదీ చెయ్యలేకపోయేది. అందరి దగ్గరా ఒదిగి ఒదిగి మసులుకునేది. కొత్తగా వచ్చిందాయె. అత్తా మామా వున్నారు. ఎలా బైటికి వస్తుంది? ఎవళ్ళతో అయినా ఎలా మాట్లాడుతుంది?

పెద్దకోడలు మాటకి అత్త ఎదురు చెప్పేది కాదు. పైగా మాటల్లో ఆమెని మించిపోయే వాళ్ళెవరు? అయినా కాకపోయినా న్యాయమంటూ ఒకటి వుండికదా! నిజం చెప్పాలంటే, ఆమె ఒక్క మనిషే — అన్ని పనులూ చేస్తుంది. కొత్త కోడలని చిన్నామె వూరికే కూచుంటుంది. ఇక్కడ వున్న చీపురు పుల్ల తీసి అక్కడ పెట్టదు.

"నెత్రీ! ఇలా రమ్మా. నేను 'హారాకి' పసుపు రాస్తున్నాను. నువ్వు కొంచెం ధాన్యం కలిపేసి వెళ్లమీ!" అంది అత్త.

పెద్దకోడలు ముసి ముసి నవ్వు నవ్వుతూ మెల్లి మెల్లిగా అత్తతో అంది. "మరి కొంచెం ముద్దు ముద్దుగా పిలవండి."

చిన్న కోడలు పేరు నేత్రమణి. బుంగలాగ మొహం పెట్టుకు వచ్చింది నేత్రమణి. ధాన్యం కలిపేసి వెళ్ళింది. అత్త మొహంమీద ఏమంటుందామె! మనుమరాలికి పసుపురాసేసి అత్త పెరట్లోకి వెళ్ళాక అంది — "అవ్వ! ఎన్ని వూసులు నామీద పడుతున్నాయో! ఏమమ్మా, నే నెవళ్ళకన్నా అచ్చున్నానా? ఎవళ్ళ సొమ్మేమన్నా తింటున్నానా? అందరూ నామీద విరుచుకుపడాలనే ఎప్పుడూ కాసు కూచుంటారు! ఎందుకమ్మా!"

పెద్దకోడలు గబ గబా వెళ్ళి అత్తగారిని పిలుచుకు వచ్చింది — "రండి, రండి, బుద్ధిమంతురాలు కదూ మీ కోడలు! నోట్లో వేలు పెడితే కరవదేమో!"

---

* పని చెప్పకపోతే: పురమాయించకపోతే

అత్త చిన్న కోడలిని గదమాయిస్తూ అంది—"ఊరుకో, వూరుకో అప్పెద్దిపదికదూ! దాని మాటకి ఎదురు చెప్పవచ్చా?"

చిన్నకోడలు వూరుకుంది. ఎంతయినా అత్తా మామా వున్న ఇల్లు కదా! "కోడలు వచ్చి ఏడాదయినా కాలేదు. బుద్ధి చూడండి" అనుకోరూ లోకులు!

చిన్నకోడలు అక్కడేమో వూరుకుంది. కాని భకడి దగ్గర వున్నవీ లేనివీ అన్నీ ఏకరువు పెట్టింది. తన సొంత కవిత్వం కూడా కలిపింది. అగ్గి కుమిలి కుమిలి ఎప్పుడో వొకప్పుడు పైకి వచ్చేస్తుంది కదా! ఎన్నాళ్ళని దాన్ని అణిచి పెట్టడం!

భకడికి ఇంకా పస్రతనం. పళ్ళకి బంగారం కట్టించుకున్నాడు. దక్షిణాది కుండలాలు పెట్టుకుని, బుజంమీద కావి గావంచా వేసుకుని వూరంతా తిరుగుతాడు. కలకత్తా వెళ్ళి వచ్చిన కుర్రాళ్ళతో జట్టుకట్టి తెల్లటి కమీజు మీద నల్లటి వేస్టుకోటు వేసుకుని, బుజానికి వెండి జూకాల బటువా సంచి వేలాడదీసుకుని, పరసలూ • పండుగలూ చూసి వచ్చేవాడు. సరిగ్గా వేళకి ఇంటికి వచ్చి అన్నం వడ్డించ మనేవాడు. ఆలస్యమయిందో కుండా మండా పగులగొట్టే వాడు. ముసిలి శామపధాను అనుకునేవాడు — "కుర్రతనం వొదల లేదు. మెడకి గంత కట్టేస్తే సరి, వాడంతట వాడే దారికి వచ్చేస్తాడు."

వీధిలో భకడి నోరు వినబడితేచాలు, ముసిద్ది కోడళ్ళని తొందర చేసేసేది — "వచ్చాడర్రా. చగలా వచ్చాడు. బిరబిరా వాడికోసం ఇగురో గిగురో చేసి పెట్టేయండి. లేకపోతే ఇంట్లో అగ్గి పెట్టేస్తాడు."

అవాళ 'సునాజోడి' పరస— పెద్ద పరస. పరసలో భకడి డబ్బులు వేసి జూదమాడాడు. రంగులరాట్నం మెక్కాడు. రామలీల చూచాడు. అర్ధరాత్రి ఇంటికి వచ్చాడు. ఉత్తి రోజుల్లో అయితే పధానుగారి ఇంటి

---

• ఉత్సవాలు

పిల్లలు పొద్దుగూకేసరికి నిద్రపోతారు. కాని అవాళ మేలుకునే కూచు న్నారు. చిన్నాన్న వాళ్ళకోసం ఏదో పట్టుకువస్తాడు. అందరికంటే చిన్న కుర్రాడు మాత్రం నిద్రపోయాడు. కానైతే చిన్నాన్న రాగానే తనని లేపెయ్యాలని పడుకునే ముందే వాళ్ళ అమ్మనీ, అక్కనీ హెచ్చరించాడు. ముసిలాయనా, పెద్ద కొడుకూ తిళ్ళు తినేసి నిద్రపోతున్నారు. ముసిలామె కనిపెట్టుకు కూచుంది. చిన్నకొడుకు వచ్చాక తింటుంది. కోడళ్ళిద్దరూ అత్త తినకుండా ఎలా తింటారు! వాళ్ళున్నూ పస్తుతో పడివున్నారు. సున్నా, హీరా కూచుని ముసిలమ్మ దగ్గిర కథలు వింటున్నారు.

విశాఖపట్నాన వీధిగుమ్మాన
వింత రాచకొడుకు బంతులాడాడు
బంతెళ్ళి పాలకొండ సభలోన పడితే
ఇది ఎవరి బంతని వివరించె రాజు
శ్రీకాకుళం వారి చిత్రాల బంతి
బొబ్బిలి వారిదే బంగారు బంతి___

"అమ్మా, వొలే అమ్మా!" వీధిలోంచి ఛకడి కేక వినపడింది.

"ఏమర్రో, చగలా వచ్చాదర్రో!" అంటూ చప్పున తలుపు తెరవడానికి వెళ్ళింది ముసల్ది. చిన్నాన్న ఏమిటి తెచ్చాడో అంటూ ముసిలమ్మ వెనకాలే పరిగెత్తారు సున్నా, హీరాలు. తమ్ముణ్ణి లేపడానికి వెళ్ళింది కడసారి చిన్న చెల్లి. రసుకోరాలూ, పాకంపట్టిన పేలాలూ, వక్కలూ, ఆకులూ, బంగాళాదుంపలూ, ఉల్లిపాయలూ మొదలైనవి ఎన్నో పట్టుకొచ్చాడు ఛకడి. పిల్లల చేతుల్లో ముందు నాలుగేసి రసు కోరాలు పెట్టేసింది ముసిల్ది. కాని అంతమాత్రాన పిల్లల మనస్సు తృప్తిపడుతుందా? ఊహూం. అందరూ బలబలా చూస్తున్నారు. చిన్నాన్న ఇంకా ఏమిటో తెచ్చేవుంటాడు. చిన్న కుర్రాడు నిద్రనుంచి

లేచి కళ్ళు నులుపుకుంటూ వచ్చాడు. చిన్నాన్న దగ్గర రాసుకుంటూ నుంచున్నాడు.

చిన్నాన్న పెద్దరికం చూపిస్తూ అన్నాడు. — "ఏమర్రా పిల్లలూ, రసుకోరాలు తిన్నారు కదా, మరేమిటి చూస్తున్నారు? వెళ్ళండి, పడుకోండి." ఏమయినా ఒకంతట వొదిలి పెడతారూ పిల్లలు? వాళ్ళకి తెలుసు, చిన్నాన్న తప్పకుండా బొమ్మలూ అవీ తెచ్చేవుంటాడు. అయితే ఆ మాట ఎవరూ నోరు విప్పి చెప్పడం లేదు. ఇంతలో చిన్నాన్న జేబులోంచి ఎర్రటి దేదో పైకి వచ్చింది. ఆశతో నలుగురి కళ్ళూ చిన్నాన్న చేతిలోని ఆ వస్తువు మీద వొక్కసారి వాలాయి. అది వెలుతురు దగ్గిరికి తెచ్చి పట్టుకున్నాడు చిన్నాన్న. చిన్న బొమ్మ — బాతులా అవుపిస్తోంది— "అరే, ఇదేమిటి? కొంచెం నొక్కితే చాలు — కూ: కూ: అంటోంది!"

"ఎవరికి కావాలి?" అంటూ చిన్నాన్న మీదికి ఎత్తి పట్టుకున్నాడు బొమ్మ. నలుగురు పిల్లలు ఎనిమిది చేతులూ వొక్కసారి చాచారు. నలుగురు నోళ్ళనుంచీ వొక్కసారి వినపడింది. "చిన్నాన్నా నాకూ, చిన్నాన్నా నాకూ!"

ఐతే కడసారపు కుర్రాడికి దొరికిందది. తరవాత సంచిలోంచీ జేబులోంచీ వొకదాని తరవాత వొకటి బైటికి వచ్చాయి—బాజా, హార్మనీ, పీపా.

ఒకరు బాజా కోసం ఏడిస్తే, ఒకరు బొమ్మకోసం ఏడ్చారు. ఈ ఏడుపులో వొకరు పీప వూదారు. ఇల్లు ఇల్లంతా విరగబడి పోయింది.

ముసిలి శాపపధాను నిద్ర తేలిపోయింది. విసుక్కుంటూ అన్నా డతడు — "ఇంట్లో అడుగు పెట్టాడో లేదో పిల్లలతో రామగోల మొదలు పెట్టాడు. వెళ్ళు, కాశీమట్టు వెళతావో కలకత్తా వెళతావో, ఎక్కడికి వెళతావో వెళ్ళు. వీడు కాశీమట్టి వెళతాడు, కలకత్తా వెళతాడు — గడించుకు- వచ్చి నన్ను పోషిస్తాడు!"

కలకత్తా వాళ్ళ క్రాఫింగు తలలూ, ట్రంకు పెట్టెలూ, లాంతర్లూ చూసి తానూ విదేశం వెళతానని తండ్రితో పాపం ఎన్నిసార్లో అన్నాడు ఛకడి. ఎందుకురా, పూరుమట్టి కంపు కొట్టిందా ఏమిటి? 'తాటిచెట్టు ఎందుకెక్కావంటే దూడగడ్డికోసం' అన్నాట్ట. తాతముత్తాతలు ఇక్కడే కళ్ళు మూశారు. మరి నువ్వు మాత్రం ఇంత గడించేసి రాతిపనె తయారు చేస్తావు! అనేసేవాడు తండ్రి. ఛకడి ఎప్పుడయినా, ఏదయినా తప్పుచేస్తే చాలు ముసిలాడు ఆ మాట ముత్తాయించేవాడు.

భోజనం చేశాక పడక గదిలోకి వెళ్ళాడు ఛకడి. చిన్న గది. అందులో పైగా పుంజెడు పెద్ద పెద్ద వులవల కట్టలు. చిన్న మంచమయినా లేదు. కింద తుంగచాప పరిచి, దానిమీద చింకిబొంతలు రెండు పరిచి, పక్క తయారయి వుంది. గోడదివ్వె గూటిలో పొన్ననూనె దీపం పెమ్మిద వెలుగుతూ వుంది. గూటికింద నూనె జిడ్డుకట్టి వుంది, మీద దీపం పొగతో మసిబారిపోయి వుంది. పెడకలో రెండు ధాన్యం కుచ్చులు వేలాడుతున్నాయి. వాటిమీద చిన్న చిన్న ధాన్యం పురుగులు ఎగురుతున్నాయి. ఒక పక్క రెండు వుట్టెలు వేలాడుతున్నాయి. రెండు వుట్టెలలోనూ రెండు కుండ లున్నాయి. వాటిమీద వొక్కొక్క మూకుడు. ఒక కుండలో పధాను భార్య మానిడి వొరుగు దాచిపెట్టింది. మరోదాంట్లో కసిన్ని ముక్కిపోయిన ఆవాలు. కింద ఎత్తుగా పెట్టిన మామిడిచెక్కబల్లమీద వొక బెత్తుపెట్టె, వొక వెదురుపెట్టె వున్నాయి. తమలపాకులికి సున్నం రాశాక వేళ్ళు వెదురుపెట్టెకి రాసేసే వాళ్ళు. అందుకని, పెట్టె మీద సున్నం పెచ్చులు అక్కడక్కడ అవుపిస్తున్నాయి. గోడమూలల సాలెపట్లు వేలాడుతున్నాయి. మీద బొగ్గదెలు పడఎడ ఎగురుతున్నాయి. లోపలినుండి బైటికీ, బైటనుండి లోపలికీ ఎగురుతూ దోమలు నోట్లో వేసుకుంటున్నాయవి. ఉలవల కట్టలకింద ఎలకలు కరకరా మన్ను తవ్వుతున్నాయి. మొత్తంమీద చెప్పాలంటే గదంతా సామానూ, పురుగూ

పుట్రాను. దయతిలిచి మనుషుల కోసమని అని బారెడంత స్థలం వొదిలి పెట్టేసి నట్టుంది. ఛకడి పడక గదికంటే, బరజా, ముసిలి పధానుల పడక గదులు మరీ పాడు. ఛకడి గదిలో రెండు రాధాకృష్ణుల పటాలయినా వున్నాయి. వాళ్ళ గదుల్లో వొక మూల ఎలకల మన్ను కుప్పపడి వుంటే, వొక మూల బట్టల్ళ రెట్టలు. అవన్నీ రోజూ కుప్పపడేవి, రోజూ బాగయేవి.

పాపం ఛకడి అదృష్టానికి ఇలాంటి గది దొరికింది ఏం చేస్తాడు? ఒక్క గదిమట్టు కయినా మంచి కొంప కట్టిందికి తనకి దిక్కులేక పోయింది. ఇంటి ఖర్చు వెచ్చాలు అన్నీ తండ్రిచేతిలోనూ అన్న చేతిలోనూ వున్నాయి. తనని చూసే వాడెవడు? మంచిదొక లాంత రయినా కొనగలిగాడా? మంచిదొక పెట్టయినా సంపాదించ గలిగాడా? ముసలి తండ్రి ప్రతీదానికీ అడ్డే చెప్పాడు. ఊరు వొదిలి వెళ్ళవద్దంటాడు. పరాయివాడి దగ్గిర చాకిరీ చెయ్యవద్దంటాడు. అన్నకూడా అంతే — తన కోసం పల్లెత్తి వొక మాటన్నా అనడు: లోపల లోపల తండ్రిమీదా, అన్నమీదా ఛకడి కారాలూ మిరియాలు నూరేవాడు.

ఇంటిపనులు ముగించి, అందెలూ కడియాలూ ఘుణ ఘుణ లాడిస్తూ ఛకడి భార్య నేత్రమణి పడక గదిలో ప్రవేశించింది ఛకడి దిక్కు కన్నెత్తి చూడలేదు. పల్లెత్తుమాటన్నా ఆడలేదు. తలుపు దగ్గిర పైటచెంగు పరుచుకుని పడుకుంది. ఇవాళ ఏదో గందరగోళం జరిగిందని వూహించాడు ఛకడి.

ముసిముసి నవ్వు నవ్వుతూ అడిగాడు — "ఏమందోయ్, ఏం జరిగిందేమిటి ఇవాళ?" ఇల్లాలు మాటాడలేదు. చెయ్యిపట్టి లేవనెత్త బోయాడు ఛకడి. చెయ్యివిసిరిగొడుతూ అంది ఇల్లాలు— "పోపో, ఆ ముద్దు పిలుపులూ అవీ నీ వొదిన దగ్గిరా, దాని పిల్లలదగ్గిరా వొలికించు."

"అరే, మాటాలేదు. మంతీలేదు, ఇలా ఇదయితే — ఏమిటిది?"

"మాటా మంతీ! ఏమిటి మాటా మంతీ? — ధాన్యం ఎండ వేసిందికి చేతులు పడిపోతున్నాయి. కాళ్ళు తెగిపోతున్నాయి! కాలి

పోతున్నారు, మండిపోతున్నారు! ఎందుకమ్మా? ఏ ముండ సొమ్మయినా, తింటున్నానా, నేను! ముడుతున్నానా? కాలిపోవాలని ఎవతయినా నన్నేంను కనాలీ అంటా? "

"ఏం, నువ్వూ అలాగే అనకూడదూ!"

"నేనేమిటనేది? నోరు విప్పితే ఇంట్లో పాదీ విరుచుకుపడతారు. నీకు నోరు పెగలకపోతే — అలాంటివాడివి పుస్తె కట్టి పెళ్ళాడా వెందు కంటా!"

అచ్చుతపురం వక్కల కత్తెరతో పోకచెక్కలు కత్తిరిస్తూ నెమ్మది నెమ్మదిగా అన్నాడు ఛకడి — "ఒలే, అదెవతే? మాలదా, మంగలిదా? ఈ ఇల్లు దాందా ఏమన్నానా? అదెలాంటిదో నువ్వూ అంత పాటిదానివే — నిన్నననడానికి అదెవతె?"

నేత్రమణి మూతి తిప్పేసుకుంటూ అంది— "రామాయణమంతా విని రాముడికి సీత ఏమవుతుందన్నాట్ట! వింటున్నావుకదా, అడ్డమాని మాటలూ అంటున్నాది. తిరిగి అడుగుతావేమిటి?"

"అరే, నువ్వు ముందు మాటకి మాట తగిలించు — తరవాత నేను చూసుకుంటా."

"ఆ, నువ్వు చూసేస్తావు, మశానం! చెవులో గూడు కట్టుక పోరాను కదా, దాని పిల్లల్ని నువ్వు ముట్టవద్దని విన్నావూ?"

"అదేమిటి, ముసిలాయన డబ్బిచ్చాడు కదూ, వాళ్ళకోసం బొమ్మలూ అవీ తెమ్మని! నేనేమిటి నాచేతిడబ్బు పెట్టితెచ్చానాఏమన్నానా?"

"ఏమమ్మా, ఊళ్లో మరెవళ్ళూ పరస చూసిందికి వెళ్ళలేదా?"

"అరే, ఇంటిమనిషి వొకడు వెళుతూవుంటే పరాయి వాళ్ళ చేత ఎవరయినా డబ్బులిస్తారూ?"

తణుకూ బెణుకూ లేకుండా అబద్దాలు చెప్పుకుపోయాడు ఛకడి. ఆడమనిషి అబద్ధాలు చెప్పకపోతే వినుకుంటుందామరి! అన్నా, వదినా

పగవాళ్ళు కావచ్చు – పిల్లలేం తప్పుచేశారు? పాపం, భకడి ఏం చెయ్య గలడు? ఎన్ని విధాల భావించినా ఎంచేతో పిల్లలకోసం అతడి మనస్సు విలవిల లాడిపోయేది. అందుకని, ఇల్లాలికి చాటుచేసి వాళ్ళని కొంచెం ముద్దులాడేసేవాడు, ఎత్తుకునేవాడు. చిన్న బొమ్మో, పసుకోరావుందో కొని తెచ్చేవాడు. చాటునీ మాటునీ వాళ్ళ చేతిలో పెట్టేసేవాడు. "ఇదిగో పిన్నితో చెప్పారంటే మరెప్పుడూ ఇవ్వను," అంటూ ముందే జాగ్రత్త పడేవాడు.

# 3

జీవనం–మరణం! మెలకువా – స్వప్నం! రెంటికి రెండూ వేరు వేరు ప్రపంచాలు. కానైతే, రెంటికీ ఎడమంటూ లేదు–వొకదానొ్నకటి అంటపెట్టుకునే వున్నాయి. మనిషి వొకదానిమీద ప్రయోజకత్వం చూపిస్తాడు. రెండో దాని దగ్గిరికి వచ్చేసరికి మతిపోతుంది. ఇల్లూ, వాకిలీ, భార్యా బిడ్డలూ – అందరినీ వొదిలిపెట్టేసి మనిషి జీవనం నించి మరణానికి వెళ్ళవలసి వస్తుంది. పిలుపు! తప్పించుకోవడం ఎవడితరం? మనిషి! ప్చ్! చిల్లిగవ్వ చెయ్యని ప్రాణి!

బిరజు పఠాను ఇంటికి ఇవాళ ఆ పిలుపు వచ్చింది!– ముంచు ముసిలామె కోసం. చావుంది – పాత కొత్తవుతుంది. పండుజుత్తు* నల్లబడుతుంది. పసివుండడ మెందుకంటా? కోడళ్ళిద్దరూ కాళ్ళు పడుతున్నారు. మనుమడూ, మనుమరాళ్ళూ తల నిమురుతున్నారు. ఛకడి కూచుని భాగవతం చదువుతున్నాడు.

దీపం కునుకుతూ వుంది. ఇంట్లో సగం సగం వెలుగు. మిగతా అంతటా వొకటే చీకటి. జీవనదీపం – నూనె చెల్లిపోతే అదిన్నీ ఇలాగే కునుకుపాట్లు పడుతూ వెలుగుతుంది.

దీపం భగ్గు భగ్గు మంటూ వెలిగింది–ఇంట్లో పొడవాటి నీడలు నాట్యం చేశాయి. ముసిలామెకు [illegible] నిండిపోయాయి.

---

* నెరసిన జుట్టు

మనమడూ, మనమరాళ్లూ, కొడుకులూ, కోడళ్లూ, కట్టుకున్న భర్తా - యావత్తు సంసారమూ వెనకపడి పోయింది- ఇల్లూ, వాకిలీ, కూడబడీ_మాయా, మమతా అంతా వొదిలి పోయింది. ముసిద్ది వెళ్ళి పోయింది. పిసరంత పధానపడాలో ఆ కబురు ఇంటింటా పాకిపోవడానికి నిమిషం పట్టలేదు. జనం నోళ్లలో వొకటే మాట-"ముసిలమ్మ పుణ్యాత్మురాలు. కనకనే పునిస్త్రీచావు దొరికింది. పండు నుదుటిమీద కుంకం బొట్టుతో వెళ్ళిపోయింది. పైగా ఏకాదశినాడు హరీ అని కళ్లు మూసింది."

ముసిలామె చనిపోయి నప్పుడు రామపధాను ఏడవడం ఎవ్వరూ చూడలేదు. శవం వెనకాల కొంతదూరం పేలాలూ గవ్వలూ చల్లివచ్చాక అతడన్నాడు. "నేను మరి ఎన్నాళ్ళని! ఏడాదీ, ఆరు మాసాలికిమించదు! ముసలివాన్ని వొదిలి ఈ రెండు రోజులూ గడిపెయ్యలేనూ?"

ముసిద్ది వెళ్ళిపోయింది. ఏదీ ప్రపంచం ఎక్కడా మారిపోలేదే! పిసరంతయినా మార్పులేదు. రోజూ కనపడే సూర్యుడి చుట్టూ, ఈ బహు పురాతనమైన భూమి యథాప్రకారం తిరుగుతూనే వుంది. విరూపా నదిలో అదే ప్రకారం జలధార ప్రవహిస్తూనే వుంది. ఒక్క క్షణమయినా ఏదీ ఆగలేదు. పధానపడాలో వ్యవసాయమూ, పరిశ్రమా, పంటా, రాబడీ, చెట్టూ చేమా, పొలమూ పెరడూ_అన్నీ వున్నాయి.

రామపధాను బరజుని పిలిచి అన్నాడు. "ఒరే బాబూ, మరి ఎన్నో రోజులు లేవు నాకు. ఇప్పు డిక నువ్వు నౌకరీ అదీ చేసి. ఎటు బడితే అటు తిరిగావో, ఏమో ఎప్పుడెలా వుంటుందో, కళ్ళు మూసే ముందు నిన్ను చూడలేకపోతాను...."

బరజు ఏమంత హెచ్చు చదువుకున్న మనిషి కాడు. ఊరి వీధి బళ్లో అతడు చదివిన చదువుకి, జమీందారీ గుమాస్తా, లేదా వకీలు గుమాస్తా, ఇంకా అధికమయితే సెటిలుమెంటు అమీనూ - ఇంతకి తప్ప పెద్ద ఉద్యోగ మేదీ దొరకదు. ఒకటి రెండు చోట్ల గుమాస్తాగిరి చేశాక,

ఇప్పుడు సెటిలుమెంటు అమీను పని చేస్తున్నాడు. నౌకరీ మానెయ్యమని ఎన్నోసార్లు చెప్పాడు తండ్రి— "ఎందుకంటా? మనం తక్కువ వాళ్ళం. మన కింత ఆడంబర మెందుకు? మట్టి తవ్వీ తవ్వీ తాతలూ తండ్రులూ ఏడుతరాలు గడిచిపోయింది. నాగలి వొదిలేసి కలం పడితే మాత్రం ఏమంత స్వర్గానికి వెళ్ళిపోతామా?"

బరజు కూడా గ్రహించాడు — ఒకడి చాకిరీ చేసి వొకడి కాళ్ళు పట్టీ, మరొకడి నెత్తిమీద కాలు పెట్టడం, అధికారం చెలాయించడం— ఎంతసిగ్గుమాలిన పని! కానైతే ఇల్లూ సంసారం, పిల్లా జెల్లా వున్నారాయె! వాళ్ళకోసం మనిషి ఏదో కొంత చెయ్యాలికదా! అందుకని, తండ్రి నౌకరీ మానెయ్యమని ఎన్నిసార్లు చెప్పినా అన్నిసార్లా "ఊఁ, మానేస్తాను" అనేసి కొన్నాళ్ళు తోసుకుపోయేవాడు. నౌకరీ తాడిచెట్టు నీడ లాంటిది. ఇప్పుడుంటుంది. మరో క్షణంలో పూడుతుంది. దానిమీద ఆధారపడద మేమిటి? అయినా తండ్రితో ఇవాళ కొంచెం వాదిస్తూ అన్నాడు. "మానెయ్యాలంటే లిప్తలో మానెయ్యవచ్చు. అయితే, ఏం చేసినా కాస్త ముందూ వెనకా ఆలోచించి చెయ్యాలి. నౌకరీ వొదిలేస్తే ఇంతలో ఏటా కొంటూ వున్న భూమి పిసరంత మరి కొనలేం కదా!"

కొడుకు తెలివి తక్కువ చూసి ముసిలి పధాను నవ్వుతూ అన్నాడు. "వొరే వెర్రాడా, ధనం కూడబెట్టడం వొట్టి పిచ్చితనం. కొడుకు బుద్ధిమంతు డయితే ధనం దాచడ మెందుకు? కొడుకు బుద్ధిమాలిన వాడయితే ధనం దాచడమెందుకు? అని లోకోక్తి. డబ్బు కూడబెట్టడ మన్నది ఎప్పుడూ పనికిరాదు."

"డబ్బు కూడబెట్టడం పాపమా?"

"ఉత్తి పాపం కాదు, మహా పాపం. డబ్బు దాచడమంటే దొంగ తనం చెయ్యడమన్న మాటరా బాబూ, కేవలం దోపిడీ చెయ్యడమన్న మాట. మన ఊళ్లో హరిమిశ్ర గారిని చూడూ! ఎంతమంది పేదసాదల

గొంతుకలు కోసి సంపద కూడబెట్టాడో! అదంతా సంపదే అనుకుంటున్నా వటోయ్! కాదు. మరుగుతున్న ఉసురు. కాల్చేసి వొదిలిపెడుతుందోయ్! కాల్చేస్తుంది. లోకమంతా కాల్చేసి బుగ్గి చేసేస్తుంది. సెటిలుమెంటు డబ్బు నౌకరీ డబ్బు, ఇదంతా ఉసురుకొట్టిన డబ్బు. హాలాహల మది– ఎక్కడ పడితే అక్కడే మండుతుంది."

బరజు చేస్తున్న అమీను పనిలో కడిగేసిన జీతపురాళ్ళు తప్ప చిల్లి గవ్వయినా అధికం చేతికి వచ్చేదికాదు. లోకులు ముక్కుమీద వేలు పెట్టుకుని అనేవాళ్ళు, 'లంకలో హరినామం–అమీనయి, పైగా కస్పీ* లాగక పోవడమా? రెండేసి సెటిలుమెంట్లు చూశాం–ఈ మాట వినలేదు. ఇవాళ కళ్ళతో చూశాం."

నిజానికి బరజు చాలా నిజాయితీ మనిషి. ఎవళ్ళదగ్గిరా వొకవంగ పిందెకోసమయినా కక్కుర్తిపడ్డపాపానపోలేదతడు. ఏ వూళ్లోనూ బత్తెం గింజల కోసమయినా నోరువిప్పి ఎరగడు.

తండ్రి మాటమీద బరజు కొంచెం నొక్కి అన్నాడు. "నౌకరీ చేసి ఎవడయితే రెండు రాళ్ళు లంచం తింటాడో వాడిది తప్పుకావచ్చు. తన జీతం రాళ్ళుతప్ప ఎర్రని ఏగాని కోసం ఆశపడకపోతేనో___"

"అవునోయి, అన్నీ తెలుసు నాకు. నౌకరి చేస్తున్నావు. జీతం తెస్తున్నావు – లంచం తినలేదు. నిజమే. కాని ఆ జీత మెవరిస్తున్నారు? నీ బాబెక్కడయినా దాచిపెట్టాడా? జీతం, జీతం, బాబులూ, అధి కారులున్నూ. ఎవరి డబ్బుతో ఈ గర్రా• అంటా! ఈ తలమాసిన వాళ్ళ డబ్బుతోను. ఈ బాబుగిరీ, ఈ అధికారమూ, పెద్దరికమూ-ఎవరి వల్ల? ఒకపూట తిని, మూడు పూటలు పస్తు పడుంటార్రే, అదిగో ఆ పేదల వల్ల. ఈ యంత్రాలూ, కార్ఖానాలూ, రైళ్ళు, వోడలూ, మేడలూ

---

* లంచం

• గర్వం

మిద్దెలూ — ఎలా తయారయాయి? మన ఈ పేదవాళ్ళ రక్తమోడ్చి కదూ తయారయాయి? కాక, రెండు పుంజీల మంది వాళ్ళూ అధికార్లూ వెళ్ళి తయారు చేసేశారా?"

షఘాను ముసలాడికళ్ళు రెండూ తళతళా మెరిశాయి. ప్రపంచంలోని పేదలకోసం, దుఃఖజీవులకోసం, పీడితులకోసం, పదదళితులకోసం లోకం ముందు నిలబడి, గొంతెత్తి చాటిచెపుతున్నట్టు అతడి హృదయం ఉప్పొంగింది

బిరజు రెండు కళ్ళలోనూ నీళ్ళుతిరిగాయి. తండ్రి నోట మరిరెండు మాటలు వినాలన్న అభిలాషతో అడిగాడు. "అయితే అధికార్లూ, సిపాయిలూ, వకీళ్ళూ మన మంచి ఏమీ చెయ్యలేదంటావా?"

"ఓ, చెయ్యకేం! కావలసినంత మంచి చేస్తున్నారు! దొంగల నించీ దోపిడిగాళ్ళ నించీ కాపాడుతున్నారు. కన్నగాళ్ళనించీ గొంతుకలు కోసే వాళ్ళనించీ రక్షిస్తున్నారు. ఎవరన్నా ఏదన్నా తప్పుపనిచేస్తే వాళ్ళకి తగిన శాస్తి చేస్తున్నారు. ఎవరన్నా మోతుబరి మరొకరి పొలం బలవంతంగా సాగుచేశాడో కచేరీలో దాని న్యాయవిచారణ చేస్తున్నారు. అయితే, ఈ దొంగలూ, ఈ కన్నగాళ్లూ మనలోని మనుషులేకదా! మనం ద్రోహులమూ, నేరస్థులమూ అనేకదా, ఇంతమంది ముసద్దీలూ, ఇంత మంది వకీళ్లూ, అధికార్లూ, ఉద్యోగస్థులూ, సిపాయిలూ బంట్రోతులూ వున్నారు! మనమేకదా వీళ్ళని సృష్టించాం? అందుకనే నేను చెపుతున్న దేమిటంటే - వాళ్ళు మరేమీ కాదు, మన దుష్కర్మల అభిశాపం, మన పాపఫలం! మన పాపం యెంత పెరుగుతూవుంటే, ఈ ఉద్యోగులూ, వకీళ్ళూ అంత పెరుగుతున్నారు. మనమే మంచివాళ్ళమైతే ఇంతమంది అధికార్లెందుకు? పోలీసు లెందుకు? వకీళ్ళు, ముఖ్తారులూ ఎందుకు? ఇన్ని జయిళ్ళు దేనికోసం? ఇంతమంది ఎర్రపాగాలు ఏం చేస్తారు?"

కొడుకు — "అయితే, మనకి పుణ్యమిక యెక్కడినుంచి వస్తుంది? డబ్బూ, సంపదా అక్కరలేదుకదా, — నడ్డివంచి బురదలో కలుపు తీసేవనే

మనకి మిగిలిందన్నమాట! గొప్ప వాళ్ళంతా మనల్ని పీడించకపోతే మరెవళ్ళని పీడిస్తారు?"

ముసిలాయన నవ్వుతూ అన్నాడు. "డబ్బూ సంపదా పెట్టి అన్నీ కొనవచ్చునోయి. కాని పుణ్యం మాత్రం కొనలేం. డబ్బుపెట్టి టిక్కెటు కొనేసి వైకుంఠానికివెళ్లే ఉపాయంలేదు. పుణ్యం కొనాలంటే మనుష్యత్వం కావాలోయి! మనుష్యత్వం యెక్కడ యెంత తక్కువయితే, అక్కడ అంతపాపం పెరుగుతుంది."

ఈ మాట నిజమే. బరజు తన కాలంలో చూసి వస్తున్నాడు — నౌకరీచేస్తే మెల్లి మెల్లిగా మనుష్యత్వం ఏష్యమయి పోతుంది. చంద్రుణ్ణి రాహువు మింగేసినట్టు మనిషిలోపల పిశాచం చూస్తూ వుండగానే మనుష్యత్వం మింగేస్తుంది. రోజూ కూలి చేసుకునే పేదపనివాడు ప్రపంచంలో చెయ్యందేముంది? తిండీ గుడ్డా లోకానికి ముఖ్యం — ఈ రెండూ అతడే కదా సమకూరుస్తున్నాడు! మనిషి గాలిపీల్చి బతుకుతాడని యెన్నిసార్లో రోజూ అనుకుంటాడు బరజు. అలాగే ఈ పేదకూలి వాళ్ళని పీల్చి లోకం బతుకుతుంది. ఆ మాట మాత్రం యెవ్వరూ అనరు.

నౌకరీ మానెయ్యడానికి నిశ్చయించుకున్నాడు బరజు. ఏడు తరాల నించీ పట్టి తవ్వడమే తనవృత్తి. అదే చేసుకుంటే పరువుపోతుందా ఏమన్నానా?

ముసలిప్రధాను అన్నప్రకారమే, ముసిల్ది కళ్ళుమూసి ఏడాది నిండలేదు. తనకీ వచ్చింది వారంటు. వారంటు అందగానే ముసిలాయన చిరునవ్వు నవ్వుకున్నాడు. బరజుని పిలిచి అన్నాడు. "ఒరే బాబూ, నా పనేమో అయిపోయింది. ఇక మీ సంగతి మీరు చూసుకోండి. ఒక్కటి మాత్రం నేను చెపుతున్నాను. మీరు యిద్దరూ అన్నదమ్ములు కదూ! చూడూ, పొలంమధ్య గట్టు పడకూడదు. కొంపమధ్య గోడ లేవకూడదు. ఇది మాత్రం నువ్వు కాయాలి."

పెద్దకోడలు పిల్లలికి నేర్పిపంపింది. వాళ్లు వచ్చి ముసిలాడి దగ్గిర మారాము చేశారు - "తాతా, మాకోసం యెక్కడ ఏమిటి దాచావు?" ముసిలాడు రెండుసార్లు కళ్లు విప్పాడు. ఎవళ్ళనో వెదుకుతున్నట్టు బలబలా చూశాడు. మళ్ళీ కళ్లు మూసేశాడు. పెద్ద మనమరాలు హోరా కేకవేసి పిలిచింది. "తాతయ్యా మాకోసం ఏమిటి దాచావు?" ముసిలాడు మళ్ళీ కళ్ళు విప్పి చూశాడు - ఈ మాటలు ఎంత దూరం నుంచో విని పిస్తున్నట్టున్నాయి. తల నిమురుతూ కూచున్న ఛకడి తెలిసేటట్టు మరో మారు చెప్పాడు. ముసిలాళ్ళు చచ్చిపోయేముందు పిల్లాజెల్లా కోసమని డబ్బూ దస్కం దాచిపెట్టడం రివాజు. ముసలిఫధాను ఏమిటి దాచాడు? అతడు చిన్న చిరునవ్వునవ్వి, వొకవేలు మీదికి చూపిస్తూ అన్నాడు. "మీ కోసం ధర్మం! ధర్మం!"

ముసిలాడి కళ్లు మూతలు పడిపోయాయి. మరి విడలేదు. కొడుకులూ, కోడళ్లూ, మనమలూ, మనమరాళ్ళూ గొల్లుమన్నారు. శవం గది లోంచి బైటికిరాగానే పెద్దకొడుకు బరజు పధాను కళ్ళలోంచి కన్నీళ్ళు - అయిదారు చుక్కలు రాలిపడ్డాయి. గావంచాతో కళ్లు తుడిచేసుకుని అపర క్రియలో నిమగ్నుడయాడు. తక్కిన వాళ్ళని ఓదారుస్తూ అన్నాడు, "సరే, ఏముంది బతుకూ చావూ - ఇంతే ప్రపంచం!"

ముసిలి పధాను కాలం చేసిన కబురు వూరు చుట్టుపక్కల నిమిషాల మీద పాకిపోయింది. అందరియింటా పెద్దబుర్ర రాలిపోయినట్టయింది. అహా! చెప్పుకోదగ్గ మనిషి. వెయ్యిమందిలో వొక్కడని లెక్కపెట్టాలి, ఏడు జానల జాగా ప్రతీవాళ్ళూ కొనుక్కున్నదే. వుట్టికట్టుకు వూరేగుతూ ఎవ్వరూ వుండిపోరు. అయినా, ఈ మట్టిలోంచే బంగారం పుడుతుంది. ఈ మట్టిమీద బంగారం తునక ముసిలాయన.

మనిషి మంచీ చెడ్డా
కళ్ళు మూశాక తెలుస్తుంది.

బరజు చాల నికరమయిన మనిషని వూళ్ళో అందరికీ తెలుసు. అందుచేత గ్రామప్రధాను కాలం చేశాక లోకులన్నారు. "తండ్రిపేరు నిలబెడితే బరజు నిలబెడతాడు" అని. తండ్రి గుర్రమెక్కితే కొడుకున్నూ కొంచె మెక్కుతాడు. తండ్రిలాగే బరజున్నూ బలమైనవాడు — అయిదడుగుల మనిషి. తలకీ గావంచాగుడ్డ చుట్టుకొని ఉదయం మొదలు పొద్దుగూకే దాకా పొలమూ తోటా అంతటా తిరుగుతూనే వుంటాడతడు. ఇంటికి వచ్చాక రెండుకాళ్ళకీ నూనెమర్దనా చేసుకునేవాడు. 'తలమీద పాగా, పాదాలికి నూనేవుంటే వైద్యుణ్ణి వెక్కిరించవచ్చు' అని తండ్రి చెప్పి పోయాడు.

నిజానికి బరజు చిర్రున చీదడం ఎవళ్ళూ చూడలేదు. ఎండనికాదు, వాననీకాదు, చలనీకాదు — అన్ని ఋతువుల్లోనూ అలాగే పొలంలో పనిపాట్లు చేసివచ్చే వాడతడు. ధాన్యంకట్ట భుజంమీంచి కిందపెడితే యిద్దరు మనుషులు ఎత్తలేక పోయేవారు. నీళ్ళు తోడిందికి గూడ పట్టుకుంటే తనతో నలుగురు మనుషులు చెమట్లు కక్కుకునేవాళ్లు. తానొక్కడూ అలాగ గూడ పట్టుకుని నిలుచుని వుండేవాడు.

బరజు నిజాయితీ చూసి అతడంటే లోకులు ఎంతో ఖాతిరీ* చేసేవాళ్ళు. బంగారం ముద్దపడివున్నా అతడు కన్నెత్తి చూసేవాడు కాదు. మీదొక చిల్లిగవ్వ అతడి దగ్గరవుంటే కోరి ఇచ్చేసి మరీ వెళ్ళేవాడు. ఒక దమ్మిడీ ఎవళ్ళదీ తినేవాడు కాదు. అందుచేత లోకులనేవాళ్ళు, "బరజు భాయి దగ్గిరవున్న డబ్బు మనమొలలో వున్నట్టే. జగన్నాథస్వామి పూజమారితే మారవచ్చు. కాని బరజుపదాను నోరు తెరిచి వొకమాట అన్నాడు అంటే అది మారదు. ప్రాణం పోతేనేం గాక, పీక తెగిపోతేనేం గాక— ఆ మాట జరిగి తీరుతుంది. తప్పదు."

* మర్యాద

అయితే ఏం లాభం, బరజు ఇల్లాలు మాత్రం అతణ్ణి పోలింది కాదు. చీటికీ మాటికీ జట్టీ[1] పెట్టుకు కూచుండేదామె. నలుగురు పిల్లల తల్లినని ఆమె గర్వం. అంచేత బూమిమీద నడిచేది కాదామె. అందరూ తనని గౌరవించాలని పట్టుపట్టేది. అంచేత బరజుకీ ఆమెకీ ఎన్నోసార్లు పేచీ వచ్చేది.

అయితే ఈ పేచీలక్కీ, ఆదరించడానికీ, గౌరవించడానికీ బరజుకి తీరికేదీ! ఇంటి సంగతి తెలుసుకుందికి పగలు క్షణమయినా తీరిక వుండేది కాదతడికి. రాత్రి రెండు మెతుకులు నోట్లో వేసుకుని పక్కమీద వాలిపోయే వాడు. ఇల్లాలు ఇంటి పనులన్నీ ముగించాక వెళ్ళి కాళ్లు పట్టడానికి కూచు నేది. బరజు నిద్ర తేలిపోయాక, చిన్న కోడలు మీదా, మరిది మీదా గొణగడం ప్రారంభించేది, "అత్తమ్మ వుండేది, మామయ్య వుండేవారు. ఏమాటా బైటకి వచ్చేదికాదు. వీడు, కోతిలాగ నిన్నటి గుంటడు[2] వీడా నన్నంటాడు. లంజ అని! ఎందుకని! నువ్వేవడివిరా, నన్ను అనడానికి! నువ్వా నన్నంటావు? పులి వొండ్[3] లో లేడి నాటకమాడిందట! ఇన్నేళ్లు వచ్చాయికదా, ఎక్కడ సొమ్ములు[4] పడి ధాన్యం మేసేశాయని కానీ,ఎక్కడ పొలం పాడయిపోయిందని కానీ వొక్కనాడయినా చూసిన పాపాన పోయావా? అన్నిటికీ వొక్కమనిషే పరిగెత్తి చిక్కిశల్యమై పోయాడు. ఈ గడపా ఆ గడపా తిరిగి తిరిగి, వూరికే వేళకి ముద్దకోసం ఇంటికి దిగబడతావు. పయిగా నన్ను లంజ అంటావా? పెళ్ళాంగారు కూచున్న దగ్గిరనించి ముడ్డి కదపదు బియ్యపు గింజలు పొయిదగ్గిర కెలావస్తాయో తెలియదు. పయిగా మాట వచ్చేసరికి మొగుడూ పెళ్ళాం ఇద్దరూ పెద్ద

---

1 పోరాటం; 2 పిల్లవాడు 3 గుహ, 4 పశువులు

పులుల్లాగ మీద విరుచుకు పడతారు. అవి ముండా అంటుంది. పిల్లలు చచ్చినదానా అని తిడుతుంది. వీడు లంజా అంటాడు. బాగానేవుంది వాటం, నేనేం అడుక్కు తింటున్న బికారిదాన్నా? నాకు ముందూ వెనకా ఎవళ్ళు లేరా?"

కానైతే భర్త ఎంతసేపయో నిద్రపోయి గుర్రు పెడుతుంటాడు. ఇల్లాలు గొణుక్కొని గొణుక్కొని తుదకి నిరాశ చేసుకుంటుంది.

అయితే భాగవతం పార్వతీదేవి వినకపోతేనేం గాక, శుకమహర్షి వింటూ వుండేవాడు.

చిన్న కోడలు గోడ దగ్గిర చెవులు పెట్టుకుని అన్నీ వినేది. విని వచ్చి ఛకడి దగ్గిర ఏకరువు పెట్టేది.

"అన్నయ్యా అన్నయ్యా అని ఇదైపోతున్నారు కదూ, రండి విందురు కాని, పెళ్ళాం సొంతం కాకండా మీరయిపోతారూ? పెళ్ళాం వున్నవీ లేనివీ నూరిపోస్తున్నాది. మొగుడు దానికి తాళం వేస్తున్నాడు. 'ఇంటిపనంతా అదెందుకు చెయ్యదూ? వూరికే తేరగా కూడుని వొక మనిషి తింటుందా?' అంటున్నాడు. కూచోపెట్టి వీడు నాకు తిండి పెడుతున్నాడా? ధాన్యం వుడకపెట్టడం మొదలుకుని అన్నం వండడమూ, వడ్డించడమూ దాకా ఎవర్తె చేస్తున్నదీ అంటా, ఇక నాకేం పట్టింది?"

ఇన్ని మాటలూ వొక్కసారి వొట్టి అబద్ధమని ఛకడి తెలుసుకోలేక పోయేవాడు. అన్నయ్యని బైట లోకులెలా చెప్పుకుంటున్నారో, లోపల అతడలా కాదన్నమాట, హరిమిశ్రగారు చెప్పినమాట నిజమే, బరజు పైకి మాత్రం మెత్తని మనిషి.

హరిమిశ్ర పంచాయితీ ప్రెసిడెంటు. బరజుని లోకులు దేవుడిలా చూసేవాళ్ళు. అది హరిమిశ్రగారికి కంటకంగా వుండేది. అందుకని మాటి మాటికీ బరజు మీద నిందలాడుతూ తిరిగేవాడాయన. అన్నగారి దోషాలు భార్య నోట వినేవాడు ఛకడి. హరిమిశ్ర నోటా వినేవాడు. కాని నోరు విప్పి అన్న దగ్గిర ఏమీ అనలేకపోయేవాడు.

అన్నయ్య తనకంటే వయస్సులో ఎంతో పెద్ద- పదేళ్ళ కంటే హెచ్చే. బిరజుపథాను ఇల్లంటే చుట్టుపట్ల పదివూళ్ళ వాళ్ళు ఎరుగుదురు. పాపం ఛకడి పేరయినా ఎక్కడా వినపడేది కాదు. తండ్రి చచ్చిపోయేక తన అవస్థ అధ్వాన్నంగా వుందని తట్టింది ఛకడికి. ఎత్తి పొడవడానికి పైగా ఎల్లప్పుడూ సిద్ధంగా వుండనే వుంది ఇల్లాలు.

ఏప్పుడో వొకనాడు ఛకడి పేకాటనుంచి ఇంటికి వచ్చేసరికి ఇంట్లో పాలులేవు. ఒకనాడు కూర చాలలేదు. మరోనాడు అన్నం కుండ అడుగుది, గంజి బాగా వొంచలలేదు. ఇల్లాలు మనస్సుకి ఇదంతా బాధగా వుండేది. "ఏమమ్మా, నాకేమన్నా ఆరుగురూ ఏడుగురూ వున్నారా ఏమన్నానా? ఒక్కగాక ఒక్క మనిషి. అతడు తృప్తిగా రెండు మెతుకులు తినక్కర లేదా? అవసరం లేదు. నేనిక్కడవుండి ఎవరికేం చెయ్యాలని! మీ అన్ననీ, వొదినీన్నీ పెట్టుకుని మీ మానాన మీరుండండి. నాకన్నవారు నాకున్నారు. రోజూ పదిమంది వచ్చి తేరగా తిని పోతున్నారు. నా కడుపు మాత్రం పస్తుంటుందా ఏమిటి?"

మొదట ఇవన్నీ ఛకడికి అసహ్యం వేసేవి. కాని రాను రాను అల వాటయిపోయాయి. ఆడారి* వాడిలా తాను ఎంత కాలమని ఇలా పడి వుంటాడు? వాథఖటాయీ, హోలుసాహూ అన్నదమ్ములనుండి వేర్లయి పోయారు, వాళ్ళకేం గడవడం లేదా? మరింత బాగున్నారు కూడాను. ఆ మాటకివస్తే. దుకాణాలు పెట్టుకుని. చేతితో నాలుగురాళ్ళు మిగలేసుకుని మా అంతవాళ్ళం మేం అంటున్నారిప్పుడు. అన్న దగ్గిర వుండి ఛకడి కిపుడు ఏమంత మిగిలిపోతున్నదని! వాని వేర్లవడం ఎలాగ? ఎవరామాట ముందు లేవదీస్తారు?

---

* ఆడంగిలేకి

# 4

నాలుగు దిక్కులా వరిచేలు పచ్చగా అవుపిస్తున్నాయి. పైన ఆశ్వయుజమాసం నీలి ఆకాశం— కరకరా ఎండనెత్తి మీదబెట్టేస్తూవుంది. మధ్య మధ్య చిన్న చిన్న తెల్లమబ్బులు దాబుదాబుగా సూర్యుడి ముందు నుంచి తేలిపోతూ వెళ్ళిపోతున్నాయి. వాటి నీడలు పొలం తరవాత పొలం దాటిపోతున్నాయి దూరదూరాన చెట్లమాటున దాగున్నట్టున్నాయి. ఉండి వుండి గాలి కదలిపోతూ వుంది. ఈ పచ్చటి మళ్ళమీంచే దానినదక. ఆకాశం ఎంత ఎత్తో! ఎంత నీలంగా వుందో! భూమిమీద మనిషిచేసే ఈ పనితనం చూసి అది నివ్వెరపోయి చూస్తున్నట్టుంది.

ఈ శోభలో అక్కడక్కడ పొలాలమధ్య ఎన్నో నల్ల నల్లటి జంతువులు వంగి ఏహో పని చేస్తున్నాయి. ఒకదగ్గిర కొంగలమంద, ఒక దగ్గిర చిలకల గుంపు— ఈ పొలంమీంచి ఎగిరి ఆ పొలం మీద వాలుతున్నాయి. ఆ పొలంమీంచి లేచి దూరంగా వూరికింద కలిసిపోతున్నాయి. ఈ వరిచేల్లో వంగివున్న నల్ల జంతువుల దృష్టి వీటివేటి మీదా లేదు. ఈ పొలాల్లోని పక్షులూ, సూర్యుడూ, ఆకాశమూ— వీటన్నిటిలాగే ఈ జంతువులున్నూ పాతివే, రోజూ వుండేవే. ఎండనిలేదు, వాననిలేదు, చలనిలేదు, మంచనిలేదు— పన్నెండూ నెలలూ, ఆరు ఋతువులూ, మున్నూటారవై రోజులూ ఇలాగే వొకే విధంగా వుంటున్నాయవి. ఎన్ని కాలాలో గడిచిపోయాయి. నేటికీ ఆ జంతువుల శరీరాలకోసం వొక అంగిపిసర దొరకలేదు. ఒళ్ళు కప్పుకుని బాగా కట్టుకుందికి— ఆరుమూళ్ళ గావంచా

ఎనిమిది మూరలు కాలేకపోయింది. అందుకని వాళ్ళు మనుషులు కారు. జంతువులు. ఉత్తి మట్టి, మట్టి మట్టి వాళ్ళ వృత్తి పుట్టినప్పటినుంచీ చచ్చినదాకా అంతే. మట్టిలోనే పుట్టుక. మట్టిలోనే పడక. మట్టిలోనే మనుగడ. మట్టిలోనే ఇల్లు. మట్టి తవ్వితేనే కడుపు నిండుతుంది. మట్టి మనుషులు!

ఈ జంతువుల్లో బరజూపదాను ఒకడు – నల్లికొక మాసిన గావంచా చుట్టుకున్నాడు. తలకి పాగాచుట్టేసి వరి మొక్కల్లో వంగి పనిచేస్తు న్నాడు. యుగ యుగాలనుంచీ ఎంతోమంది బరజులు ఇలా బురదకుమ్మి. వీపున ఎండభరించీ మనుష్య జాతి కోసం ఆహారం సిద్ధం చేస్తున్నారు. ఒక ఆసా, ఒక భాసాలేపు వాళ్ళకి. కళ్ళుండిన్నీ చూడలేరువాళ్ళు: చెవులుండిన్నీ వినలేరు. నాలిక వుండిన్నీ మాట పెగలదు. చెవిటివాళ్ళు. గుడ్డివాళ్ళు. మూగవాళ్ళు! తమ దుఃఖం తాము తెలుసుకోలేరు. తమ మాట తాము చెప్పుకోలేరు – అచ్చంగా గొడ్లు!

సకారణంగా అయినా, నిష్కారణంగా అయినా వీపు పెళ్ళిపోనీ. తిట్లూ చీవాట్లూ వర్షించనీ, యజమాని ముప్పూటలు తిండి పెట్టకపోనీ – దేనికీ అడ్డు చెప్పటమంటూ ఎరుగరు వాళ్ళు.

జదుదశెయి బరటూ పొరిగింటివాడు. వరసకి తమ్ముడవుతాడు. పక్క పొలంలో ముడుకులమీద వంగి కలుపుతీస్తున్నాడతడు. ఇద్దరూ మాటా మంతీ ఆడుకుంటున్నారు. తక్కిన వ్యవసాయదార్లు తమ యింటి విషయాలూ, పొలం విషయాలూ మాట్లాడుకుంటున్నారు.

అంతా అదృష్టంరా బరజన్నా అదృష్టం. నిరుడు చెరుకుతోట ఎంచక్కా ఏపుగా పెరిగింది. ఈ ఏడు ఎలాంటి మొక్కలు అలాగే వున్నాయి. ఎదగకుండా పెట్టిన మదుపన్నా వస్తుందో రాదో!

దానికి నువ్వేం చెయ్యగలవు? మనం సాగు చేసేవాళ్ళం కాయ కష్టంలా సాగుచేస్తాం. అంతే. అయినా ఫలించకపోతే మన చేతిలో ఏముంది?

"ఏదిమాత్రం మన చేతిలో వుందిరా - అదృష్టం - అదృష్టమే అన్నిటికీ మూలం. అదృష్టం లేకపోతే ఎవడిస్తాడు? కుర్రాడు? కాయిలా పడ్డాడు - ఎంతోమంది దేవుళ్ళకి ఎన్నో అన్ని ముడుపులు మొక్కాను. మంగళా అమ్మవారికి ఎంతో అంత ఇది చేసాను. ఏం లాభం! ఎవ్వరన్నా వుంచగలిగారా? అంతా వుత్తిదేరా అన్నా. అదృష్టం వొక్కటే గొప్పది. కుర్రాడు బతికేవుంటే ఈఏడు నాకు విచారం లేక పోను. ఆరు నెలలపాటు కలకత్తా వెళ్ళిపోయివుంటే, జగ్గుస్వామి బకాయి ధాన్యం వుండిపోయేదా?"

"మనిషి అనుకున్నట్టే అంతా జరిగిపోతూవుంటే ఇక -"

"అవును, నిజం చెప్పావురా అన్నా, మనిషి అనుకోడంలో ఏమీ లేదు. అదృష్టం మూలం. అదే మన్ను బంగారం చేస్తుంది. బంగారం మన్ను చేస్తుంది."

బరజు చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. "కళ్ళముందు కనపడ లేదూ, హరిమిశ్రగారి కొంప - అదృష్ట మెలా ఎత్తిందో!"

అవునురా అన్నా, లోకంలో ధర్మం వుందని ఎలా అనుకోడమిక! ధర్మం వూరికే పురాణాల్లోనూ, భాగవతంలోనూ మాత్రమే! హరిమిశ్ర బ్రాహ్మడు మళ్ళీని - ఏం చెయ్యలేదు చెప్పు - ఎన్ని కొంపలు కూల్చడం లేదు! ఎంతమంది పీకలు పిసకడంలేదు! అవాళ పదిమందీ చూస్తూనే వున్నారు. సెటిలుమెంటు బాబు ఎదట దేవుడి తులసి పట్టుకు ప్రమాణం చేసేసి, జెనాగారి పొలం చపాయించేశాడు.* పాపాల భైరవుడు - వాడి గుండెలెలా భరించాయిరా! అయితే వాడికి లోపమేం వచ్చిందంటా! నిక్షేపంలా ఇంటినిండా ధనం కలకల్లాడుతూ వుంది. ఇది చూశాక లోకంలో ధర్మం వుందని ఎవడంటాడు చెప్పు!"

---

* కాజేశాడు.

బరజా పధాను ఆపాదమస్తకం పణికిపోయాడు. ధర్మం లేదూ? ఉత్తి అధర్మం, అన్యాయం, పాపం — ఇదేనా వుంది? మానవజాతి దీని మీదేనా బతుకుతూ వుంది? అడివి మనుషుల్లో, అందరిలోకీ బలమయిన మనిషి తన భార్యనీ, పిల్లలినీ, బలంలేని తక్కిన నలుగురినీ చంపుకు తింటుందంటారు. బలమున్న పోతుపిల్లి నక్కినక్కి సొంత పిల్లల్ని చంపుకు తినేస్తుంది. మనిషికూడా అంతేనా? చుట్టుపక్కల ఇరుగు పొరుగు వాళ్ళని పదిమందినీ చంపుకుతినేనా బతుకుతాడు? డబ్బులోనో, బుద్ధిలోనో, లేదా బలంలోనో కొంచెం బాగా జోరున్నవాడు, శక్తిలేని ఇరుగు పొరుగు వాళ్ళనీ, చుట్టుపక్క నిరుపేదల్ని చంపేసి, దోచుకునీ తాను దుక్కిదన్నవలసిందేనా? అయితే, ఇంతేనా మానవుడు! భాగవతంలో చెప్పింది మనుషులకోసం కాదూ? అధర్మం కోసమా రామాయణమూ, మహాభారతమూ జరిగింది?— ఇదంతా మానవజాతి కోసంకాదూ?

బరజు గట్టిగా అన్నాడు, "ధర్మం వుంది రా తమ్ముడూ, వుంది. మనం పాపుల మయినంత మాత్రాన ధర్మ మెటు పోతుంది? వీళ్ళనీ వాళ్ళనీ అనడమెందుకూ, స్వయంగా మనమే నేరస్థులం. ధర్మం కోసం ఉడతలాంటిది వారధిమీద కసింత మట్టి వేసింది. కోతులు వెళ్ళి ప్రాణాలొడ్డాయి. వందలకొద్దీ రాజులూ మహారాజులూ భార్యా బిడ్డలమీద మోహం విడిచిపెట్టేసి రక్తం ధారపోశారు. మరి, మనమేం చేస్తున్నాం?— మనలో ఇంటికొక వొంపు. తండ్రీ కొడుకుల మధ్య, అన్నా తమ్ముల మధ్య, ఆలు మొగుల మధ్య — వొకరిమాట వొకరికి నచ్చదు. ఇందులో వొకొక్క హితమిత్రులు దూరి నీకూ నాకూ పొరపొచ్చలు పెట్టి, కోతి మిఠాయి పంచినట్టు మధ్య అంతా చపాయించేస్తున్నారు. తప్పంతా వాళ్ళది వొక్కరిదేనా మరి! మనం కేవలం కడిగేసిన ఆణిముత్యాలమా? ఊరికే మంగళా అమ్మవారి దగ్గిర దండాలు పెడితే అమ్మవారు రాకాసిని మనిషి చేసెయ్యదుకదా! మనలో ఏం మనుష్యత్వం వుందని వాళ్ళనీ వీళ్ళనీ నిందించడం!"

"ఉఁహూఁ, అదేమీ కాదురా అన్నా, అంతా వొక ఎత్తు, అదృష్టం వొక ఎత్తు. హరిమిశ్ర అదృష్టం గొప్పది. అందుకని అతడే సాహుకారు. అతడే జమీందారు, అతడే పెశిడెంటు. అతడి చేతిలోనే పోలీసులు. అతడి చేతిలోనే అధికార్లు. ఇదంతా అదృష్టం — అదృష్టం గొప్పది కాకపోతే ఇదంతా ఎలా సాగుతుంది?"

"తమ్ముడూ నిజమేరా, నువ్వన్నమాట నిజమే — అదృష్టమే అంతాను. అయితే, వర్షం పడలేదు. చెరుకుతోట తగలబడిపోయింది, అది అదృష్టమంటే వేరేమాట. కాని నీకూ నాకూ కయ్యం పెట్టేసి, నీ పొలం నా పేర రాయించేసి చెయ్యి తడిచేసుకున్నారు హరిమిశ్రగారు. దాంతో అమీనులు వచ్చారు, పోలీసులు వచ్చారు, మేస్రీట్లు వచ్చారు, వకీళ్లూ, ముస్త్యారులూ వచ్చారు. మనం నష్టల్లో కొట్టుకుపోయాం ఇది వేరేమాట. ఇక్కడ మన అదృష్టమంటే మరేమీలేదు — మన అదృష్టం హరిమిశ్ర. తెలిసిందా!"

కొంతదూరంలో వొక ఎద్దులబండి — ఇరుసుకి కందినలేక — 'కేఁ కటకట కేఁ' అని అరుచుకుంటూ మెల్లిమెల్లిగా నడుస్తూ వుంది. బండి వాడి గదమాయింపూ, ఎడ్లమీద కొరడా దెబ్బలూ మధ్య మధ్య వొక్కొక్క పిసర పదం, "హరిహరీ నారాయ — ఆదినారాయణా — వొహో!" — వినిపిస్తున్నాయి. బరజు పధానుమాటలు వంచేలమీద, గాలికెరటాల నాట్యంతో కలిసిపోయి చప్పున నాలుగుదిక్కులా పాకిపోయినట్టయాయి.

జదుదతెయి అన్నాడు, "సరే అన్నా, అంతా తెలిసిందిలే. కాని నీ మాటలు ఏదో అసందర్భంగా అనిపిస్తున్నాయి నాకు. హరిమిశ్ర చెడ్డ వాడు, కాని వకీళ్లూ, మేస్రీట్లూ మనకి మేలు చెయ్యడం లేదంటావా?"

"అవును. అది వాళ్ళ దయాధర్మభిక్ష. వాళ్ళు మేలు చేస్తే మన అదృష్టం మంచిది. కీడుచేస్తే మన అదృష్టం చెడ్డది. మొత్తంమీద మనం చెడ్డవాళ్ళం కాబట్టికదా ఈ తతంగమంతా!"

"అవునురా అన్నా. వందమాటల్లో నికరమయిన మాట ఇది లోకం చెడ్డది గనకే ఈ బాదరబందంతా. ఒక్క మనిషి మంచివాడై కూచుంటే మాత్రం ! తక్కినవాళ్ళంతా దొంగలయినప్పుడు. ఆవొక్క మంచివాడికీ జాగా ఎక్కడుంటుంది ?"

"ఒకడూ వొకడూ కలిస్తేనే కోటి మందవుతారు. ఒకడు మంచి వాడయితే మరి పాతికమందిని మంచివాళ్ళని చేస్తాడు. ఒక్కదగ్గిర పువ్వు పూస్తే నాలుగు దిక్కులా గమ్ముమనిపిస్తుంది. పువ్వుకి ఎంత వాసన వుంటే అది అంతదూరం ఘుమ ఘుమ లాడిస్తుంది."

ఎడ్లబండి 'కేఁక టకట కేఁ' అరుపూ బండివాడి గదమాయింపూ, ఎడ్లమీద కొరడాదెబ్బలూ, మధ్య మధ్య వొక చరణం పదమూ — 'మాద వుడే గోవులూ యాదవులు కాయంగా మాదవుడు మచ్చావతారమైనాడూ, ఒహో !—' అన్నీ దూర దూరం మెల్లి మెల్లిగా వెళ్ళిపోతున్నాయి.

అక్కడ ఇంటిదగ్గిర — పిల్లలికి వొకళ్ళకి రెండు చద్దిమెతుకులు పిడిచిపెట్టీ, వొకళ్ళకి పిడికెడు మురమురాలు వొళ్ళోపోసీ పెద్దకోడలు బిరజు భార్య పలకర్ర నములుతూ చెరువు నీలాటిరేవు చేరుకుంది. అత్త కళ్లు మూసినప్పటినుంచీ, తోడి కోడళ్ళిద్దరికీ చుక్కెదురు. ఒకరిమాట ఒకళ్ళు సహించేవాళ్ళుకారు. మాటకిమాట — కస్సుమంటే బుస్సుమనే వాళ్లు. ఇంట్లోపని వొంతులేసుకున్నారు — పశువులికి కుడితి పెట్టడమూ, సొమ్ముల సాల * పరిశుభ్రపరచడమూ, పిడకలు వెయ్యడమూ, ధాన్యం వుడక పెట్టడమూ చిన్నకోడలు పని. వంటా వడ్డణా, వచ్చేవాళ్లూ పోయే వాళ్లూ — ఇదంతా పెద్దకోడలు పని. ఒకరి పని వొకరు పిసరంతయినా చేసిపెట్టరు. పెద్దకోడలు వొకనాడైనా ధాన్యం ఎండ వెయ్యదు. చిన్న కోడలు వొకనాడైనా రెండు పుల్లలు పెట్టి పొయ్యి రాజెయ్యదు.

---

* పశువుల పాక

పెద్దకోడలు పలకర్ర నములుతూ నీలాటిరేవు చేరగానే, ఆమె జట్టు అమ్మలక్కలు వొక్కొక్కరూ రేవులోకి దిగబడ్డారు. మణమ్మ రేవు లోంచి పిడికెడేసి మన్నుముద్దలు తీసి ఇత్తడి మురుగులు కస్సుపస్సు తోమేసుకుంటూ అంది, "ఏమే పెద్ద కోడలా, ఇదేమిటే యివాళ ఇంత ఆలస్యం!"

"ఏమిటో, పసుపు నూరాను, మసాలా రుబ్బాను. పెద్దదానికి పిడికెడు పకాళీ మెతుకులు వడ్డించాను, చిన్నవాళ్ళిద్దరికీ యిన్ని మురమురాలు వొళ్ళో పోశాను—"

మణమ్మ తవ్విపోస్తుంది— "ఏమమ్మా, చిన్నావిడ నీ పిల్లల తిండీ అదీ చూడదు?"

"అది మోతుబర్ల ఇంటి పడుచే, నా పిల్లలు దానికి కంపుకొడతారు! మొగుడూ పెళ్ళాం ఇద్దరూ గదిలో వూసులాడుకుంటూ కూచుంటారు. ఇటు కూటికుండ పొంగిపోనీ, పిలిచి పిలిచి గొంతుకు చించుకున్నా లోపల నించి పైకి రాదు."

శారదమ్మ పలకర్రతో ముక్కుపుడుక తోముకుంటూ అంది. "ఛీ ఛీ.. వయసిందికదా, మొగుడుదగ్గిర ఎల్లప్పుడూ కూచుంటుందీ! బరజుతల్లి వుంటే, ఈ మాట చెవిని పడివుండునా!"

పెద్దకోడలు అంది, 'ఏమిటి అంతేనటే అప్పా, పెద్దబావ అక్కడే ద్వారం దగ్గిర కూచునే వుంటారు, ఆలుమొగులు — తమ్ముడూ మరదలూ నవ్వుతూ సరాగాలాడుతూ వుంటారు, ఎవరన్నా వింటే ఇదేం సానికొంపా అనరూ!"

బోడి పండా ఆవిడ దోసిళ్ళతో నీళ్ళు దేవుడి కెత్తిపోస్తూ అంది,. "ఇది కలికాలం కదర్రా, ఇహనుంచి ఎన్నో కొత్త కొత్తవి చూస్తారు. ఎన్నో కొత్తమాటలు వింటారు. మాకు ముప్ఫయ్యేళ్ళు వచ్చేదాకా మేం వీధిగుమ్మం తొక్కలేదు. మొగుడు మొహం చూడలేదు. ఈ కాలంలో మరదలూ పెదబావా— ఛీ ఛీ, —ఈ మాట నోటికి రానివ్వకండి!"

చిన్న కోడలు యింట్లోంచి చెవులు చాచింది. ఏదో మిషమీద పెర ట్లోకి వచ్చింది. అన్ని మాటాలూ విన్నాది. ఛకడి వచ్చాక విన్నమాటలన్నీ చెప్పింది. విననివీ చెప్పింది. ఛకడి ఏం చేస్తాడు? అన్న ఎదట చెప్పడానికి అతడికి సాహసమేదీ?

చిన్నకోడలూ పెద్దకోడలూ ఇప్పుడిహ ముఖాముఖి కయ్యం ఆడడం మొదలు పెట్టేశారు. అత్తా మామా లేరు కదా. వీళ్ళంతవాళ్ళు వీళ్ళు! ఎవళ్ళనెవళ్ళు లక్ష్య పెడతారు? ఎవళ్ళ మాట ఎవళ్ళు వింటారు? కూచుంటే కయ్యం, నిలబడితే కయ్యం. మాటిమాటికీ కయ్యమే. పెద్ద కోడలు కూచుని వుంది. చిన్నకోడలు ఆ దారిన నడిచి వెళ్ళింది. పొర పాటున పెద్దకోడలికి చిన్నకోడలు కాలు తగిలింది. "విష్ణు" అంటూ చెయ్యి నుదుటికి తగిలించుకుని చిన్నకోడలు వెళ్ళిపోతూ వుంది. పెద్ద కోడలంది, "ఏమే, మనుషులు కనబడలేదా ఏమిటే? నడిచి వెళుతూ మనిషిని తన్నేసి పోతున్నావు." మొహం విసురుకుంటూ చిన్న కోడలంది, "ఏమమ్మా మనుషులు కూచుందుకి స్థలం లేదూ? వచ్చిపోయే దాట్లోనే కూచోవాలా ఏమిటి?"

"ఏమే యింతపోతరం! తాపుకి తాపు తన్నావు, పైగా మీద విరుచుకు పడుతున్నావు!"

చిన్నకోడలు మాటకిమాట చేరుస్తూ అంది, "ఏమమ్మా, ఎవళ్ళ సొమ్మేమన్నా ఎవళ్ళు తింటున్నారా ఏమిటి? ఎందుకనరూ! అనక భయ పడతారా ఏమిటి?"

మాటమీద మాట పెరిగిపోయి, యిద్దరు తోటికోడళ్ళు నోటికి వచ్చినట్టు పురాణం విప్పారు. వాళ్ళన్న మాటలన్నీ నిఘంటువుల్లోలేవు.

బరజూ ఛకిడీ యింటికి వచ్చారు. పొలంపని చేసుకువచ్చాడు బరజూ. రెండు కోసుళ్ళ దూరంలో దొమ్మరిసానాట చూసి వచ్చాడు ఛకడి. ఇద్దరూ కయ్యం సంగతి విన్నారు. ఒకడు చిన్న కోడలు నేరం

విన్నాడు. ఒకడు పెద్దకోడలు నేరం విన్నాడు. ఛకడి అన్ని మాటలూ విని ఇల్లాలిని తారీఫు చేసూ అన్నాడు, "అదిగదీ, యిలా మాట మీద మాట తగిలిస్తేనే నెగ్గుతాం." ఇల్లాలు వైఖరి మరోలా వుంది. మొహం ముడిచేసి అందామె, "ఈ ఆడారి సరాగం మాటలు దాచిపెట్టు. పిడికెడు తి టున్నానని పదిమంది బికారిముండల దగ్గిర నేనెందుకు పడాలి? పిడికెడు మెతుకులు తిని, వొక గుడ్డ ముక్క కట్టుకుందికి నాదేమీ లేదు కనకనా!"

ఆమెదేముందో, ఏమిలేదో ఆమెకి తెలియదు. తెలిసుంటే ఛకడికి తెలిసుండాలి. అయితే, ఏ పొలం ఎంత సాగో అతడికీ తెలియదు. భార్యని వోదారుస్తూ అన్నాడతడు, "సరే, కానీ — వుండు, ముందు అన్నయ్య ఏమంటాడో చూద్దాం."

చిన్నకోడలు మండిపోతూ అంది, "పెట్టుకో నీ అన్నా నీ వదినా— వాళ్ళు వాళ్ళ పిల్లలూ పెట్టుకుని నీ మట్టుకు నువ్వుండు— నాకు మాత్రం ఒక కుండ వేరు చేసిపెట్టు."

పక్కకదిలో బిరజు కేవలం చిన్నకోడలు తప్పులే విన్నాడు. ప్రతీదానికి వూరుకుంటే ఇక గడవదని బోధపడం దతడికి. తన భార్యకీ బోధపరిచి బోధపరిచి విసిగెత్తిపోయాడు. లాభం లేకపోయింది. నమ్మకం మీద లోకం నడుస్తూ వుంది. నమ్మకం నశిస్తే తండ్రీ కొడుకూ, భార్యా భర్తా, అన్నా తమ్ముడూ, రాజా ప్రజా — ఎవళ్ళ మధ్యా ఏమీ సంబంధం ఉండదు. తోడికోడళ్ళిద్దరిలో నమ్మకం లేదే అనుకోండి, అయితే అన్న దమ్ము లిద్దరి మధ్యా వుండాలి కదా! అదిన్నీ తగ్గిపోయింది.

భార్యకి అన్ని విధాలా బోధపరిచాడు బిరజు. చివరికిలా అన్నాడు, "మీ ఈ జట్టీలవల్లే, చూస్తున్నావు కదా, ఉదయం నుంచీ సాయంకాలం దాకా నేను ఇంటిపట్టుని వుండడం లేదు. ఇక కాదంటావా, రాత్రుళ్లు కూడా ఆ కాస్తా రావడం మానుకుంటాను."

పెద్దకోడలు లోకం మీద దేనికీ అంత భయపడేది కాదు. కాని బిరజు విషయంలో మాత్రం ఆమెకి ఎక్కడలేని భయంగా వుండేది. బిరజు తిక్కమనిషి. తనకి ఎంత తోస్తే అంత. ఒక్కొక్కప్పుడు దోమ లాంటి దాన్ని చంపినా సహించలేడు. ఒక్కొక్కప్పుడు మీరు ఏడవండి, నెత్తి కొట్టుకోండి, చావండి- పిసరంత కన్నెత్తి చూడడు. ఇలాంటి మనిషిని కట్టుకోమని పెద్దకోడలు నుదుటి మీద రాసిపెట్టాడు బ్రహ్మ. లోకం మీద ఆలుమగలు లేనేలేరా! ఇదిగో, ఛకడీ చూడండి - నవ్వుతూ తుళ్లుతూ తీరికలేకుండా వుంది. ఇవాళ వేయించిన కొమ్ము సెనగలయితే, రేపు జిలేబీలు, ఎల్లుండి పెద్దంచుకోక! ఇతనూ వొక మనిషే మరి! చెప్పి చెప్పి నోరు పీకి పోయింది, పండుగనాడూ, పబ్బంనాడూ వొక నగ చేయించి పెడతాడూ! ఏదో కొంప మునిగి పోయినట్టు ఎల్లప్పుడూ బుంగ లాగ మొహం పెట్టుకు కూచుంటాడు. పైగా పంతగొట్టుతనం బోలెడంత! తాను నోచుకొన్న నోము లలాటివి! అయ్యో పాడు కర్మ!

పెద్దకోడలు జంకుతూ అంది,"ఊఁ మీరదే భయపెడతారు నన్ను! పెళ్ళాం బిడ్డల్ని దిక్కుమాలిన వాళ్ళను చేసి వెళ్ళి పోతారు! ఎందుకని? జట్టీ • ఎలా బందయిపోతుందో ✱ చెప్పకూడదూ!"

బిరజు చెప్పిందంతా ఇల్లాలికి అసంభవంలా అనిపించేది. బిరజు అన్నీ వినేవాడు- అన్నీ గ్రహించేవాడు - చివరికి భార్యదే తప్పనేవాడు. ఆమె పెద్దది. ఆమె ఎలా నడిపిస్తే అలా తప్పనిసరిగా చిన్నకోడలు నడుచు కుని వుండేది. కనక జట్టీ అంతటికీ పెద్దకోడలే తప్పకుండా బాధ్యురాలు. ఆమే ముందు యింటికి వచ్చింది. ఎన్నాళ్ళయో అయినింటి కోడలై వుంది. ఇల్లాలుగా వుంది. ఇంటి మంచీ చెడ్డా యావత్తూ నడిపింది. అందుకని నేరస్థుల్లో ఆమే మొదటి నేరస్థురాలు!

---

• దెబ్బలాట ✱ అగిపోతుందో

మొహం బుంగలా పెట్టుకుని అనేది భార్య "ఆఁ నా మాటవినాలని అది కనిపెట్టుకు కూచుంది!"

భర్త అనేవాడు, "అది వినకపోయినా ఆ తప్పు దానిది కాదు. నీదే. ఎంచేతనంటావా, నువ్వు పెద్దదానివి. దానికంటే నీ బుద్ది పెద్దది. దానికంటే నువ్వు హెచ్చు తెలసిన మనిషివి."

రెండు కన్నీటి ధారలు కార్చి పెద్దకోడలంది, మీరు మీ తమ్ముడు తట్టూ, మరదలి తట్టూ చెప్పక నా తట్టు చెపుతారా ఏమిటి? నేనే మీకు పరాయిదానిని!"

బిరజు ఎన్నో విధాల బోధపరచి చెప్పాడు. పురాణాల్లోంచీ, ఇతి హాసాల్లోంచీ మంచి మంచి కథలు చెప్పాడు. ప్చ్, ఏం లాభం భార్య వినుకోలేదు.

ఛకడికి సొంత కాపరంమీదా, సొంతంమీదా, అధికంగా మనస్సు పెరిగెడుతూవుంది. తానూ తన భార్యా, ఈ ఇద్దరూ తప్పిస్తే తన వాళ్ళన్న వాళ్ళు మరెవరూ లేరు తనకి. అన్నా, వదినా వాళ్ళ పిల్లలూ— వీళ్ళంతా తన నుండి దూర దూరంగా తొలగిపోతున్నారు. ఇవాళదాకా అన్న ఎదట తాను తిన్నగా నడిచిన పాపాన పోలేదు. ఒకనాడయినా అన్నయ్య 'ఛకడీ, పొలానికి వెళ్ళు, ధాన్యం కొయ్యి' అని పని బెత్తా యించలేదు. ఆ అన్నే ఇపుడు పరాయివాడిలా అనిపిస్తున్నాడు! పరసకి వెళ్ళివస్తే పిల్లలకొసం రసుకోరాలూ, పాకంపట్టిన పేలాలూ, కోతీ, పిల్లీ, బొమ్మలూ మరి తెచ్చేవాడు కాడతడు. ఎంచేతనంటే, నేత్రమణి అవి చూసిందో, మూడు రోజులదాకా మూడంకెవేసి కూచుంటుంది. అయితే పిల్లలుమాత్రం తనచుట్టూ మూగి అడిగేవాళ్ళు. "చిన్నాన్నా, మాకోసం ఏమిటి తెచ్చావు?" అని. అలాంటపుడు ఛకడి గుండెల్లో చెయ్యిపెట్టి కలచినట్టయిపోయేది. తల్లి ముసిల్ది వున్నదినాలు జ్ఞాపకం వచ్చేవి. మనస్సు ఏదో భారమనిపించేది. ఆ దినాలు ఎటుపోయాయి!

ఉత్తి చేతులతో వచ్చినందుకు, పిల్లల్ని బుదిరించడం* కోసం కాస్తా ఎత్తుకుండా మనిపించేది. కాని బాబోయి! ఆ గదిలో నేత్రమణి కాసుకు కూచుంది, బతకనిస్తుందా మరి!

బరజుకి హారా, సున్నా ఇద్దరు కూతుళ్ళు. చౌషా కులం కదా - పెళ్ళి ఈడు వచ్చేసింది. ఇంకా ఎన్నాళ్లు వుండగలరు? పెద్ద కూతురు హారాకి పెళ్ళి. వాళ్ళ తల్లికి కాళ్లు నేలమీద నిలవడంలేదు. వడియాలనీ, పప్పులనీ, దువ్వెనలనీ, భరిణలనీ - ఎక్కడ ఏవివున్నాయో జాగ్రత్త చెయ్యడంలో పగలూ రాత్రీ ఆమెకి వేళ చాలడం లేదు. చిన్న కోడలికి పిల్లలు లేరు. ఇవన్నీ ఆమెకి ఎలా సయిస్తాయి? తక్కిన ఇంటిపని తన ఇష్టానుసారం చేస్తూ వుందామె. ఈర్షతో ఆమె వొళ్ళు మండిపోతూ వుంది. ఏ పనిమీదా మనసు నిలకడలేదు. పెద్దకోడలు మధ్య మధ్య, "నేత్రమణీ, కొబ్బరికాయ కోరేసిపెట్టూ - కూరలో పోపువేసిపెట్టూ" అనేసి తనపని తాను చూసుకుంటూ వుంది. ఈ మాటలు చిన్నకోడలు వొంటిని సూదుల్లాగ దూసుకుపోతున్నాయి. ఊఁ, దానికి పట్టింది!

"ఖబర్దార్, అన్నదగ్గిరా, వదినదగ్గిరా పులుసుసు తిరిగావో నా దగ్గరికి మాత్రం రాకు!" - ఫకడికి ముందుగానే హెచ్చరిక చేసేసింది చిన్న కోడలు. పాపం, అతడేం చెయ్యగలడు? తన శాయశక్తులా ఏమీ చెయ్యకుండా తప్పించుకుంటున్నాడు. అయినా వొకసారి నూనె కొనడానికి వెళ్ళమనీ, పురోహితుడికి దక్షిణ లివ్వడమనీ, మగ పెళ్ళివాళ్ళని మర్యాద చెయ్యడమనీ - ఇలాంటివి చెయ్యక తీరేదికాదు. వీధి వాకిట్లోకి భార్య కంటపడనిచోట నుంచుని ఏదో ఈపనీ ఆపనీ చేసేవాడు. ఇంట్లోకి వెళ్ళగానే ఏమీ తెలియనివాడిలా వూరుకునేవాడు. అయినా తప్పేదికాదు. భార్య ఎదటపడ్డాడో, ఆమె నాగుపాంలాగ పడగెత్తుకు కూచునేది. పడక గదిలో అడుగు పెట్టేసరికి నేత్రమణి హుంకుము చేసేది - "గదిలో పడు

* సముదాయించడం.

కుని వుండకూడదూ! పీధిగుమ్మానికి వెళ్ళి పెళ్ళి పెద్దరికం వెలగబెడు తున్నావు!" పాపం, ఒకడికి మరోదారి లేదు. ఇంట్లోపిల్లి కూన కూడా ఇవాళ తోక పైకెత్తి గెంతులేస్తూవుంది. లోలోపలే కొంచెం సరదా పడా లని అతడి అభిలాష.

హారా పెళ్ళి మంచి గొప్పగా జరిగిపోయింది. కాళ్ళ నుండి తల దాకా నగలు నిండిపోయాయి. యావన్మందీ విందులారగించి సంతోషిం చారు. తన స్థాయికి తగినట్టు ఖర్చుపెట్టాడు బరజు కాని హెచ్చుఖర్చు పెట్టారు మగ పెళ్ళివాళ్ళు. బరంపురం పట్టుబట్టలూ, బంగారం మట్రి పళ్ళూ,* బంగారం కేతకిరేకూ - దేనికేదీ తీసిపోదు.

దివ్యమయిన సంతర్పణ జరిగింది. బోడిపండా ఆవిడా, శారదమ్మ పెళ్ళి చిన్నకోడలు దగ్గిర కిళ్లీలు కడుతూ కూచున్నారు. శారదమ్మ అడి గింది, "ఏదో చిన్నకోడలా, నీ కొత్త కోక ఏదో!"

చిన్నకోడలు ముక్కు ఎగరేస్తూ అంది, "నా కెందుకమ్మా కొత్త కోక! నాకేం పెళ్ళా? కార్యమా?"

"అయ్యో, పెళ్ళి, కార్యమూ ఏమిటో! ఇంట్లో పెళ్ళి, బాజా బజంత్రీలవాళ్లు ఎంతమందో బట్టలు పట్టుకుపోతున్నారు. మరి ఇంట్లో అందరికోసమూ కొత్తబట్టలు తేకుండా వుంటాడా బరజు! ఏం మాట లమ్మా నీవి?"

బోడి పండా ఆవిడ ఈ లోగా గది నాలుగు దిక్కులూ చూపుల తోనే గాలించేసింది. నవ్వుతూ అందామె" "లేదే, వానే. అదలా ఇదవు తున్నాది. కాని ఇదిగో కొత్తకోక" అంటూనే లొలిగాని మీంచి ఎర్రటి కొత్తకోక పట్టుకువచ్చిందామె.

శారదమ్మ వూరి ఆడంగుల్లో గ్రంథకర్త. మంచి మాటకారి. జెనాపురం చౌదరి కూతురు పెళ్ళి చూసిన మనిషికి తక్కిన పెళ్ళిళ్ళు

---

* మట్రిపళ్ళలా చేసి. కూర్చి చేతికి పెట్టుకునే నగ.

వొక లెక్కేమిటి? ఎన్నో నగలపేర్లు తెలుసామెకి. ఎన్నోరకాల బట్టలూ చీరెలూ చూసిందామె. ఈకోకా ఆమెకి నచ్చుతుంది; మునివేళ్ళతో కోకనేత చూసేసి ఆమె అంది. "ప్చ్, ఈ గోదావరి అనాడి కోకా; - వెలిసి పోతుందేమో ఇది;"

బోడిపండా ఆవిడ అంది, "ఆఁ- పెద్దకోడలూ ఇలాంటిదే కట్టు కుంది."

శారదమ్మ మెల్లిమెల్లిగా బోడిపండా ఆవిడతో అంది. "ఒసే నీకు బోధపడిందేమిటి చెప్పూ, బూడిద; పెద్దకోడలు కోసం అలాంటి చీరె తెచ్చారని చిన్నకోడలు కోసమూ అలాంటిదే తేవాలా ఏమిటమ్మా, ఇలాగే జరగాలని ఏమన్నా పట్టారాసివుందా ఏమిటి? పెద్దకోడలు కోసం ఏమిటి జరగలేదుచెప్పూ; ఈ కోకతోనే చిన్నకోడల్ని దాంతో సమానం చేస్తున్నావు; ఏం, దాని కూతురు పెళ్ళైంది, వందా పాతికా ఖర్చ యింది. బరంపురం చీరెలూ, నగలూ నాణాలూ కూతురుకోసం ఎన్నో అన్నీ వచ్చాయికదా, వొక మంచి చీరెముక్క చిన్నకోడలుకోసం వస్తే, ఏం పుట్టి మునిగిపోతుందా?"

బోడిపండా ఆవిడ చిన్నకోడలుకేసి చూసి చిరునవ్వు నవ్వుతూ అంది. "ఆఁ అదీ మాట; అందుకనే చిన్నకోడలు మనస్సు చిన్న బోయింది;"

అక్కడ అసలు చిన్నకోడలు లేనేలేనట్టు శారదమ్మ సాగదీసింది. "అదేమిటే, నువ్వన్నమాట ఎందునా పొందదుస్మీ;* మనస్సెందుకు చిన్నబోతుందే; అదేం చీరెలు కట్టలేదనా, ఈ గుడ్డముక్క కోసం దాని మనస్సు చిన్నబోతుంది? అదేం తినెరగదా? కట్టెరగదా? అనుభవిం చెరగదా?"

---

* సుమీ

బోడి అంది, "ఆ మాట ఎవరు కాదన్నారో! ఎంతటివాళ్ళ కూతురది! దాని తండ్రిపేరు తెలియని వాళ్లెవరు? బట్టలకోసం అదేం వాచిపోయిందా? అంచేతే అక్షతలు పడ్డాక విప్పేసి పాఠేసింది. మళ్ళీ కట్టుకుందా?"

చిన్నకోడలు మొహం చేటంతయిపోయింది. ఆమె అంది, "మా అక్కయ్య పెళ్ళపుడు చాకళ్ళూ, మంగళ్ళూ ఇలాంటి కోకలు ఎన్నో పట్టుకు వెళ్ళి వుంటారు!"

శారదమ్మ అంది, "అవునో. ఆ సంగతి తెలియని వాళ్లెవరు? ఎన్నడూ ఎరగరు గనక వీళ్ళ కివాళ కొ త్తకాని!"

చిన్నకోడలు కన్నవారింటి సంగతి శారదమ్మకి పిసరంతా తెలియదని వేరే చెప్పనక్కరలేదు.

# 5

హరిమిశ్రగారు గ్రామ చౌకీదార్లు * ప్రెసిడెంటు. సన్నబియ్యమూ, కాయపప్పూ, నెయ్యీ బాగా ఖర్చుచేశాక ఈ పదవి ఆయనకి దొరికింది. తన పైతృకసంపద పొలమూ అదీ ఏదో వుండేది. దాంతోపాటు దిక్కూ మొక్కూ లేని పేదవాళ్ళకొంపలుకూల్చేసి సొంతంలో కలిపేసుకున్నాడాయన. బరజు పధానంటే ఆయనకి మంట. ఎంచేతనంటే, బరజువల్ల తన పని పాడవుతూ వుంది. అతడివల్ల తాను ఎన్నోవిధాల నష్టపోతున్నాడు. ఊరిలోనూ, ఇరుగు పొరుగు వూళ్ళలోనూ తగాయిదాలూ, కేసులూ అవీ వచ్చినప్పుడు ముందు బరజు పధానుకి పిలుపు వస్తుంది. పంచాయితీలో కూచుని అతడు పైపైనే తగాయిదాలు తెమిల్చేస్తాడు. అంచేత మిశ్రగారి పాచిక పారదు. తగాయిదా విచారణలో ఇవతల పార్టీదగ్గిర పావలా పుచ్చుకుని, వీళ్ళకోసం పావలా వంతూ, అవతల పార్టీదగ్గిర అర్ధరూపాయి పుచ్చుకుని వాళ్ళకోసం అర్ధరూపాయి వంతూ రిపోర్టులో రాసే అవకాశం అన్నిచోట్లా మిశ్రగారికి చిక్కేది కాదు. జనం తెలివిమీరి పోయారు. దీనంతటికీ బరజుపధానే కారణం. మిశ్రగారు ఒకటి రెండు పెద్ద తగాయిదాల్లో ఇలా ఉభయపక్షాలా చెయ్యితడి చెయ్యబోయారు. కాని బరజుపధాను మధ్యవర్తిగా వెళ్ళి తగువు తీర్చేశాడు. మిశ్రగారు సహించగలరా ఇది! కులంలో ఘోషా. నిన్న మొన్నటి గుంటడు. వీడి సాహసం చూడండి!

* పంచాయితీ

మిశ్రగారు చిన్న పుడకతో పళ్ళు కుట్టుకుంటున్నారు. పళ్ళ సందుల్లోంచి వక్క ముక్కలు తీసుకుంటున్నారు. అదే దారిని బటువా సంచి పట్టుకుని ఛకడి దుకాణంకేసి వెళుతున్నాడు. మిశ్రగారు పిలిచారు. "ఎవర్రా, అరే. మావొఖాయి చెల్లి కొడుకు ఛకడీ !"

బరజు ఛకడీలకి మిశ్రగారు పినతండ్రి వరస. ఛకడి దగ్గిరికి వచ్చాడు. మిశ్రగా రన్నారు. "ఏంరా, రా గడపమీదికి రా – పెళ్ళి ఎలా జరిగింది ? ఎంత ఖర్చయిం దేమిటి ?"

ఛకడి అన్నాడు. "పొద్దున వచ్చారు కదా. అంతా చూశారు. మళ్ళీ వేరే ఏమిటడుగు తున్నారు ?"

"ఇహిహీ – మేం చూసిం దేమిటి. చేసిందేమిటిరా ? భోజనం పెద్దలం మేం. పిండివంటలూ, పాయసమూ అయిపోయిందో, మా దారి మాది."

"మరి, నన్నేమిటడుగు తున్నారు ?"

"ఆఁ, ఆఁ, ఏమిటన్నావూ ? నిన్నడగక పోతే మరెవరి నడుగు తానురా ! ఇంటి తమ్ముడివి నువ్వు. నీ చేతులతో అన్నీ పట్టుకువచ్చి వుంటావు. నిన్నడగకపోతే బారికి • రాములాన్ని అడిగేది ?"

ఛకడి గంభీరంగా అన్నాడు."మేం బారికి* రాములుకంటే కనికష్టం దద్దయ్య * గారూ."

"ఆఁ, ఆఁ, ఏమిటన్నావూ – బారికి రాములా ? బారికి రాము లేమిటిరా, ఛీ ఛీ !

"మరి నన్నడుగుతా రేమిటి దద్దయ్యా. ఖర్చువెచ్చాలు ? నేనేమన్నా చూశానా చేశానా ?"

---

* పాలంకాపరి • పినతండ్రి

"ఆఁ, నువ్వు ఖర్చు వెచ్చాలు చెయ్యలేదూ ? నువ్వు ఎరగవూ ? ఇదేమిటిరా — అబ్బెబ్బే, బరజు పక్షంలో ఇదేమీ తగు • మనిషి తరహాగా లేదు. సొంత తమ్ముడు కదా !"

"అతడిదేమీ తప్పు లేదండీ దద్దయ్యా. అతడేం చేస్తాడు ?"

ఛకడి కోపమంతా వదినెగారి మీద. "ఏమిటి, ఇదంతా చిన్న పిల్లడిలా చెపుతున్నావురా, బరజు తప్పులేదూ ? — అంతా ఆడమనిషిదేనా తప్పు ? నాకు నువ్వు చదువు చెపుతానంటావేమిటిరా ?"

ఛకడి అన్నాడు, "అంతమాట నేను అనగలనా దద్దయ్యా, కాని ఆన్న—"

"అరే, వెళ్ళవోయి, నీ అన్న నీకు గొప్ప. రమ్మీ, వీధిలో పదిమందినీ పిలూ, ఈ మాట తై పారు * వేద్దాం. అన్నదమ్ము లిద్దరూ వొక కుదురులో కాపరం చేస్తున్నారు. ఎవళ్ళ దగ్గిర ఎంత జమ వుందో, ఎంత ఖర్చయిందో, ఈ లెక్కలు ఉభయులూ తెలుసుకోరూ !"

"కాని దద్దయ్యా, అన్నమీద నాకు ఎన్నడూ అపనమ్మకం లేదు". ఛకడి నోటి నించి జోరుగా వచ్చింది. మిశ్రగారు కొంచెం తగ్గిపోయారు. అబద్ధం మీద నిజం తాలూకు ప్రభావం తక్కువ కాదుకదా !

మిశ్రగారు అన్నారు, "రామ రామ, నే నలా అనలేదే. 'రెండు కళ్ళతో చూడందే గురువు చెప్పినా నమ్మరాదు.' బరజు మంచి మనిషి. ఇది యావన్మందీ చెపుతారు. కాని ఈ మాటమాత్రం అతగాడికి తగదనే నా అభిప్రాయం. పైగా తమ్ముడేమీ చిన్న కుర్రాడు కాడు కదా ! తమ్ముడికి నీ మీద ఇంత నమ్మకం వున్నపుడు, తమ్ముడి మీద నీకు నాలుగణాల నమ్మకంవుంటే పుట్టిమునిగి పోతుందా పోనీ, తమ్ముడేమీ పూనుకోలేదూ, చెయ్యలేదూ అనుకో, అయితే, ఏనాడయినా నువ్వు

---

• పెద్దమనిషి

* నిర్ణయం

తమ్ముడి చేతిలో పదీ పాతికా పెట్టి — 'ఇందరా ఛకడీ. ఈ పది రూపాయల సామానేదో పట్టుకురా' అన్నాడా లేదా. ఎప్పుడయినా, 'రమ్మి రా. ఛకడీ. ఏదీ తాటాకూ గంటమూ పట్టుకురా. పెళ్ళిలో ఎంత ఖర్చయిందో లెక్క వేద్దాం' అన్నాడా దీనివల్ల అన్న దమ్ముల మధ్య నమ్మకం పెరుగుతుందా తరుగుతుందా."

ఛకడి అన్నాడు. "లేదండీ దద్దయ్యా. లెక్కలు రాయమనీ, సామానులు తెమ్మనీ అన్నయ్య చెప్పాడు. 'నా కదంతా తెలియదు. మరెవ్వరికయినా బెత్తాయించు' అన్నాను నేను. దానిమీద అన్నయ్య వాళ్ళ బావమరిదిని బెత్తాయించాడు."

చప్పున వొక చప్పట్లు కొట్టేసి మిశ్రగారన్నారు. "భేష్ బావుందీ? ఏమయిందిది? ఇందులో అలకా అభిమానమూ వుందంటావా లేదా? బావమరిది తనవాడయాడు, తమ్ముడయాడుకాడు!

ఛకడి మనస్సు దిట్టమైందికాదు, ఇట్టే ఇడయిపోతుంది. చివరి మాటమీద మనస్సు వొరిగింది. ఇంటా బైటా తనస్థితి హీనంగా వుందని గ్రహించా డతడు. చివరి కన్నాడు, "ఒక్కదగ్గిర కలిసి వుండడం నించి కదా ఈ గోలుమా• లంతా! లేదంటే దద్దయ్యా. వేర్లయిన అన్నదమ్ములు పొరుగింటివాడికి సాటిరాడు. వేర్లయిపోతే ఏవడిసొద వాడు చూసుకునేవాడు."

"ఆఁ ఆఁ, వేర్లవుతారూ? ఎందుకురా? ఏమిటి మీకు వచ్చిన ఇబ్బంది? — ఇహీహీ, ఇవన్నీ వుత్తి * కుర్రతనం మాటలు!"

"కాదండీ దద్దయ్యా. కుర్రతనం మాటలుకాదు. ఇక ముందు మేం వొక్కదగ్గిర వుండడం పొగసదు. పైకిమాత్రం వొక్కదగ్గిర మసులుతున్నాం. లోపలేమో మనస్సులు విరిగిపోయాయి. మాడిపోయిన కూర రుచివుంటుందా దద్దయా!

---

• అల్లరి * ఉత్త: కేవలం.

"అరేరే. ఇవన్నీ — ఇవన్నీ వుత్తి పిచ్చిమాటలు. కుర్రాళ్లు ద్దరూ ఇప్పటినుంచే వేర్లయిపోతారటోయి! ఊఁ, నువ్వు చిన్న కుర్రాడివి- మంచిదేదయినా తినాలనిపిస్తుంది నీకు. మంచి గుడ్డముక్క కట్టుకోవాలని బుద్ధి పుడుతుంది. నలుగురిలోనూ కూచుని నాలుగు కబుర్లు వినాలని తోస్తుంది. ఎందుకూ. కావాలంటే చెప్పు. రేపు తెల్లవారేసరికి నిన్ను మన చౌకీదారి పంచాయితీలో ప్రవేశ పెట్టేస్తాను."

"కాదండీ దద్దయ్యా. వేర్లు కాకపోతే అవేమీ సాగవు."

"ఇహిహీ, మళ్ళీ అదేమాటా? వేర్లయిపోతాం వేర్లయిపోతాం? వేర్లయిపోవడానికి యెవళ్ళు కాదన్నారు. కాని వేర్లయిపోతే కుర్రాడివి బతకగలవ్వా?"

ఛకడి నవ్వుతూ అన్నాడు. "ఏందుకండీ దద్దయ్యగారూ, మీ గుమ్మంలో కూచుంటే మీరు పిడికెడు తిండి పెట్టరూ!"

"అరేరే, అలాఅంటా వేమిటిరా. మీకుమాత్ర మేమీలేదుకనక్నా. సొంతబుద్ధివల్ల అంతా పోగొట్టుకోవడం కానీ. మరొకళ్ళ గుమ్మంలో కూచిందికి మీకేం వచ్చిందీ అంటా! శామపధాను కొడుకుని. ఇలాంటి మాట అందువా నువ్వు! నా గుమ్మంలో నువ్వు కూచుంటావ్వా. ఎందు కురా, నాఇంటి బిడ్డడివి నువ్వు. కావాలంటే చెప్పు. రేపు మూడువందల రూపాయ లిస్తాను. దుకాణం పెట్టు. వర్తకం చెయ్యి. నీలాభం నువ్వే తిను. నా అసలు నాకు ఇచ్చెయి. ఏమిటిరా, నెయ్యి ఎందులో పడుతుందీ అంటే పప్పులో పడుతుంది. నా డబ్బు శామపధాను పిల్లలు తింటారు. మరెవళ్లూ తినెయ్యరు కదా! చెప్పుకోదగ్గ మనిషి నిజంగా శామపధాను. వేళ్ళమీద లెక్క పెట్టవలసిన వాడు—పదిమందీ అతగాడి మాట వినుకునే వాళ్ళు. అతగాడి కొడుకులు మీరు—దిక్కూ మొక్కూ లేకుండా తిరుగు తారు. — మేమంటూ వుండి. అది కళ్ళతో చూస్తామూ వీల్లేదు. వీల్లేదు. అదిమాత్రం జరగదు."

హరిమిశ్రగారికీ శామపధానుకీ ఎలాంటి స్నేహమో ఊరంతా ఎరుగుదురు. హరిమిశ్రగారు ఊళ్లో వొకణ్ణి పిలిచి, "ఏమోయి నీ తట్టు వాడు పెండి* జరిపేస్తున్నాడు. వాడి పెండి నువ్వు తెగగొట్టి పారెయ్యవేం" అంటూ వూదరగొట్టేవారు. వాడు పెండి నడపడానికి వెళ్లేవాడు. రెండోవాడు వచ్చి — ఫిర్యాదు చేసేవాడు. "ఇద్దరూ చెరి అయిదు రూపాయలు పట్టుకురండి. కొలిచెద్దాం. మందడి ఎక్కడ పడితే అక్కడ పెండి నిలబెడదాం" అని హుకుం చేసేవారు మిశ్రగారు. అయిదు రూపాయలు మిశ్రగారి ఖర్చుకింద పోతుంది. అంతలో శాసుపధాను మధ్య దూరేవాడు. ఇద్దరి మధ్యా కొలతలూ అవీ సరిపెట్టేసేవాడు. ఒక దమ్మిడీ ఎవరికీ ఖర్చయేది కాదు.

ఇద్దరు ఆడంగులు స్నానానికి వెళ్ళారు. ఒకామె బంగారం బావిలీ చెర్లో పడిపోయింది. ఆమె ఇంటికి వచ్చి చెవిలో బావిలీ లేకపోవడం చూసుకుంది. రెండో ఆమె నడిగింది. ఆమెకి బావిలీ నీళ్లో దొరికింది. ఆమె బావిలీ ఆమె కిచ్చేసిందామె. ఈ కబురు మిశ్రగారి చెవికి వచ్చింది. బావిలీ పడిపోయినామె యజమానిని పిలిపించి అడిగాడాయన, "ఏమోయి, మీరు నన్ను వుండనిచ్చేట్టు లేదే! తుదకి ప్రెసిడెంటు పని రాస్తా నా చేతిలోంచి వూడగొడతారులా వుంది! ఇది చోరీకేసు, పోలీసుకేసు — నీ వస్తువు నువ్వు పుచ్చుకుని కులాసాగా కూచున్నావు. అయితే కేసెవరు భరిస్తాడనుకున్నావు? రేపు పోలీసులు వస్తారు. వీణ్ణీ వాణ్ణీ పట్టుకుంటారు— నేనూ ఆ గోతిలోనే పడతాను. ప్రెసిడెంటు నంటూ వుండి, నా ఊళ్లోనే చోరీకేసు కామాపు — ఇదంతా ఏమిటి, నీళ్ళలో ముంచి చంపడమేనా!"

ఇంకేమన్నా వుందా? ఒప్పుకోక పోవడానికి ఎవడితరం? దాంతో, "తే ఇక—చౌకీదారు కోసం ఏమిటిస్తావో తే, ఊరి దేవుడు గుడికేమిస్తావో ఇయ్యి." ఊరి దేవుడితో ఊరిచౌకీదారు సాటిలేదు—ఏమంటారా, ఉభయులికీ

* దడి

తూర్పుపడమర అంత అంతరం. అయితే మిశ్రగారితో ఊరి దేవుడుగుడీ' చౌకీదారూ తులతూగుతారు. ఏమంటే, సహజంగా ఆయన దేవుడు గుడీ, గాగలడు, చౌకీదారూ కాగలడు. దాగానేవుంది — దీపం ముడితే చేతికి నూనె తగులుతుంది! ఓహో, ఈ కాలం ఎంత ఘోరకలి అయిపోయిందో! మనిషి నీళ్ళు పోసుకుంటూ వుంది. దాని చెవులోని వస్తువు నువ్వు చపా యించేశావు! ఈ ...ల్లో మరి వుండలేం! ఈ మనుషులు కంట్లోని కను పాప లాక్కుపోతారు!"

శామపధాను అనేవాడు, "ఒరే, మనమేమో దరిద్రులం, చిన్న చిన్న దొంగలం; సొరకాయమీదా, గుమ్మడికాయమీదా కన్ను వేస్తాం. వీళ్ళేమిటంటా? ఈ పెసిడెంటూ, జమీందారూ, సాహుకారూ — వీళ్ళు దొంగలు కారు, దోపిడిగాళ్ళు. పట్టపగలు దబాయించీ గదమాయించీ, కేసులూ కోర్టులూ అని బెదిరించి మనల్ని బికార్లని చేసేస్తారు. మనుషులు తినే మొసళ్లు వున్నాయి. వీళ్లో మనుషులు తినే మనుషులు. పులుల్నీ మొసళ్ళనీ లాగే వీళ్ళని కోర్టులేమీ చెయ్యలేవు. న్యాయమేమీ చెయ్య లేదు—ఇది వాళ్ళ నైజగుణం. అందుకే అంటారు. 'బుర్రని పుట్టిన బుద్ధి పుడకలతో కాని పోదు' అని.

"కళ్ళముందు చూస్తూనే వున్నాం—హరిమిశ్ర బ్రాహ్మడు, కాని చండాలుడికంటే అతడిబుద్ధి నీచం. కిరాతుడు దారిని పోతూ మంచి పిట్టలు చూసి చంపాలని వుబలాట పడతాడు. జాలరివాడు దారిమధ్య ఏట్లో చేపలు చూసి దగ్గిర వల లేకపోయిందే అని నొచ్చుకుంటాడు. అదిగో సరిగ్గా అలాగే ఇతడున్నూ. మగదిక్కులేని ఆడబిడ్డ లెక్కడన్నా వున్నారా? వాళ్ళ పిల్లలు రెక్కలురాని గుల్లలా మైనారిటీ వెళ్ళకుండా వున్నారా? వాళ్ళకి మంచి కొబ్బరి పెరడుందా? అది తన కొబ్బరితోటకి పక్కనే వుందా? అదెలా అయినా తన తోటలో కలిసిపోతుందా? ఎవరిదయిన పిసరంత మామిడితోట తన తోట పక్కనుందా? ఆ తోట ఆసామి

కాయిలా పడి వున్నాడా? అతడు చచ్చిపోతే అతగాడి భార్య కోరి తనకది అమ్మేస్తుందా? ఇదే ఆలోచన.

"ఊరిలో మరెవళ్ళూ మిగలకూడదు. పొలాలూ, తోటలూ, పెరళ్ళూ అన్నీ తనవే అయిపోవాలి. మిగిలినవాళ్ళు యావన్మందీ తన వాకిట్లో కూలి చేసుకు బతకాలి. మిశ్రగారి బుర్రలో ఎల్లప్పుడూ ఇదే గంటలేస్తూ వుంది ఇప్పుడూ ఇదే భావన. మనిషిని తినెయ్యాడ మన్నది ఇంతకంటే భయంకరం కాదుకదా!లోకంమీద మరెవ్వరూ వుండకూడదు. ఎవ్వరికీ వొక మడిచెక్క మిగలకూడదు—ఇలా భావిస్తున్న మనిషికంటే పెద్దపులీ, మొసలీ హెచ్చు ఘోరమైనవా?

"మనం అనాకార్లమనీ, దొంగలమనీ, దగాకోర్లమనీ, సయితాన్లమనీ—మనమే గొప్పవాళ్ళని చెడగొట్టేస్తున్నామనీ లోకులంటారు. కిరాతుకి సైజం పిట్టలా చెడగొడుయినాయి? జాలారివాడి బుద్ధి చేపలా చెడగొడుతున్నాయి? మనం పశువులు కాస్తున్నాం. వాళ్ళు మనుషులు కాస్తున్నారు. ఉప్పూకాదు పత్రీకాదు మనం. పది దెబ్బలు కొడితే మన నోరూ వాయీ లేవదు—ఇంతలేసి బుద్ధిమంతుల్ని మనమా చెడగొట్టేస్తాం? నీళ్ళేవో పాలేవో ఎరగనిఇళ్ళకా ఇంత ఇది చేతనవుతుంది? ఎక్కడన్నా వుందా?"

హరిమిశ్రగారికీ శామపధానుకీ ఇలాంటి దోస్తీ* అతగాడి కొడుకే బరజుపధాను ఇప్పుడు తలెత్తుకు బయలుదేలాడు. బుగ్గ గిల్లితే పాలు కారుతాయి— మిశ్రగారి ముందా మిడిసిపాటు!

* స్నేహం.

# 6

బరజు గమనించాడు. రోజు రోజుకీ ఇంటిపోరు పెరిగిపోతూవుంది. ఎన్నడూ ఒక్క క్షణంకూడా ఇంట్లో శాంతిలేదు. ఇల్లేమిటి — శ్మశానం కంటే అన్యాయం: శవందగ్గిర కాకులూ, రాబందులూ, నక్కలూ, కుక్కలూ కొట్లాడతాయి — అదిగో అలాగ మాటమాటకి ఇంట్లో పోట్లాడుతున్నారు. క్షణమయినా మనిషి నిశ్చింతగా కూచోలేడు. ఛకడి పేరుకి మాత్రం పైకి అన్నయ్యా అని గౌరవిస్తాడు — కానివెనకాల నానా మాటలూ అంటున్నాడు. అన్నయ్య కూతురికి పెళ్ళి చేశాడు. ఎంత ఖర్చుచేశాడో! ఏమిటిచేశాడో! తననేమీఅక్కరచేశాడు కాదు మనస్సు విరిగిపోతే మరేముంది! తెగిపోయిన పోగుకిముడిమాత్రం వెయ్యాలిక! కొంచెం కుంటిదంటే చాలు, చిన్నకోడలు పెద్దకోడలుకి కూతురు పెళ్ళి దెప్పి పొడుస్తుంది. ఒక్క మనిషామె. ఆమెకెవరు తినాలి? ఎవరు కట్టాలి?

చిన్న కోడలులాంటి అమ్మగుంటతో యుద్ధం చెయ్యడానికి పెద్ద కోడలు తయారు — ఆమెని మించిపోయే వాళ్ళెవరు?

ఏమిటి సాధనం? ఈ ఇంటికి వెనకటి శాంతి మళ్ళీ ఎలా వస్తుంది? ఆలోచించి ఆలోచించి బరజుకి కాళ్ళూ చేతులూ అందడంలేదు ఏంచెయ్యడ? వేళ్ళయిపోవాలా? అవును. వేళ్ళయినీ లోకులు బతుకుతున్నారు కదా! ఇంటింటా పదేసి చీలికలు. విడిపోతే రెండు కొంపలూ సుఖంగా వుంటా యంటే మంచిమాటే. నానా ఇదిగా ఒక్కదగ్గిరే అందరూ కూరుకుపోయి ఎందుకుండాలి? పయిగా అందులో మనస్సులు కలవక పోయినప్పుడు.

ఎడంగా వుండడమే మంచిది. అయితే, మనస్సులు కలిసే వున్నప్పుడు వేర్పడమంటే అది వేరే సంగతి. ఛకడీ బరజులు వేర్లవుతారూ ! ఛకడీ— అప్పే—మొన్నటి కుర్రాడు – ఇదిగో నిన్నలా అనిపిస్తావుంది, చంకని ఎత్తుకొని ఒరజు వాణ్ణి తిప్పుతూ వుండేవాడు. మారాముచేస్తే బోధపరిచే వాడు. ఇప్పుడు మాత్రం బోధపరచలేదూ ?

తండ్రిమాట జ్ఞాపకం వచ్చింది – "వాడు నిలకడలేని కుర్రాడు – ఈ ఇంటి మధ్య గోడ లేవకూడదు – పొలం మధ్య గట్టు పడకూడదు"– బరజు కళ్ళలోంచి గబగబా నాలుగు కన్నీటి చుక్కలు రాలిపడ్డాయి. ఇంతకంటే అధికంగా అతడు ఏడవడం ఎవరూ చూడలేదు.

ఆ ఛకడి దగ్గరినుంచి ఇవాళ గొడ్డూ గోదా, గిన్నెలూ, ముంతలూ, పొలమూ దొడ్డీ సగం సగం చేసుకుని పంచుకుంటాడూ ! రేపు తెల్లవారితే ఎవళ్ళదగ్గిర మొహమెత్తుకు నిలబడతాడు ? బరజు ఛకడి దగ్గరనుండి వేర్పయాడూ ? ఛీ ఛీ, ఇదా వాడి ప్రయోజకత్వం ?

ఎంత బుర్ర చించుకున్నా బరజు ఏదీ నిశ్చయించుకో లేక పోయాడు. పదివూళ్ళ పంచాయితీలలో కూచుని ఎన్నో తగువులు తీరుస్తున్నాడతడు. ఎన్నో అన్నిదమ్ముల తగాయిదాలు తెముల్చుతున్నాడు, కాని ఇంటి తగువుకిమాత్రం ఉపాయం దొరకలేదు. ఆడాళ్ళిద్దరూ కదా కయ్యాలాడుతున్నారు — ఛకడి తనతో ఇప్పటిదాకా ఏమీ అనలేదు. మరి, తానై కోరి ఛకడితో ఈమాట చెపుతాడా ? కుర్రాడి దగ్గిర — సిగ్గు సిగ్గు....!

బరజు చూశాడు; ఇంటిల్లిపాదీ నేరస్తులే — భార్యా, మరదలూ, తమ్ముడూ, తానున్నూ. తాను అందరికంటే పెద్ద నేరస్తుడు. ఏమంటే, ఇంటిపెద్ద తాను — ఇంట్లో ఎల్లప్పుడూ అగ్గి రాజుతూవుంది. దానికి తానే మిటి చేశాడు ? కొయ్యబొమ్మలా కూచునివుంటే ఏమవుతుంది ?—తప్పంతా తనదే : ఇల్లు ముక్కలయిపోతే నింద తనమీదే పడుతుంది !

ఛకడి ఆడాళ్ళమధ్య దూరి వదినెకి తిట్లూ చీవాట్లూ మొదలు పెడుతున్నాడు — ముమ్మారు కొట్టడానికిన్నీ కలబడ్డాడు. పోనీ, ఇవన్నీ బరజు సహించకపోతే ఎవరు సహిస్తారు ?

ఎంతయినా ఈ జట్టీకి కారణం ఈ ఇద్దరూ ఆడంగులు. వీళ్ళిద్దరూ వూరికేవుంటే, మగకుర్రాడు ఛకడి జగడం చేస్తాడా ? ఆడంగులిద్దరిలోనూ ఎవరి దగ్గర జగడం ఆరంభమవుతున్నదీ, ఎవరి దగ్గర అంతమవుతున్నదీ ఎవరు తెలుసుకుంటారు ? కానైతే వొక్కమాట మాత్రం నిజం — ఇద్దరి కిద్దరూ ఎవరూ తక్కువకారు. ఒకతె మంచిదయితే రెండోది తనంత తాను వూరుకునేది — వొక్కచేత్తో చప్పట్లు మోగవు కదా !

నిజమే — ఒక్క పెద్దకోడలు మంచిదయితే అంతా చక్కబడిపోతుంది. అది ఎవరిచేతిలో వుంది ? బరజు చేతిలోనే వుంది. ఆడమనిషిని దారికి తేలేకపోతే, అతడు మనిషేమిటి మరి ! బరజు హృదయం సంతోషంతో గంతులేసింది. ఎన్నాళ్ళకి తనకి ఉపాయం దొరికింది — భార్యని మంచిదారికి తీసుకు రాలేడూ తాను !

అవాళ భార్యతో బరజు అన్నాడు, "ఇవాళ నీతో వొకమాట చెప్పాలి."

మాట చెప్పాలీ ? — హారా తల్లికి బరజు వొక మాట చెప్పాలీ ? ఇవాళ ఏ దేవుడు వరమిచ్చాడు ? మాట చెప్పాలి ! ఏ మాట, ముత్యాల మూట ! హారా తల్లి హృదయం సంతోషంతో ఉప్పొంగి పోయింది. పసుపూ నూనె రాసుకుని తెల్లటి శరీరం నిగనిగ లాడించిందామె. తల దువ్వుకుంది. కుంకం బొట్టూ కాటుకా పెట్టుకుంది. భర్త వచ్చే దారికేసి మాటి మాటికీ చూస్తూ కూచుంది — ఆ కాస్త మాటా — ముత్యమంత మాటా వినాలని. ఎప్పుడూ బుంగలాంటి మొహమే చూసింది. వొక మాటా మంతీ ఆమె నుదుట రాసిపెట్టలేదు. ఇవాళ ఆ బరజు నోట మాట వచ్చింది. ఏ మదృష్టం !

హారా తల్లి నోట మాట పెగిలింది కాదు. బలబలా చూస్తూ నుంచుందామె.

బరజు అడిగాడు, "చూడూ, ఇంట్లో ఎల్లప్పుడూ ఈ కొట్లాట ఇలా వుండవలసిందేనా ఏమిటి ?"

"మరి ఎలా తగ్గుతుంది ? అదేవో మీరు చెప్పకూడదూ ? జట్టీ నేను పెడుతున్నానా, అదా ?" పెద్దకోడలిది చెప్పలేనంత స్వాభిమానం – బరజు ఎప్పుడూ తమ్ముళ్లనీ, మరదళ్లనీ వెనకేసుకు మాట్లాడతాడు. తప్పంతా తనమీదే మోపేస్తాడు.

బరజు అన్నాడు, "జట్టీ ఎవరు పెడుతున్నారో అదంతా పట్టుకు కూచుంటే జట్టీ తీరిపోదు."

"జట్టీ తీరనీ తీరకపోనీ నేనైతే దాని దగ్గర వుండలేను."

"ఐతే వేర్లయిపోవాలి. అంతకంటే ఉపాయ మేముంది?"

"వేర్లకండీ, లేదా వొక్కదగ్గరే వుండండి– నేను మాత్రం దాని దగ్గర యిన్ని తిట్లూ సాధింపులూ భరించలేను. దాని దగ్గర వుండలేను."

బరజు గ్రహించేశాడు. స్వాభిమాన గర్వం కొండలాగ హారా తల్లి హృదయంలో తిష్ట వేసుకు కూచుంది. దాన్ని తొలిగించడమంటే అంత సులువయిన పనా? మాటల్లో తెలుస్తూనే వుంది పూర్తిగా, వేర్లయిపోవడమే ఆమె ఉద్దేశం. అయితే నోరు విడిచి ఆ మాట అనకుండా వుంది. బరజు ఎదట ఆమె చెపుతుందీ? అంత సాహసమా ఆమెది?

బరజు విసుక్కుంటూ అన్నాడు, "ఇన్ని డొంక తిరుగుళ్ళు తెలియవు నాకు– తిన్నగా విడమరచి చెప్పావంటే...." బరజు పెదవులు వొణికాయి. కళ్ళు రెండూ జ్యోతుల్లా మెరిశాయి. ఆ మూర్తిని చూసి పెద్దకోడలు నీరయిపోయింది. ఏం మనిషి దొరికాడురా బాబూ. దాని అదృష్టానికి– ఇప్పుడే నోటికి ఏదివస్తే అది పేలేస్తాడు!

హారా తల్లి జంకేసింది. ఏడుపు గొంతుకతో అంది, "ఏమీ కారణం లేదు. వూరికే ఎందుకలా అవుతారు చెప్పండీ! యింటి యావత్తూ పాటూ నేనే చేస్తున్నాను. వచ్చిందీ పోయిందీ అంతా చూస్తున్నాను-"

బరజు కసురుకున్నాడు, "అదిగో, మళ్ళీ అబద్ధమాడుతున్నావు- ఇంటి యావత్తు పాటూ నువ్వేనా చేస్తున్నావు? చిన్నకోడలు ఏమీ చెయ్యటం లేదూ?"

పెద్దకోడలికి తెలుసు. ఏడ్చినా-అంతే, మొత్తుకున్నా అంతే — బరజు గుండె ఇనుముతో తయారయింది. దేనివల్లా అది కరగదు. పైగా అబద్ధం మాటలు విని కోపం వచ్చేసింది. లోగడ ఒకసారి ఇలాగే వో పిసరు అబద్ధం విని రెండురోజులు తిండి మానేశాడు! ఇదీ ఒక అబద్ధమేనా? ఎంతేసి అబద్ధాలు లోకులు చెప్పడంలేదు!

మెల్లిమెల్లిగా అందామె, "చేసిందే అనుకోండి. ధాన్యం వుడక బెట్టిందో, దంచిందో, ఏదో చేసిందనుకోండి-నా పిల్లలు దాన్నేం చేశారు? నా పిల్లల నెందు కది ఆడిపోస్తుంది?

"పిల్లల నాడిపోస్తే వాళ్ళకేమీ అయిపోదు." పెద్దకోడలు మండి పోయింది- తవ పిల్లల్ని తిడుతుందా అది! "బాగానే వుంది. నాకు మంచి బుద్ధే నేర్పుతారీయన! అక్కరలేదు? నా పిల్లల్ని తీసుకుని వేరే వుంటాను నేను."

"మంచి మాట. పిల్లల్ని తీసుకు వేరే వుంటానంటే వుండు. నన్ను మాత్రం వెదకకు మరి."

ఓయి భగవంతుడా, పిల్లలకోసం కూడా రవంత మమత లేదీ మనిషికి! "అవును, మరి మీ రేమంటా రేమిటి? అదే చూపించి నన్ను బెదిరిస్తారు."

నిజానికి బరజు అచల స్వరూపం. మహా మేరువు. అతగాడి మాటలు కొంచెమయినా మృదువయినవి కావు. "విను. ఏడుపు గిడుపువల్లా కోపం గీపం వల్లా జబ్బు తీరదు."

పెద్దకోడలు కూడా గట్టిగా అంది. "జట్టీ ఎన్నటికీ తీరదు."

మంచిమాట. అయితే. కావలసినంత జట్టీలాడండి" — ఇలా అనేసి బరజు మెల్లిమెల్లిగా వొక మంచి కుర్రాడిలా బైటికి వెళ్ళిపోయాడు బడి కుర్రాడు బడి పంతులు ఎదట ఎలా నడుచుకు వెళతాడు, అదిగో ఆలాగ నోరు విప్పి వొక మాటన్నా అనకుండా తల వంచుకు వెళ్ళిపోయాడు.

బరజు వెళ్ళిపోయాక హోరా తల్లి తెలువుకుంది. మూగాడి సైగ మూగాడి తల్లికి తెలుసు. "కొంప మునిగింది. రాకాసిదాన్ని ఎంత పని చేశాను!— తిండి తిన్నాకయినా వెళ్ళాడా? ఉదయమని పొలమెళ్ళి తిరిగి తిరిగి, నీళ్ళయినా పోసుకోకుండా వచ్చాడు— వెళ్ళిపోయాడు." నదీ ప్రవాహం లాగ ఆమె రెండు కళ్ళ నించీ కన్నీళ్ళ ధారలు కట్టాయి. "ఏదో మాట చెపుతానని ఎంతో సరదాగా పిలిచాడు— ఈ మాటేనా— తుదకి ఇలా వొదిలేసి వెళ్ళిపోదామనా! ఎంత తగ్గి తగ్గి మాట్లాడాను, ఏమీ లాభం లేక పోయింది. నాకు చావు రాకుండా వుందేం!"

కారణం లేకుండా ఎప్పుడూ ఇలాగే మతివిరుపులు, ఇలా అయితే ఎవరి మనస్సు చేదయిపోదు! హోరా తల్లి కోపమంతా మరదీ తోటికోడళ్ళ మీదికి తిరిగింది— వాళ్ళిద్దరినించే కదా, మనస్సు విప్పి వొకమాట అనలేక పోతున్నది తాను! ఆలు మొగులయి వుండి తాము బావా మరదళ్ళలా నడచుకుంటున్నారు. ఒకరి మాట ఒకరికి విషంలా అనిపిస్తూ వుంది. ఎందుకిలా అయింది?— పగలూ— రాత్రీ కొండమీద పడినట్లుంది. ఎంచేత?

ఎవరో ఏదో చేశారు - యిది నిజం. నిజం, నిజం. ఈ చిన్నకోడలు ముండే ఏదో ప్రయోగం చేసి వుంటుంది. మరెవరన్నా ఏమన్నా ఎందుకు చేస్తారు? ఎవరికి ఏం పట్టిందని! కానీ కానీ, పెద్దకోడలు యింతటితో వూరుకుంటుందా? దానిమీద పగ తీర్చుకోకపోతే తాను ఘనపరిడా కూతురే కాదు!

"ఒరే మోతీ, వొలేసున్నా, నాన్న ఎక్కడున్నాడో చూడండే—నా కోసమే ఇది పుట్టినట్టుంది!" సున్నా తరవాతి పిల్ల మోతీ. మోతీ సున్నాలు వెదికి వెదికి నాన్నని చూశారు. మంగళా అమ్మవారి పీనె * మీద కాళ్ళు చాచుకు పడుకుని వున్నాడతను. కింద కొల్లాయి గుడ్డయినా పరుచుకోలేదు. పక్కని మొగలిపెండె, మధ్య ముళ్ళగోరింట చెట్టు. ఎదురుగుండా మొగిలి గోష్ఠి. పెండెమీద ఎఱ్ఱింతపిట్ట గిరగిరా తిరుగుతూ ఈ కొమ్మ మీంచి ఆ కొమ్మమీదికీ, ఆ కొమ్మమీంచి ఈ కొమ్మమీదికీ వాలుతూ వుంది. కాస్త దూరంలో బరజు చెఱుకుతోట కొత్తగా వెన్నువేస్తూ వుంది. మధ్య మధ్య నిద్ర తేలిపోతూ వుంటే, చెఱుకుతోట కేసి చూస్తున్నాడతడు. ఎన్నెన్ని వూహలో వూహిస్తున్నాడు. తన చెమటోడ్చిన ఫలసాయమని.

పొద్దు పడమటికి తిరిగిపోయింది— ఇంటిల్లిపాదీ తిండీ తిప్పలు లేకుండా పడివున్నారు. ఎండలో తిరిగి తిరిగీ పిల్లలిద్దరి మొహాలు మాడి పోయాయి. కూతుళ్ళిద్దరినీ వెంట పెట్టుకుని బరజు ఇంటికి వచ్చాడు.

ఏమిటి సాధనం? తాను తినకపోతే ఇంటిల్లిపాదీ ఎవరూ తినడం లేదు. అందరినీ ఉపవాసంతోనూ ఆకలితోనూ వుంచడమంటే తనకి నచ్చ లేదు. అయితే ఏం చెయ్యాలి? ఎన్నాళ్ళని అందరూ ఆకలితో మాడతారు? కాని ఆకలి దప్పికి బరజు భయపడ్డాడా అంటే, అతడి కార్యం పూర్తి కావడ మెలాగ? ఒక్కొక్క కార్యం సిద్ధించడం కోసమని ఈ దేశంలో జనం ఎంత పేరో కఠోరమయిన తపస్సులు చేశారు. ఆకూ అలమూ తింటూ గడిపారు. బరజు ఇంతటితో తగ్గిపోతాడా! పెద్ద కోడలు ఉప వాసంలో నెగ్గుతుందీ!— ఏదకాలం ఇలా కయ్యాలమారిగా వుంటుందీ!—— ఇంట్లో ఎల్లప్పుడూ అశాంతి, ఎల్లప్పుడూ జట్టీలూ జగడాలూ వుండవల సిందే? వేర్లయారే కడదాం • అయినా ఎవరూ వాగా విచారించి, తెలుసు

* అరుగు.

• అనుకుందాము.

కుసీ వేర్లు కారా? ఎవళ్ళకో యిద్దరికి పరస్పరం సరిపోలేదనీ, వాళ్ళ చెడ్డ బుద్ధి మంచిదిగా మారలేకపోయిందనీ కదా వేర్లవడం? ఈ మనిషిలోనే మంచీవుంది, ఈ మనిషిలోనే చెడ్డా వుంది. దేవతా వుంది, రాకాసీ వుంది. రెంటికీ మధ్య పోట్లాట జరుగుతూ వుంది. ఒకప్పుడు మంచి గెలుస్తుంది. వొకప్పుడు చెడ్డ గెలుస్తుంది. మంచి గెలిచినపుడు మనిషి దేవత అయి పూజింపబడుతున్నాడు. ఉపదుదవుతున్నాడు. మరి పదిమందిని మంచి దారికి తీసుకుపోతున్నాడు. చెడ్డ గెలిచినప్పుడు మనిషి దొంగా, మోస గాడూ, దోపుడుదారూ అవుతున్నాడు. ఊరూరా, ఇంటింటా తగాయిదాలూ, కేసులూ, జట్టీలూ పెరిగిపోవడం చూస్తే ప్రపంచంలో చెడ్డ హెచ్చయిం దనీ, దేవతాబలం కంటే రాకాసి బలం అధికమయిందనీ అర్థమవుతూంది. రామాయణంలోనూ, మహాభారతంలోనూ దేవతలకీ రాక్షసులకీ యుద్ధం జరిగిందంటే, అది మంచి చెడ్డల మధ్య యుద్ధమే — ఈ యుద్ధం ప్రపం చంలో ప్రతి క్షణమూ జరుగుతూనే వుంది. తెలిసి తెలిసే బరజు ఈ రాకాసి దగ్గర పీగి * పోతాడా? పెద్దకొడలు ఏడుపులూ, పస్తులూ చూసి, కళ్ళ ముందు ఈ చెడ్డని ఇంట్లో పెరగనిస్తాడా? ఊహుం, వీల్లేదు. ఈ యుద్ధంలో బరజు అంత తేలికగా వీగిపోడు. ఈ యుద్ధంలో రాములవారు తండ్రిని వదిలి పెట్టేశారు. ఇల్లూ వాకిలీ విడిచి పెట్టేశారు—భార్యనీ ఒదిలిపెట్టేశారు —రాజు కొడుకు మళ్ళీ! స్నేహమూ, మమతా చూసుకుంటే మంచి విడిచి పెట్టి చెడ్డ తెచ్చుకోవాలి. పాండవులు అయిదుగురు అన్నదమ్ములూ ఎంత దుఃఖం సహించలేదు!, పురాణ గ్రంథాలు అన్నింటిలోనూ ఇది ఒక్కటే మాట— దేవతల జయం— రాక్షసుల నాశనం.

బరజు లోపల రాకాసి ఉపద్రవం చేస్తూవుంది. బరజూ, ఛకడీ, ఇద్దరు తోటికోడళ్లూ— వీళ్ళందరిలోనూ ఈ రాకాసి పెరిగిపోయింది. ఈ రాకాసిని గెలవడం కోసం రాములవారు పితృశోకమూ, స్త్రీ శోకము సహిం

---

* ఓడి.

చారు. పంచపాండవులు రాజ్యం వొదిలి పెట్టారు. ద్రౌపదీదేవి బండె డంత దుఃఖం భరించింది. మరి బరజు? ఏ మాత్రం వాడని! ఈ మాత్రం మొగమాటం వొదులుకోలేదా? తిండీ తిప్పలు మానేసి పెద్దకోడలు నాలుగురోజులు పడుకుందే అనుకోండీ. వస్తుపడి పిల్లలు ఏడిశారే అనుకోండీ—అంత మాత్రాన దేవతని వొదిలేసి రాకాసిని ఆశ్రయిస్తాడా అరడు? అంత అధముడా తాను! హారా తల్లిని బరజు ప్రేమించడం లేదా! అవును ప్రేమిస్తున్నాడంటే ఆమె మంచి గుణం ప్రేమిస్తున్నాడు. కాని చెడ్డ గుణమెలా ప్రేమిస్తాడు? చెడ్డగుణం ప్రేమించడమంటే అది ప్రేమ కాదు, విరోధమే. పెద్దకోడలులోని దుర్గుణాలు తొలిగించి, ఆమెని మంచి దాన్ని చేసుకుని ప్రేమించా లనుకుంటున్నాడు బరజు. ప్రేమించినవాళ్ళ క్షేమం తాను కోరాలా వద్దా! పెద్దకోడలు తన మంచీ తన క్షేమమూ తాను తెలుసుకోలేక పోయిందనుకోండీ, బరజు వాటి నామెకి అవగాహన చెయ్యడం సరయిన పని కాదా? అందుకని ఆమెతో పడడు- నష్టమేమిటి? ఆమెకి ఇదంతా ఏమీ బావుండదు- రోగికీ మందు బావుంటుందా ఏమిటి? ఇవాళ బావుండదయ్యా, రేపు నయమయిపోయాక, ఆరోగ్యం వచ్చాక, తనంతట తానే తెలుసుకుంటుంది.

బరజు ఇంట్లోకి వెళ్ళి కంచం ముందు కూచున్నాడు. తిండిమీద తనుపు * లేదు. ఎల్లప్పుడూ మనస్సు ఇదవుతూనే వుంది- ఏం చేస్తే ఈ అశాంతి గడుస్తుంది? మొహంలో కళలేదు. మనిషి చెయ్యలేంది ఏముంది? ఎంతలేసి రాజ్యాలున్నా నడుస్తున్నాయి కదా! ఈ నలుగురు మనుషుల్ని తాను బాగా నడిపించలేక పోతాడూ!

పెద్దకోడలు గ్రహించింది. భర్త మనస్సు బాగా దూరమయిపోతూ వుంది. ఇంటిమీదా లేదు, పిల్లలమీదా లేదు- అన్నిటి మీదా తనమనస్సు

---

* ఇష్టము, కోరిక

ఎడమయిపోతూ వుంది. కూటికంచం చూసి గ్రహించేసింది — బరజు రోజూ తినే తిండి ఇవాళ తినలేదు. కంటస • పడుతూ అంది. “తిండీలేదు తిప్పలూ లేదు– మనిషి ఇలా ఆకలితో తిరుగుతున్నాడు – ఏ గొడ్రాలు ముందో ఏదో, మందో మాకో చేసేసింది!”

“ఏమోలె, ఏమోలె, ఏమిటన్నావూ–ముండా!” చిన్నకోడలు పక్క గదిలోంచి బైటికి వురికేసింది.

బరజు పడుకున్న పాడల్లా లేచి మెల్లిమెల్లిగా ఇంట్లోంచి బైటికి వెళ్ళిపోయాడు. ఆ వెళ్ళడం వెళ్ళడం వెళ్ళిపోయాడు. మరి తిరిగిరాలేదు. ఒకరోజు గడిచింది. రెండురోజులు గడిచాయి. అయిదురోజులు గడిచాయి. బరజు రాలేదు! హారా తల్లి నాలుగు దిక్కులా మనుషులు పంపింది. ఎక్కడా పత్తా * దొరకలేదు.

శారదమ్మ వచ్చి అంది. “ఇదేమిటో పెద్దకోడలా. తిండీతిప్పలూ మానేసి కంపలా అయిపోయావు! బరజు ఇలా ఎందుకయాడమ్మా. ఎంతో మంచిమనిషి కదా!”

“నా అదృష్టానికి మంచిమనుషులు చెడ్డవాళ్ళయి పోతున్నారే అప్పా!” పెద్దకోడలు రెండు కళ్ళనించీ తన్నీళ్ళు దిగజారాయి.

శారదమ్మ అంది, “ఛా, పెద్దకోడలా, ఏడుస్తావెందుకమ్మా.— బరజు రాకపోతాడా ఏమిటి?”

పెద్దకోడలు దుఃఖం తెరలు తెరలయి వుప్పొంగుతూ వుంది. “చవ్వకుండా నేనుబతికున్నానే అప్పా! మరి ఆయనవస్తారూ! నమ్మకం లేదు.” ఆమె కన్నీళ్ళు సెలయేళ్ళయి ప్రవహిస్తున్నాయి. పిల్లలు గొల్లుమన్నారు. అడ్డాల్లోని చిన్న కుర్రాడు. “అమ్మఏడుస్తోంది” అంటూవాంగ్రుమన్నాడు.

---

• రొష్టు * జాడ

శారదమ్మ అంది. "ఇదేమిటమ్మా, పిల్లలు ఏడుస్తున్నారు. వాళ్ళని ఊదిరించ * వమ్మా. తెలిసిన దానివి నువ్వు. నువ్వే ఏడిస్తే పిల్లలనెవరు వోదారుస్తారు?"

పెద్దకోడలికి నమ్మకం లేదు. బరజు నిజంగా తిరిగి వస్తాడా. బరజు ఎదట నోరు విప్పకుండా వుండాలని ఎంతో జాగ్రత్త పడిందామె? లాభం లేక పోయింది. ఎలాగో నోట్లోంచి వచ్చేసింది. విషం తిని చచ్చి పోతే బావుండును!

శారదమ్మ అంది, "నువ్వెందుకలా అవుతావమ్మా, పెద్దకోడలా, దీనిలో సంగతి నాకు తెలిసిపోయింది. మంచిమనిషి – పెళ్ళాం పిల్లలూ, ఇల్లూ వాకిలి వొదిలేసి – ఇలా ఎందుకవుతాడూ అంటా. ఇందులో తప్ప కుండా ఇంకా ఏదో వుంది, మర్మం!"

హీరా తల్లి మనస్సుకి ఎదో వచ్చినట్టయింది. "ఆ మాట అన బట్టేనే అప్పా, పడుకున్న మనిషి లేచి వెళ్ళిపోయాడు."

శారదమ్మ మెల్లమెల్లగా అంది. "ఒలే, చిల్లంగికి విరుగుడు లేదా ఏమిటే – ఎంతమందినో చిల్లంగివాళ్ళని చూశాను నేను – సనియా వొంటుని మించిన వాడెవడున్నాడు? సాధనం చేసి ఇన్నిసీళ్ళు చల్లే శాడో లేదో, జగ్గుసావు ఎమినిదేళ్ళకు యింటికి కబురూ రాకరంకాయా పంపనివాడల్లా రెండు రోజుల్లో ఇంటికి వచ్చేశాడు."

"సనియావొంటుా ఎక్కడ నే నెక్కడ! – ఇదంతా నాకేకు తెలుసు?"

"ఎందుకే నిన్ను ఎక్కడికన్నా వెళ్ళమంటున్నానా ఏమన్నానా? కాక, ఎంతో ఖర్చయిపోతుందా ఏమిటా? తిరగ వెయ్యాని అట్లు ఏడూ, నేతి దీపం పెన్మిదలు ఏడూ, ఏడు దర్భలూ—"

శారదమ్మ లెక్క చెప్పేసి హీరా తల్లి దగ్గిర డబ్బులు పట్టుకు వెళ్ళిపోయింది.

---

* సముదాయించు

# 7

పట్టి పధానుపడాలో అన్ని దినాల మల్లనే ఇవాళకూడా పొద్దు పోయింది. సొమ్ములు[1] ఇంటికి తిరిగి వచ్చేస్తున్నాయి. కాకులూ, పక్షులూ గూళ్ళకి చేరుకుంటున్నాయి. పొలం మధ్య ఎవరో కేకేస్తున్నారు. "రారో సబీనా!" బోసావాళ్ళ ఇంటి కొంపల్ల సంజవొత్తులు వేసి, పీధిగుమ్మం తులసికోట దగ్గిర సంజదీపం వెలిగించడానికి వెళుతున్నారు. కొంపల పెడకల్లో వుంగరాలు తిరిగి ఆకాశానికి వేస్తూవుంది పొగ.

ఫకడిపధాను నడివీధిని దుకాణం పెట్టాడు. తమలపాకులూ, పోక చెక్కలూ, ఖారామసాలా వాటితో చిన్న దుకాణం. కొనుక్కుపోయేవాళ్లు గబగబా కొనుక్కుపోతున్నారు.

"ఏడీ, నా ధాన్యంగింజలు కాస్తా కొలిచిపెట్టు బాబూ!"

"ఫకడి దద్దా నా ధాన్యం."

"నా కొత్త పొగాకు రెమ్మ."

"ఏడీ ఫడీ, అగ్గిపెట్టె!"

"నాకు కొంచెం బేగ[2] ఇచ్చెయ్యద్దా బాబూ. నా కొడుకు ఏడుస్తున్నాడు."

"ఒలే, నీ కొడుకు ఏడిస్తే ఎంత, చస్తే ఎంత!– నాకేం వచ్చింది చెప్పూ!" పాపం ఫకడి ఈ గందిక[3]లో చికాకు పడిపోతున్నాడు.

1. పశువులు, 2. త్వరగా, 3. రద్దీ

"మరేం – మంచి బేరానికి వచ్చాను ! తేతే, నా సేరు ధాన్యం గింజలూ నా కిచ్చేయి."

"పో, పట్టుకుపో నీ ధాన్యం—"

"ఇచ్చేద్దుబాబూ. ఏదో కావలసిన సామాను – ఎంత చికాకు పడి పోతున్నావో !"

"ఇదేం పొగాకుముక్క ఇచ్చావయ్యా ? ముక్క కంపు కొడుతున్న—"

"బీడీముక్కలు రెండు పడెయ్యిరా షెకీ !– పశువుల్ని నీళ్ళకదేసి వచ్చాను."

"అరే, నావి ఎన్ని చేతులేమిటి ?– వీళ్ళతో అరిచి అరిచి గొంతుక ఎలివిరేసిపోయింది. చెప్పే సన్నెసమ్మా, నీకేం కావాలో –"

"పొగాకురెమ్మలు రెండివ్వండి బాబూ !"

జంగిడిలోంచి ధాన్యం విసిరికొట్టేసి.నిలబడిపోతూ అన్నాడు షెకడి, "రా, రాయే, నువ్వ అమ్మదువుకాని సామాను !"

సన్నెయ్యమ్మ అంది, "ఆఁ వొక్కమనిసి, ఎన్ని సేతులున్నా యేటి ?– నా పిల్లోడు ఏడుస్తున్నాడు. సాయింత్రమని వొచ్చి కూకున్నాను రాతిరి రొండు జావుఁలు కావొచ్చింది. – కసింత రొద్దు నిలబడలేక పోతున్నావు నువ్వు ? గుఱ్ఱమెక్కి వొచ్చినావా ఏటి ? ఇయ్యండి బాబూ, నా ధాన్యం గింజలికి – ఆకులూ, సెక్కలూ, పొగాకూ –"

షెకిడి చిరాకుపడుతూ అన్నాడు: "దమ్మిడీ ధాన్యం, పైగా సామానులు కావాలి ఆరు !"

"ఆఁ– ఇయ్యాల ఇలా అవుతున్నావెందుకుబాబూ, రోజూ ఇస్తన్నావు కాదా !

పాపం, భకడికి బురదా వొండూ కిట్టదు – వ్యవసాయం పనిచేత కాదు. అంచేత చిన్న దుకాణం పెట్టుకున్నాడు. ప్రతీ నెలా అతడికి చేతి ఖర్చుకని ఏదో ఇచ్చేవాడు జరజు. తమ్ముడు దుకాణం పెడతాడని తెలిసి కొద్దిగ రూపాయలు కూడా ఇచ్చాడు. పనీ పాటూ లేకుండా ఇంట్లో కూచోడంకంటే ఇలా అయినా ఏదో చెయ్యనీ. అన్న దగ్గిర భకడి పుచ్చు కున్న రూపాయల్లోంచి నేత్రమణి పావంజాల మరమ్మత్తుకని కొంత ఖర్చయిపోయింది. తక్కిన రూపాయలు పెట్టి దుకాణం పెట్టాడు. దుకా ణంలో అమ్మకం ఎలా జరుగుతూవుందో తెలుస్తూనే వుంది. పైగా నేత్ర మణి తాంబూలం ఖర్చునూ అందులోనే. సున్నా, మోతీ రెండురోజుల్లో వచ్చి ఆకులూ, చెక్కలూ, ఖారామసాలా పట్టుకు వెళ్ళేవాళ్లు. ఇప్పుడు వాళ్ళమ్మ వద్దనేసింది – "ఎందుకమ్మా మనకీ కావలసింది లిన్నగా సావూ దుకాణం నుంచే వస్తుంది. మొగుడు ఎప్పుడో వొకనాడు దమ్మిడీ చెక్కలు ఇస్తాడో లేదో, పెళ్ళాం నానా దెప్పులూ దెప్పుతుంది!"

భకడి దుకాణం ఎలా సాగుతున్నదంటే, లాభం మాట దేవుడెరు గును, మదుపు* వస్తుందో రాదో! అయినా దుకాణం పెట్టుకున్నాడు, మరేం చేస్తాడు ?

దుకాణానికి వచ్చేవాళ్ళలో కొనడానికి వచ్చేవాళ్ళకంటే పనీపాటూ లేనివాళ్ళే హెచ్చువచ్చేవాళ్లు, బాతాఖానీ వెయ్యడంకోసం. హరిమిశ్ర కూడా వొక్కొక్కరోజు దిగబడేవాడు. బరజు అంటే అమాంతంగా మండిపోతున్నాడాయన. అన్నదమ్ములిద్దరిలోనూ జగడం రేగనీ, ఇద్దరూ వేర్లయి పోనీ – చూద్దాం, బరజుగాడు వీధిలో ఎలా గొప్ప ... పెదరాయ్! ఇంటిపోరూ, తమ్ముడి తగవూ ఎలా సంబాళిస్తాడో చూద్దాం. ... మరి సత్తా ఇక్కడే బట్టబయలవుతుంది. పదిచోట్ల తగుమనిషి తరహా ... చిం

---

* పెట్టుబడి

తిరుగుతున్నాడు. ఇంట్లో తగువెలా తీరుస్తాడో చూద్దాం: కుండా మండా, గొడ్డూ గోడా, పొలమూ పెరడూ తమ్ముడిదగ్గర వొంతని పుచ్చుకుంటాడో లేదో!

"ఏంరా అబ్బాయి. దుకాణం ఎలా వుందేమిటి?" అంటూ మిశ్ర గారు వచ్చి దుకాణం ఎదుట నుంచున్నారు.

మిశ్రగారికోసం చాపముక్క పరిచేసి, ఛకడీ అన్నాడు, "కూచోండి దద్దయ్యా."

మిశ్రగారు కూచున్నారు. ఛకడి ఆయన కోసం కిళ్ళీ చుట్టడం మొదలెట్టాడు.

చిట్టి పధానపడాలో గడియ రాత్రయేసరికి సామాను కొనుక్కునే వాళ్ళు కొనుక్కుని వెళ్ళి పోయేవాళ్ళు. తరవాత వూరిలోని కబుర్ల రాయ ళ్ళందరూ దుకాణం ఎదుట చేరేవాళ్ళు, బాతాఖానీ వేసేవాళ్ళు.

కూచున్నాక మిశ్రగారన్నారు, "ఏమయితేనేం గాక దుకాణ మొకటి పెట్టావు. మంచిపని చేశావు. ఆ వ్యవసాయం పురాణాలు నువ్వు వదలేవు."

ధరముదాసు అన్నాడు, "మేం పోరిపోరి ఇది పెట్టారు. కాకపోతే ఈయనేమిటి, దుకాణమేమిటి?"

మిశ్రగారిది కొంచెం మెల్లచూపు. పదిమందిలో కూచుని మాట్లాడుతూ వుంటే ప్రతీవాడూ తనదిక్కే ఆయన చూస్తున్నాడనుకుంటాడు. ఎదటికి చూస్తే కళ్ళు కుడిపక్కకి పోతాయి. ఎడమపక్క చూస్తే ఎదటికి చూసి నట్టు కనబడుతుంది. ధరముదాసు తట్టు కొంచెం వంకచూపు చూసి మిశ్ర గారన్నారు, "అవునురా, ఎవడిబాబు సొమ్ము పెట్టి ఛకడి దుకాణం పెట్టాడంటా! తండ్రి దాచిపెట్టి పోయాడు. కొడుకు దుకాణం పెట్టాడు."

ఛకడి అన్నాడు, "లేదండీ దద్దయ్యా. అయ్య దమ్మిడీ అయినా అప్పే పెట్టలేదు. చచ్చిపోయినప్పుడు ఏం చెప్పాడో తెలుసా– మీ కోసం ధర్మం మాత్రం దాచి పెట్టానన్నాడు."

"అవునురా, అంతా అంతా విన్నాను. ముసిడ్డి, ముసిలాడూ ఏమీ వుంచలేదు! బరజుపధాను తన సొంత గడన* లోంచి రూపాయలు తెచ్చి నీ చేతిలో పెట్టేశాడు! – ఎవరన్నా వింటే నవ్విపోతారు!"

"ఏమోనండీ దద్దయ్యా. నా కళ్ళ ముందు ఇద్దరూ కళ్ళుమూశారు. నాకేమి తెలియలేదు——"

"ఇహీహీ ! – నీకేం తెలుస్తుందిరా, – సత్రం భోజనం మఠం నిద్రా– ఏంరా ధరమూ ఏమంటావు?"

ధరమా అన్నాడు, "లేదు బాబూ, బరజు ఇచ్చారు – గునాపయిడా దగ్గర ఋములు పుచ్చుకుని ఇచ్చారు."

"అవును పోరా, నువ్వు నాకు చదువు చెపుతావు. ఏం? శామపధానుని నే నెరుగుదును, అతని భార్యనీ ఎరుగుదును– బరజునీ ఇంత కుర్రాడి నుండీ చూస్తున్నాను."

"ఏం బాబూ, బరజుగారి చెడ్డ ఏమేమెన్నాడూ–"

"అరే, చూప్, నోరుముయ్యి– మాటకి మాట ఎదురు చెపుతున్నావు. నీ బుర్ర నీకేం తెలుసు– పెద్ద పెద్ద మాటలాడుతున్నావు– ఏంరా ఛకడీ?"

"అవునండి దద్దయ్యగారూ, ఆ మాట ఎవరు చెప్పగలరు? నరుడి మాయ నారాయణుడికి తెలీదు."

"అదీ, తెలుసుకోగల వాడెవడో వాడూ తెలుసుకుంటాడు. ధరుము దాసు తగుదునమ్మా అని మాటలాడుతున్నాడు. దుక్కమున్నితే కాని బతుకు

---

* సంపాదన

గడవదు. గెంజినీళ్ళకీ దిక్కులేదు— వీడూ మాతో సమానంగా మాట్లాడే వాడే! కాలమహిమ, తక్కువవాళ్ళ నోళ్ళు మించిపోతున్నాయి."

ధరుముదాసు ముడుచుకు కూచుంటూ అన్నాడు, "లేదండి బాబూ. మీ మాటకి—" అతడికి 'తమర'నడం రాదు.

"ఒరే. నోరుముయ్యి— బుద్ధిలేదు నీకు. కాదే అనుకో. ఐరుజా పధాను తన చేతిదే ఇచ్చాడనుకో— ఆస్తి యావత్తూ మంచీ చెడ్డా అంతా తన చేతిలో వుంది— అందులోది వందో యాభయ్యో తమ్ముడికిచ్చాడు. అదో పెద్ద సంగతా ఏమిటి?"

ఛకడి అన్నాడు, "వాడికి మా ఇంటి సంగతి ఏమి తెలియదండీ దద్దయ్యా- వాడి మాటలు వింటారేమిటి?"

ధరుముదాసు కిందా మీదా ఎరగని వొక మొండిమనిషి. దెబ్బలు తిన్నాసరే, తన మంకుతనం వొదలడు. ఇలాంటి వాళ్ళనే దెబ్బలమొండి అంటారు. అతడు మిశ్రగారినేమీ అనలేక పోయాడు, కాని ఛకడిని దవాయిస్తూ అన్నాడు: "అవునవును, మీకు మాతెలుసు— అందుకనే దేవుణ్ణి మింగేసి దేవుడి రథంకూడా మింగేస్తున్నారు— దుకాణం వేశారుకదా! అసలుకే మోసం—"

ఛకడి వేడెక్కిపోయి అన్నాడు, "పోరా తల విలవ నోరు చెపుతుంది. దద్దగారు కూచుని వున్నారు. ఆయన ఎదట పెద్ద గ్రంథకర్త గిరీ చూపెడుతున్నావు"

"ఆఁ, ఎంత బిగురుతూ మాట్లాడేస్తున్నారూ — ఏం, కొడతారా ఏటి?"

ధరుముదాసు కులానికి బారిక. * ఆస్తీపాస్తీ ఏమీలేదు. ఎవరన్నా కుమ్మక్కు చేసి పట్టుకుపోయిందికి డబ్బూ దస్కమూ ఏదీలేదు. మోతు

* పలాం

బరితినం చేసి నాలుగు దెబ్బలు కొడతారు. అంత మాత్రాన ఏమయి పోతుంది? చిన్నప్పటినించీ దెబ్బలు తింటూనే వచ్చాడు. తానేమీ దొంగ తనమూ దొంగుతనమూ చెయ్యలే... కదా, పట్టుకుపోయి జైలుఖానాలో తొయ్యడానికి!

ఏమిటీ! మిశ్రగారి ఎదట జారికాడు ఎంత గర్రాగా 1 మాట్లాడు తున్నాడో! కాసైతే ధరుముదాసు మొండి - ఆ సంగతి పదిసార్లు దెబ్బలు కొట్టి తెలుసుకున్నారు. అతడికేసి ఇంతలేసి గుడ్లు చేసి మిశ్రగారన్నారు. "ఏంరా ధరమా, ఇవాళ మళ్ళీ వీపు దురదపెడుతూ వుందా ఏమిటిరా!"

అన్నీ తెగించుకు కూచున్నవాడు ధరుముదాసు. మోతుబరితనం చేసి వొకటో రెండో కొడతారు. దానికోసం భయమేమిటి? కాని ఈ అర్ధ రాత్రి దెబ్బలు తినడమంటే తనకేదోలా అనిపించింది. అందుకని లేచి పోతూ అన్నాడతడు, "ఓ, మీరు చేసేదల్లా మరేముంది! ప్రయోజకత్వం చూపించి రెండు దెబ్బలు కొడతారు. అంతకీ కాదంటే ఈ వూళ్ళోనించి తగిలేస్తారు. 2 కూలిబతుకు వుంది. కాళ్ళూ చేతులూ ఆడుతున్నంత కాలం కడుపు ఖాళీ వుండదు. డబ్బూ దసకం పెరిగిపోతూవుంది కనకనా - పెడకమీద ఆనపపిందే, గుమ్మడిపిందే వుండనివ్వరు మీరు— పోనివ్వండి- ఈ వూరు కాకపోతే మరొక వూరు— ఏ వూరు వెళతామో ఆ వూళ్ళో కూలి చేసుకు బతుకుతాం.....!"

"కానీ, వెళ్ళు వెళ్ళు - ఇవాళ ఇంత రాత్రివేళ— పంచ కట్టు కున్నాను, మైలపడి పోతుంది-అచ్చా, రేపు నీ ధీమాకి చూద్దాం"

"పదిసార్లు చూశారు, మరి రేపు మాత్రం ఏమంత అధికం చూసే స్తారు?" అంటూనే ధరుముదాసు వెళ్ళిపోయాడు.

---

1. గర్వంగా, 2. వెళ్ళకొడతారు. 3. ధైర్యం

మిశ్రగారన్నారు. "చూశావురా ఛకడీ, – ఈ తక్కువవాళ్ళ నోళ్ళు మించబెట్టిందెవళ్ళు? మీ అన్న బరజే. కాకపోతే ధర్మదాసా? బాబు పేరడిగితే నోరు పెగడ్డ– వాడికింత సాహసం వస్తుంది? మొహ మెదట ఇలా మాట్లాడి వెళ్ళి పోతాడూ?– ఈ మనుషులికి వొట్టి– ఏమిటి తెలుసా?– వేస్తే తాపూ। కూచుంటే రాపూ– అలా అయితేనే తిన్నగా వుంటారు. బరజు పధాను ఈ తక్కువ వాళ్ళతో మసులుతాడు. వీళ్ళతో కూచుంటాడు. వీళ్ళందరికీ బుద్ధులు చెప్పతాడు–ఇలా అయితే వీళ్ళ నోళ్ళు మించిపోవూ 2 ఘనఖలెయి చేసు చూడూ. ఏమిటి వాడు అబద్ధం చేసు పెట్టాడా? అందరి ఎదటా అబద్ధం అబద్ధం అని చెప్పుకు తిరిగాడు బరజు. వెదకి వెదికి ఖలెయికోసం వొక్క సాక్షినీ నేను సంపాదించలేక పోయాను. అందరూ అబద్ధాల వాళ్ళయిపోయారు. నువ్వొక్కడివేనా నిజాయితీ మనిషివి! అబద్ధం చెప్పకుండా వొక పెద్దమనిషి ఎవడున్నాడురా ఛకడీ! అరికాళ్ళని వెంట్రుకలూ, నాలికని ఎముకా ఎవడి కుందిరా!"

"అన్నయ్య ఎన్నడూ అబద్ధ మాడడని లోకులంటారండి దద్దయ్య గారూ."

"అవునురా, అతడు మూడ్డిల కళ్ళల్లో బుగ్గ 3 పోసేస్తాడు. నీ దగ్గిరా నా దగ్గిరా దాగుతుందా? ఇంట్లో నువ్వు చూస్తున్నావుకదా! నీ దగ్గిర వొకమాటంటే భార్యదగ్గిర మరో మాట!

"నాకు తెలియదా దద్దయ్యగారూ, ఈ ధరమా దారికా నాకు నేరుపు తాడు! పైగా నన్నంటున్నాడు, దేవుణ్ణే మింగేసి దేవుడు పీఠం మింగే సున్నానని"

"ఒరే, పంచి కట్టుకున్నాను. మైలపడిపోతుందని జంకాను అందుకు వాడు మించి 4 పోయాడు–గావంచా 5 కట్టుకుని వుంటేనా వాడి దవడా నోరూ ఎరుపు చేసేసి పోదును!"

---

1. ఉన్నా. 2. మిలమోగ. 3. మన్ను. 4. తప్పించుకు, 5. తొల్లాయి.

షరమాజొరికి మాటలవల్ల ఛకడికి అనుమానం కలిగింది. వాడి దవడో, వీపో ఎరుపుకానీ నలుపుకానీ అయిపోయివుంటే తన మనస్సు శాంతించి వుండేది. మిశ్రగారి దన్ను * చూసుకుని అతడన్నాడు, "రేపు పొద్దుట వాడిపని కొంచెం పట్టించకపోతే వీల్లేదండి దద్దయ్యగారూ!"

రేపు పొద్దుట షరముదాసు దెబ్బలుతినే దృశ్యం తలచుకుని లోపల లోపల ఛకడి సంతోషించాడు.

మిశ్రగారన్నారు. "ఆసంగతి వేరేచెప్పాలా? ఉదయం కాస్తా మా ఇంటిదిక్కు నువ్వు రా. ధరుముదాసికి బలదిలాగ్గయితే పనిలేదు- ఎద్దుకన్నే-కొబ్బరిచెట్టూ-దూలగుండు కొమ్మలూ యిలాఅయితే సరి పోతుంది. అప్పుడూ దరుముదాసు దారికి వచ్చేస్తాడు. కాని, మీ అన్నయ్యతో మాత్రం, చాలవేం. ఈవాళ ఒక్కణ్ణే మనం సాధించి వేస్తాం, రేపు మీ అన్నయ్య నేర్పడంవల్ల ముసిముసిగుగ్గురు బట్ట విప్పుకు గెంతుతారు. దానికి సాధన మేమిటి చెప్పూ! తక్కువవాళ్ళని మెప్పి ఇంటి తమ్ముణ్ణి అవమానిస్తాడూ! షరముగాడని పాపమనిషి, డొక్క చించితే అక్షరంముక్క లేదు. వాడికెలా తెలుస్తుందీ. నువ్వు దేవుణ్ణుంగి దేవుడు పీఠం మింగుతావని! మకాణం మడప ఖర్చుపెట్టేశావని! యిది బరజు నేర్పినమాట కాదూ! ఛకడీ. నువ్వా నాకు చెప్పు చెపుతావు?"

"అన్నీ తెలుసుకున్నానండి దద్దయ్యగారూ, పెళ్ళాంమాట తోసేసి వచ్చేశాను. కాని ఏంలాభం! ఆడవాళ్ళు పొకొక్క మాట చెపుతారు. అందులో పిసరంత అబద్ధం వుండదు. ఎన్నాళ్ళయో నాతో పోరుతూ వుందది. 'మనం విడిగా వంట పెడదా'మని, ముగ్గురు కూతుళ్ళు-వాళ్ళ పెళ్ళిఖర్చు యింటి డబ్బేనా, ఎక్కడినుంచయినా వస్తోందా? మనకెందు కింత బాధ! పరాయివాళ్ళని, పెంచడానికి మనమెందుకింత చచ్చి చెడీ పడివుండడం!' అని చెవులో గూడుకట్టుకు చెపుతుంది."

* సహాయం.

తన నోటినుంచి "పరాయివాళ్ళ"ని రాగానే గుండెల్లో ఏదో కొట్టినట్టయింది ఛకడికి. ఆః పరాయివాళ్ళు కాకపోతే మరేమిటి? సొంతమా? ఎవళ్ళ సంగతి వాళ్ళు చూసుకుంటున్నారు. తానెలా దుకాణం పెట్టుకుని తమలపాకులూ,చెక్కలూ,మసాలా విడిగా తెచ్చివేసుకుంటున్నాడో, వాళ్లూ అలాగే విడిగా కొని తెచ్చుకుని వేసుకుంటున్నారు. తోటికోడళ్ళిద్దరూ మాట్లాడుకోవడమన్నది స్వప్నమయిపోయింది. మాటా మంతీ కొట్లాటలోనే జరుగుతూ వుంది. అన్నదమ్ములిద్దరిలో మాత్రం ఏమంత మనస్పులు కలిసున్నాయి! ఇంటిఖర్చు వెచ్చాలు యావత్తూ అన్న చేతిమీద జరుగుతూ వుంది. ఒక్కనాడయినా ఛకడిని పిలిచి చెప్పిన పాపాన పోయాడూ? లోపల అంతా ఎడపిద్దమంటే పెడిది. నోటితో మాత్రం కొంచెం కలిసి మాట్లాడితే ఏమిటి లాభం? "కడుపులో లేంది కౌగిలించుకుంటే వస్తుందా"?

మిశ్రగారు అదును కని పెట్టి అన్నారు. "ఆడవాళ్ళ మాట అన్నావు —ఛకడీ, ఆడది ఇంటికి లక్ష్మి. ఇంటి సంగతి మనమేం చూస్తున్నామా చేస్తున్నామా? మనం వీధిలోకి మాత్రమే. ఇంట్లో అన్నీ చేసేవాళ్ళు వాళ్ళేనా? ఈ ధరుముదాసులాంటి మూర్ఖులు మాత్రం అంటారు. "పెళ్లాం మాట వినేవాడూ, పెళ్లాం మాట వినేవాడూ" అని. ఇలాంటి మాటల్లో వచ్చేదెంత, పోయేదెంతరా ఛకడీ! బసువా తల్లి ఇలాగే ఎన్నాళ్ళయినా వేర్లవుదామని చెబుతూ వుండేది! ఆడవాళ్ళ మాట కదా అని చెవిని పెట్టేవాణ్ణి కాదు. ఇప్పుడు, ఏనాటినుంచి వేర్లయిపోయామో, ఆనాటి నుంచీ కష్టసుఖాల్లో భగవంతుడు హాయిగా గడుపుతు వస్తున్నాడు. అంతే కాని, మా అన్న కెళాలాగ, కలకత్తా అనీ, మేదినీపురమనీ తిరగడం లేదు కదా! అతడిలాగ వంట పుట్టీ పని చేసీ, బిచ్చమెత్తి బతకడం లేదు కదా!" తన అన్నదమ్ముల్లో హరిమిశ్ర మధ్యవాడు. కెళా మిశ్రగారి తమ్ముడు.

"అదేమిటండీ దద్దయ్యగారూ, అంత మాటంటారెందుకూ? మీరు బిచ్చమెత్తితే మరి మేమంతా ఎందుకున్నాం?"

"ఇహీహీ, చిన్న కుర్రాడు, ఏమీ తెలుసుకోలేడు– ఏంరా, నువ్వెందుకు బిచ్చమెత్తుతావురా? పదెకరాల వ్యవసాయం నీది, ఎడ్లజతా – ఏడు తరాల ఇల్లూ అన్నీ వున్నాయి కదా! ఏం. చెప్పరా ఫకడీ, ఇదంతా నీ తెలివి తక్కువతనం సుమా!"

"మీకు తెలియందేముంది దద్దయ్యా. వ్యవసాయమూ అదీ నాకెవరన్నా నేర్పారా ఏమన్నానా?"

మిశ్ర పిసుక్కుంటూ అన్నారు. "నేర్పిస్తారెవర్రా నీకు!–నువ్వేం చిన్నపిల్లాడివా? తల్లి దగ్గర పాలు తాగుతున్నావా ఏమిటిరా?"

ఫకడీ అన్నాడు. "లేదండీ దద్దయ్యగారూ, చందరాశి యాళ ఏం చెప్పాడో అదే చేస్తాను. "పంచమాణియా" పొలం పెసలు ఈ యేడు వేరే వుంచాలనీ, దాని వరిపంట వచ్చే పుష్య మాసంలో కోసి పట్టుకువచ్చి, వేరే కళ్ళంలో వుంచాలనీ చెప్పాడతడు. "అన్నయ్య పండించాడు కదా, నేనెలా పట్టుకు వచ్చి వేరె కళ్లంలో పెట్టేది" అన్నాను. "మీకు ఈ బుద్ధి ఎవడు నేర్పాడండీ" అన్నాడతడు – "అన్న పండిస్తేనేం ఆ పొలం మీది కాదా? అన్న ఇంట్లోంచే కూలిపెట్టి పండించలేదా? అన్నగారు ఇంటి పెద్దరికం చేస్తున్నాడు. దాంతో పాటు తాను కూడా పరిశ్రమ చేశాడు, లేదా ఏరు పట్టుకు దుక్కి దున్నాడు. అంతే కాదు, ఎకరమో రెండెకరాలో మడిచెక్క లోకులు భాగాని కిస్తున్నారు కదా! పొలంలో పండించిన వాటు అంతా వాడే తినేస్తున్నాడా? పొలం కలవాడికి వాటా ఇస్తున్నాడా లేదా?" అన్నాడు. శియాళకులమయితేనేం గాక దద్దయ్యా. చంద్రయ్య బుద్ధిమంతుడు! ఇంటికి వెళ్ళి, దాంతో ఈ మాట చెప్పగానే, "ఇంకా అడుగుతారా?" అందది. "ఆ కళ్ళం పక్కనే మన కళ్ళం తయారు చేయించండి. మన పెసలు అక్కడే నూర్పిద్దాం" అంది.

"ఇన్నాళ్ళకి నీ దగ్గర వొక మనస్సైన మాట విన్నానురా ఛకడీ! అవును న్యాయమయిన మాట, ఇందులో మానావమానాలు ఏమీ లేవు. కుండా మండా వేరుచేసే సంగతీ ఇందులో లేదు. పదేళ్ళయి అన్న యింటి పెద్దరికం చేస్తున్నాడు. ఖర్చు వెచ్చాలు చేస్తున్నాడు. యికముందు తమ్ముడు ప్రయోజకుడయాడు వాడి సంగతి వాడు చూసుకోడూ! మంచీ చెడూ చూసుకోడూ? ఇది న్యాయమైన మాట! చందరాశియాళ- ఎండు కర్రలోంచి నీళ్ళు లాగుతాడు వాడు. తెలియక నేను వాడికి అవాస్తే పని ఇచ్చానా?"

చందరాశియాళ యింతసేపూ ఎక్కడున్నాడో, నాలుగు మూళ్ళ గుంపు గుంపుల వెదురుకర్ర దుకాణం ఎదట పడేసి చాపచుట్టగా మిశ్ర గారికి నమస్కారం చేశాడు. మిశ్రగారు వాడి మొహం చూసి అన్నాడు. "ఒరే, వీడికి నూరేళ్ళు ఆయుర్దాయంరా- ఏంరా చందరా, ఏమిటి సంగ తిరా?"

చందరా మిశ్రగారి నమ్మిన బంటు. ఎక్కడ ఎవడు తుమ్మాడో, ఎక్కడ ఎవడు కూచున్నాడో,ఎక్కడ ఎవడు నవ్వాడో అన్ని కబుర్లు పట్టుకు వచ్చి మిశ్రగారి చెవిలోవూదేవాడు. శివుడి దర్శనం చేసే ముందు లోకులు నందిని తడువుతారు. విష్ణుమూర్తి దర్శనం చేసే ముందు గరుత్మంతుణ్ణి కౌగిలించుకుంటారు. అలాగే మిశ్రగారి చేతుల్లోంచి పైట పడాలంటే జనం ముందు చందరాని మంచి చేసుకునేవాళ్ళు.

"ఇది వొక్క నందీ గరుత్మంతుడూ, చందరా పుట్టుకే గాదు" అనేవాడు బిరజు - "దేవతల దగ్గిర ఎలాగో మనుషుల దగ్గిరా అలాగే. రాజులూ, మహారాజులూ కంటే వాళ్ళ దగ్గిర వాళ్ళు- ఆఫీసర్లూ, గుమా స్తాలూ, అమీనులూ, వాళ్ళ బంట్రోతులూ హెచ్చు పూజా పురస్కారాలు పొందుతారు" అనేవాడు! చందరాశియాళ వంకనవ్వు నవ్వుతూ అన్నాడు. బాబుగారూ, ఇయాళ సంగతి మహ గొప్ప సంగతండి. కొంచెం యిలా దయ సెయ్యండి సెపుతాను."

"అలా వెళ్ళడమెందుకురా, ఛకడి నా బిడ్డడు- వాడి దగ్గిర జంకెం దుకు? వాడెవ్వాళ్ళతో అన్నా వెళ్ళి చెప్పేస్తాడా ఏమన్నానా?"

"సిపాయండి.అదిగో ఆసదెయిమంత్రి సంగతండి-అల్లుడు రెండేళ్ళై కలకత్తాలో వున్నాడండి - కూతురు కన్నారింటి దగ్గిరే వుంది. నిరుటి సంగతి కామందు నెరిగే వున్నారు —— ఎక్కడో కామాపు * సేసీశాడు మంత్రి. పత్తా సిక్కలేదు. ఇదిగో, యిప్పుడు వండి సూద్దురు కాని- అది ఇల్లా కొతల • అరిటి పెరట్లో శిశువు కు ఆఁ కు ఆఁ ఏడుస్తుంది."

"ఆఁ ఆఁ ఏమిటన్నావ్?- పిల్లె బతికుందీ?"

"గావుకేక వేసి అరిటితోట ఎగరాగొట్టేస్తుందండి. కనేసిన పడుసు సాపుసేదా కడిగేసుకుని వంటింట్లో కూడు వొండుతోంది. యిప్పుడెప్పుడే నాకు శారదమ్మ సెప్పింది., లేకపోతే నా కెలా తెలుస్తాది."

"ఆఁ ఆఁ హత్యా!- బిడ్డ బతికుంది- లేకపోతేనా, ఏం చేసేదానో ఒరే, వెళ్ళు వెళ్ళు. చౌకిదారుని పిలు. ఠాణాకి కబురు చెప్పనీ. సదెయి మంత్రి ఎక్కడున్నాడు?"

"అదేటి సేస్తాడు? ఊరంతా కోడై కూస్తుంటేని; ఆడెలాటి మొండి గటవోఁ తెలీదా ? ఒకంతట ఒప్పుకుంటాడా?"

"ఒరే, వాడెక్కడికి వెళతాడో వెళ్ళనీరా. పండిన ధాన్యం రోటి దగ్గిరికి రావలసిందే. నువ్వు వెళ్ళు. చౌకిదారుకి కబురు చెయ్యి. చూస్తున్నా వురా బాబూ ఈకఫీ- చద్దామంటే సమయం దొరకకుండా వుంది. వెళ్ళు నాయనా వెళ్ళు. దుకాణం కట్టేసి యింటికి వెళ్ళు. భోజనం చేసి పడుకుందువు కాని, ఎప్పుడేం జరిగినా కొంచెం చెవులో వేస్తూ వుండు. తెలిసిందా?"

"అది నాకు వేరే చెప్పాలా దద్దయ్యా!"

ఊరూరా అరిటి తోటలున్నాయి. జనపచేలున్నాయి. మొగలి పొదలున్నాయి. చెరువు గట్టులున్నాయి- ఎన్నో చోట్ల "కువాఁ కువాఁ" ధ్వని వినిపిస్తుంది. మనిషి పిల్ల దిక్కూ- మొక్కూ లేకుండా పడివుంటుంది! అందుకని ఎవరేం చేస్తారు? హరిమిశ్ర సంపద పెరిగేది. సదెయి మంత్రి కొంప కూలేది-"కు ఆఁ కు ఆఁ" ధ్వని విని బరజుపధాను కళ్ళలో కన్నీళ్లు కారేవి-

అనంతుడు రక్షించేవాణ్ణి
బలవంతుడు చేసేదేమిటి?

---

* మాయం • ఇంటిపెరడు

# 8

పెద్దకోడలు దేవుళ్ళకీ దేవతలకీ ఎన్నో మొక్కులు మొక్కింది. "అమ్మా, మంగళాతల్లీ! కులాసాగా వచ్చెయ్యనీ అమ్మా. నీదగ్గర పూజ చేయిస్తాను—ప్రభూ, కపాలేశ్వరా! లక్షతుమ్మిపువ్వు లర్పిస్తాను—ఎలా అయినా క్షేమంగా ఇల్లు చేరుకోనీ."

బరజు అయిదు రోజులపాటు ఎక్కడున్నాడో, ఎవ్వరికీ ఆచోకీ లేదు. ప్రయోగంకోసం శారదమ్మ డబ్బులు పట్టుకువెళ్ళిన సాయంకాలం మోతీ వీధి గుమ్మంలోంచి పరిగెత్తుకు వచ్చి "అమ్మా, నాన్న వచ్చాడు" అంటూ కేకవేసింది. వాళ్ళ అమ్మ గుమ్మం దగ్గిర కూచుని, సంజ దీపాని కని వొత్తులు చేస్తూ ఉంది. ఆమె మనస్సు ఏమయిందో ఆమెకే తెలుసు.

బరజువచ్చి వాకిట్లో నుంచున్నాడు. సున్నా కాళ్ళు కడిగిందికి ముంతెడు నీళ్ళు తెచ్చి దగ్గిర పెట్టింది. పెద్దకోడలు వత్తుల నుంచి మొహమెత్తి భర్త మొహంకేసి చూసింది. అతడి మొహం వాడిపోయి ఉంది. కడుపు వీపుకి అంటుకుపోతూ ఉంది. తలకి నూనెలేక జుత్తు పీచులా ఎగురుతూ ఉంది. వత్తులు పేనడం వదిలేసి లేచిపోయిందామె. ఇంట్లో దూరిపోయింది. ఆమె చెంపలమీంచి కన్నీళ్ళు ధారలు కట్టాయి. చిన్నపిల్లలా వెక్కి వెక్కి ఏడ్చింది.

బరజు వచ్చేశాడు, కాని మనస్సులో ఆనందం లేదు. లోగడలాగే మొహం బుంగలా పెట్టుకుని ఉన్నాడు. తిండీ తిప్పలూ, పూసు కోడాలూ

రాసుకోడాలూ ఏదీ సరిగా లేదు.' భార్య ఎన్ని మాట్లాడినా అన్నిటికీ ఊఁ, ఆఁఅనేసి వూరుకుంటున్నాడు. ఏమాటకీ ఉత్సాహం లేదు.

నేత్రమణి తలమీద ముసుగు జార్చేసి, తాంబూలం ఎర్ర పెదవులతో నవ్వుతూ నవ్వుతూ ఫకడితో అనేది, "చూశారా సరాగం, ఎన్ని సరాగాలో ఎన్ని వేషాలో వేస్తుందది. ఊరికే మనం చూడాలని సుమండీ ఇవన్నీను!"

ఫకడి నేత్రమణి అందంచూసి పొంగిపోయేవాడు. "అవును. చూడాలని కాకపోతే మరేమిటి? మున్నా, మోతీల పెళ్ళి జరుగుతుంది కదూ! మీరుమాత్రం కచ్చికవాళ్ళా ఏమిటి? ఎన్నో గెంతులు వేస్తారు- ఎంతో మంచయిపోతారు! ఇదిగో ముందే చెప్పేస్తున్నాను-నేనుమాత్రం పెళ్ళికి ఉండను. నన్ను మా వాళ్ళింట దిగబెట్టేరండి, ఆఁ!"

ఫకడి మతిపోయింది. మళ్ళీ కన్నవారింటికి వెళుతుందా? ఆరు నెలలో ఏడాదో అయిపోతుంది. "నా కూతురు ఎంత ఇదయిపోయిందమ్మా," అంటుంది అత్తగారు-"మరి రెండు మాసాలు పోతే కాని పంపను" అంటుంది. "ఇట్లో అడుగు పెట్టగానే ఇంతతొందర ఎందుకోయి? బెల్లంకొట్టు చీమలు తినేస్తున్నాయా ఏమిటి?" అంటాడు మామగారు.

ఫకడి అన్నాడు, "ఎందుకలా అవుతావే వోసే, మున్నా మోతీ పెళ్ళిళ్ళకి మనం వొక్కదగ్గర వుంటే కదటే!"

హారాతల్లి బిగి తగ్గిపోయింది. భార్యతో పడక బసజు ఇల్లు వొదిలి వెళ్ళిపోయాడని వూరంతా పొక్కిపోయింది. తోటికోడలూ, మరిదీ ఈతంతు చూసి నవ్వుతున్నారు- కానైతే అదృష్టంలో ఏముంటే అదే అవుతుంది. ఇరుగు పొరుగు అమ్మలక్కల మొహం చూసిందికి పెద్ద కోడలు తల కొట్టేసినట్టుంది. ఎవరు చూసినా ముసిముసి నవ్వులు నవ్వ

తున్నారు. కెలికి కెలికి అడుగుతున్నారు, "ఏమో పెద్దకోడలా, ఏమి టంత జట్టి వచ్చిందేమిటి, బరజు ఇల్లువొదిలి వెళ్ళిపోయాడు?"

అయిందేదో అయింది. ఇక దేనికయినా ఆమె ఖాతిరీ* చేస్తుందా? ఏమీలేదు, బరజు కాస్త నవ్వుతూ మాట్లాడితే చాలు. కులాసాగా ఇంత తిని, సరదాగా తిరిగితే చాలు. శారదమ్మ ముండ ఎంతపని చేసిందీ? డబ్బులేమో లాగేసింది, ఏదీ ఫలితమేమీ దాఖలా ఇచ్చింది కాదే!

హీరా అత్తవారి సంగతీ, సున్నా మోతీల పెళ్ళిసంగతీ—ఇలా ఎన్నో విషయాలు పెద్దకోడలు బరజు నడిగింది. దేనికీ మనస్సు విప్పి బరజు జవాబు చెప్పలేదు.

పెద్దకోడలు అంది, "ఏముండీ, ఎల్లప్పుడూ మీరిలా ఉదాసీనంగా వుంటున్నారు. సున్నా మోతీలకోసం పెళ్ళికొడుకులు వెదకడానికి నేను వెళతానా ఏమిటి?

"నేనలా అన్నానా?"

"మరి ఆడపిల్ల పెళ్ళికాకుండా ఇంట్లో కూచుంటుందా? దాయాదుల కొంప, రేపు తెల్లవారితే ఒకడి వేళ్లవుతాడు. ఎంత తతంగమో నడుస్తూ వుంది."

బరజు మెల్లిమెల్లిగా అన్నాడు, "కాదూ, ఎవ్వరేం తతంగం చేస్తున్నారో, అదంతా నీ దగ్గిర వినాలని కూచోలేదు నేను."

భార్య మొహం చిన్నబుచ్చుకుంది. ఊరుకుంటే బరజు మరేమీ మాట్లాడడు. ఆమె అంది. "నా బింకం ఏం నిలబెట్టారని మళ్ళీ కోప్పడుతున్నారు! ఆకలితోనూ పస్తుతోనూ వెళ్ళి మళ్ళీ అయిదు రోజులు ఎక్కడో దేవులాడుతారు. మీమాట నేను ఏది వినలేదు చెప్పండి మీరు చెప్పింది ఏది చెయ్యలేదని!...."

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

---

* లెక్క

బరజు అన్నాడు, "నా మాట వినమనీ, నేను చెప్పింది చెయ్యమనీ నే ననలేదే, ఏంచేస్తే ఇల్లు బాగుపడుతుందో విచారించి, సొంతంగా నువ్వేందుకు తెలుసుకోవు?"

"ఆడదాన్ని నేను, నేనేమిటి తెలుసుకుంటాను? మీరు చెప్పరాదూ, ఏంచేస్తే బాగుపడుతుందో?"

బరజు కనిపెట్టాడు, భార్య కొంచెం మారింది, ఇలాంటపుడే ఆమె దారికి రావచ్చు.

"మంచిమాట, అయితే వొక్కపని చెయ్యి. నువ్వు చిన్నకోడల్ని ఏమీ దెప్పిపొడవవు కదా? అది నిన్నుతిట్టనీ, లేదా నన్నుతిట్టనీ,పిల్లల్ని తిట్టనీ_దేనిలోనూ నువ్వు నోరు విప్పకూడదు. ఎన్నో అన్నినోములూ, వ్రతాలూచేసి వొకొక్క రోజు పచ్చి మంచి నీళ్ళయినా ముట్ట కుండా వుంటున్నావుకదా, నోమో వ్రతమో అనుకుని. కాస్త ఈ మాత్రం పాలించు, ఏం, చేస్తావా?"

"ఊఁ. ఎందుకు చెయ్యను?"

భార్య మాటలో అంతజోరు వున్నట్టు అనిపించలేదు బరజుకి. రెండురోజు లయాక పెద్దకోడలు చిన్న కోడలుతో దెబ్బలాడేసి, నాలిక కరుచుకుంది. అన్నివిధాల బోధపరిచాడు బరజు. కాని కోపం మీద అన్నీ మరిచిపోయింది తాను.

బరజు అన్నాడు. "బాగానే నోము పాలించావు!"

భార్య ముసుపుటూ లరిస్తూ అంది. "పాడుబుద్ధి మండిపోనూ, ఏసరంత జ్ఞాపకం లేకపోయింది."

"సరేపోనీ, ఈసారి జ్ఞాపకం లేకపోయింది. మరొకసారి ఇలా అయితే? నాకుతోచింది నేను చేస్తాను."

భార్య భయపడిపోయింది. ఏమో, పరేం చేసేస్తాడో! అయితే చీటికీ మాటికీ చిన్నకోడలు కళ్ళముందు తన పిల్లల్ని అడ్డమాని తిట్లూ తిట్టిపోస్తూవుంటే, తానెలా ఊరుకుంటుంది? అసందర్భం!

బరజు గ్రహించాడు. ఊరికే ఇల్లు వొదిలి వెళ్ళిపోతే భార్య మారదు. యింట్లోవుండే, అన్ని ఉపాయాలూ చెయ్యాలి. ఇకముందు భార్య వ్రతభంగం చేస్తే తాను వ్రతం పాటిస్తాడు బరజు. ఇంట్లో తాను మాట్లాడడం మానేస్తాడు. భార్యతోనే కాదు, పిల్లలతోనే కాదు - ఎవ్వరితోనూ మాట్లాడడు. ఏమంటే, వొక్క భార్యతో మాటలు మానేస్తే, పిల్లలతో మాట్లాడించి అన్ని పనులూ జరిపించుకుంటుం దామె.

వారం పదిరోజులు గడిచిపోయాయి. నేత్రమణి ఎన్నో అంది. పెద్దకోడలు నోరు విప్పలేదు. అయితే ఆమె మనస్సులో తేళ్లూ, జెర్రులూ పాకుతూ వుండేవి.

"తగలబడిపోవాలి. మండిపోవాలి. బుగ్గయిపోవాలి. గొడ్డుముండ. పిల్లలు మింగిన పిశాచి. కూతురు ముండమోసిపోవాలి" - ఇలా గర్జిస్తూ చిన్నకోడలు యుద్ధానికి పిలిచేది; తుదకి వూరుకునేది. పెద్దకోడలు సహించునా ఇది! బరజు ఇంట్లో లేనప్పుడు అడపా దడపా ఏదో ఒక మాట అనేసి చప్పున వూరుకునేది. ఏమంటే, ఆమె వొక్కమాట అంటే చాలు, చిన్నకోడలు గొంతుక వొక్కసారి పంచమానికి లేచిపోతుంది. హఠాత్తుగా ఒకవేళ బరజు ఇంటికి వచ్చేస్తే, అతని చెవిని పడుతుంది: గదిలోనో, వీధిగుమ్మంలోనో బరజు వుంటేమాత్రం ఆమె నోరు బందయిపోయేది.

అవాళ ఎంచేతో బరజు త్వరగా ఏరుతోలుకు ఇంటికి వచ్చేశాడు. వీధి గుమ్మంలో ఏరు విప్పుతున్నాడు. ఇంట్లో కేకలు వినిపించాయి. అగ్గి మీద గుగ్గిలం చల్లుతున్నట్టు పెద్దకోడలు మధ్య మధ్య ఏదో అనేస్తూ వుంది. చిన్నకోడలు చిందులు తొక్కుతూవుంది. గదిలో బరజుని చూసి

పెద్దకోడలు నాలిక కరచుకుంది. గమ్మని పూరుకుంది. బరజు మొహం చూసి ఆమె వొళ్లు కొయ్యబారి పోయింది. చిన్నకోడలు సిగ్గూ సెరమూ వొదిలేసింగి. బావగారిని చూసి స్వరం కొంచెం తగ్గిందేకాని, బందు కాలేదు.

బరజు భావించాడు, తన జీవనం పాపిష్టి జీవనం తనవల్లే ఇల్లు సర్వనాశనం కాడానికి సిద్ధంగా వుంది. మాన మర్యాదలు మంటగలిసి పోయాయి. బంగారంలాంటి కొంప బుగ్గయి పోయింది. పండువంటి సంసారం పాడయిపోయింది. ఇంకేముంది? తుదకి కులనాశనమయి పోతుంది. ఇంటిమధ్య గోడవేసి వేర్లు కావలిసిందేనా? పోనీ అంత మాత్రాన కొట్లాట బందవుతుందా? ఒకరి జాగాలో వొకరు గొయ్యి తవ్వారనో, పొయిబుగ్గి పోశారనో, వొకరి పిల్లి వొకరి ఇంటికి వెళ్ళిందనో — అన్నిటిలోనూ కలహబీజాలుండనే వుంటాయి. అయితే ఏంచెయ్యాలి? వేర్లయిపోయి వొక అన్నదమ్ముడు మరో దగ్గిరికి లేచిపోవాలా? మనిషి తనలోవున్న పైశాచానికి జడిసిపోయి ఇన్ని పుర్రాకులు పడితే, ఇకఇరుగూ పొరుగూ, వూరూ వాడా చూసుకొని బతకడమెందుకూ? అడివిలో వొంటరిగా వుండడం ఇంతకంటే నయంకాదా?

బరజు ఏది నిశ్చయించుకున్నాడో అదే చేశాడు. ఇంట్లో సంపూర్ణంగా మాట్లాడడం మానేశాడు. భార్య అడిగినా పిల్లలు ఏదన్నాచెప్పినా— ఎవ్వరికేసీ అతడు చూసేవాడు కాదు – వొట్టి మూగతనమే కాదు. బ్రహ్మ చెముడు! ఇది చూసి భార్య బిక్కచచ్చిపోయింది. మళ్ళీ ఇదేమిటి? ఈ ఉపద్రవం! మనిషి పలుకూ ఉలుకూ లేదు. ఇదేమిటి? బరజు నడవడి చూసి ఆమె నవ్వాలా ఏడవాలా?

దినం మీద దినం వెళ్ళిపోతూవుంది – బరజు మాట్లాడలేదు. అప్పుడప్పుడు బలబలా చూసేవాడు. పూర్వం నీసు లేక పోతే ముద్ద రుచించేది కాదతడికి. ఎక్కడనుంచయినా రెండు ఎండిన పిత్తపరిగెలు

తెచ్చి కాల్చయినా సరే. అతని కంచం దగ్గిర పెట్టవలసిందే. కాని ఇప్పుడు చేపా మాంసమూ కూడా దగ్గిరికి రాడానికి వీల్లేదు. బరజు నోము పట్టాడు. కార్యం సిద్ధించేవరకూ దానికి భంగం కలగకూడదు. నూనె మానేసి జుత్తు పీచులా ఎగురుతూవుంది. ఒళ్లు పొలుసులా తయారయింది. మామ్మూలు ప్రకారం రాత్రిపూట భార్య కాళ్ళకి కాస్త నూనె మాలీసు చెయ్య డానికివచ్చేది. బరజు మాట్లాడకుండా లేచిపోయేవాడు. మొదటలో, బరజు మాట్లాడడం మానేసినప్పుడు భార్య వెటకారం చేసింది. నవ్వింది ఇప్పు డామెకి ఎల్లప్పుడూ ఏడుపు వస్తూవుంది. అవాళ అమావాస్య. బరజుకి అప్పాలంటే మహాప్రీతి. అంచేత కొబ్బరి ముక్కలు వేసి రుబ్బి బాగా మెత్తగా వుండేట్టు అప్పాలు పోసిందామె. మనసారా భర్తకి తినిపించా లని ఆమె అభిలాష.

బరజు జనపనార పట్టుకొని గుమ్మంలో నులక పేనుతూ కూచు న్నాడు. తుంగతెచ్చి ఎండబెట్టాడు, చాప తయారు చేయడంకోసం. పిల్ల లిద్దరూ దగ్గిర కూచుని వున్నారు. భార్య వచ్చి అక్కడవూడ్చి శుభ్రం చేసింది. తబుకుతో తబుకుడు అప్పాలు పెట్టేసి వెళ్ళింది. తరువాత పెద్ద గిన్నెతో సగం గిన్నెడు పాలూ, ఇంత ఇగురు కూరా, ఇంత బెల్లమూ పట్టుకుని గబగబా పరిగెత్తుకు వచ్చింది. బరజు వొకముక్క నోట్లో పెట్టాడో లేదో లేచిపోయాడు.

భార్య భరించలేక పోయింది – వొక్కసారి బాంద్రుమని భర్త చెయ్యి పట్టుకుంది – "ఎందుకిలా ఇది చేస్తున్నారు ! కసింత తినెయ్యండి. మీరేం చెబితే అది చేస్తాను. ఏ ప్రమాణం చెయ్యమంటే ఆ ప్రమాణం చేస్తాను."

బరజు మాటలు మానేసినప్పటినుంచి పెద్దకోడలు చిన్నకోడల్ని పల్లెత్తిమాట అనలేదు. అయితే మాత్రం ! అంతమాత్రాన అంతా అయి

పోలేసికదా! ఇంకా ఎంతో వుంది – అసలు సంగతి – మనస్సులు కల్వాలి. మనస్సులు కలియకపోతే ఏదీ జరగదు.

బరజు మాట్లాడాడు. పెద్దకోడలికి కోటి నిధులు దొరికి నట్టయింది!

బరజు అన్నాడు. "చెప్పనా? ఏం చెపితే అది చేస్తావా?"

"చేస్తాను తప్పకుండా, తప్పకుండా చేస్తాను. ఏం చెపితే అది చేస్తాను."

"ఏం, నువ్వు సొంతంగా తెలుసుకోరాదూ? ఏం చేస్తే బావుంటుందో అది చెయ్యరాదూ?"

"అలాకాదు, నాకేమి తెలియదు. ఏమి తెలియదు – మీరేం చెబితే అది చేస్తాను."

"చెప్పింది చేస్తావా?"

పెద్దకోడలు రెండు కళ్ళల్లోంచీ కన్నీళ్ళు ధారలు కడుతున్నాయి.

ఛకడీ, నేత్రమణీ ఈలోగా వొకటి రెండుసార్లు తలుపు చాటు నుంచి తొంగి తొంగి ఈ తమాషా చూసి వెళ్ళారు. బరజు దెయ్యంలాగ జుత్తు పీచులా పెట్టుకు నుంచుని వున్నాడు. అతడి ఆ గర్విష్ఠి భార్య– దేనికీ లొంగని మనిషి – ఆ పెద్దకోడలు అతడి రెండు చేతులూ పట్టుకొని తలవొంచుకు నుంచునివుంది. ఛకడీ నేత్రమణీ ఈ భాగోతం చూసి గదిలోకి వెళ్ళిపోయి, నోళ్ళ గుడ్డలు కుక్కుకుని నవ్వుతున్నారు.

బరజు అలాగే చలించని మహామేరువులా నుంచుని అన్నాడు. "సరే చెప్పు, నీ అంతట నువ్వు ఎన్నడూ చిన్నకోడలుతో వాదించవు కదా! జట్టీ పెట్టుకోవు కదా!"

"అది ఎంతగా ఏమన్నా వూరుకుంటాను."

"ఊం. అది ఎంతగా ఏమన్నా వూరుకుంటాను."

"సరే, ఇంట్లోకి పద, ఇంకా ఏం చెయ్యాలో చెప్తాను."

భార్య కన్నీళ్ళు బరజు పాదాలమీద పడి వున్నాయి. అతడి కఠిన మయిన పాదాలమీద వేడిగా వున్నాయో లేవో అతనికే తెలియాలి.

భార్య చూసింది. తాను నవ్వుల పాలయిపోయింది. నవ్వుల పాలె వరిదగ్గిర? బరజు దగ్గిరే.- లోపమేమిటి? అతడు దొమ్మరాడయితే, తాను దొమ్మరిది! లజ్జా అభిమానమూ అని పైన వొక మూత వుండేది. అది కాస్తా వూడిపోయింది. మరి భయం దేనికి? ఈ చిన్న కోడలూ ఛకడీ లకా? ఇరుగు పొరుగువాళ్ళకా?- పట్టు పట్టి అందామె. "ఊహుఁ, ఏదేం చెపుతారో ఇక్కడే చెప్పండి."

బరజుకి సిగ్గూ బిడియం ఏమీలేదు. పైగా ఈ తెలివిలేని ఆడమని షిని ఎంత ఇది చెయ్యలేదని తాను! ఎంత దుఃఖ పెట్టలేదని! ఆమె తన ఇల్లాలు, తన పిల్లలు కన్నతల్లి. ఆ స్త్రీయే విశేషించి లక్ష్మి. శక్తీ, దేవీ. దుర్గా అయి పూజింపబడుతోంది. బరజు అంత నీచంగా ఎలా చూస్తాడా మెని?

ఇవాళ పెద్ద కోడలు లజ్జా, అభిమానమూ ఏదీ గణించకుండా వుంది. ఇది చూసి బ్రహ్మానందంగా వుంది బరజుకి.

అలాగే నుంచుని అతడన్నాడు, "అయితే సరే, చెప్తు. రోజూ ఇంట్లో ఏది వండితే అదీ, తినడానికి అట్టే పెట్టిన నెయ్యీ, పాలూ ముందు ఛకడి కోసమూ చిన్న కోడలు కోసమూ వేరే పెట్టి వుంచాలి. వాళ్ళ తిండి ముందు చూడాలి. తరవాత పిల్లల సంగతి, అందరి వెనక నీదీ నాదిన్నీ."

పెద్ద కోడలు కళ్ళు మూసేసి చిలకలాగ అన్ని మాటలూ వల్లెం చింది- పిల్లల సంగతి చివరినా! కానీ, పిల్లలు నా వొక్కరి వాళ్ళేనా ఏమిటి? ఇది ఈయనకి దావుందని తోస్తే, మంచిదే.

బరజు కొంచెం నవ్వేసి అన్నాడు, "ఏమిటే, నా చేతులు పట్టుకుని అన్నీ చెపుతున్నావా? అన్న ప్రకారం చెయ్యకపోతే మాత్రం తరువాత విచారిస్తావు. నా మీద నీకు ఆశ లేదన్నమాట!"

పెద్ద కోడలు సిగ్గుతో ముడుచుకుపోయి చేతులు వదిలేసింది. నిజమే, అప్పుడు ఎంతసేపయి చేతులు పట్టుకునుంచుందో!

బరజు వచ్చి అప్పాల పళ్ళెం దగ్గిర కూచున్నాడు పిల్లలతో సరదాగా మాటామంతీ ఆడాడు. పెద్ద కోడలు బింకం సడిలిపోయింది కాని బరజునోట ఆమె ఇగురు కొంచెం తెమ్మనీ, పచ్చిగురిపకాయ కావాలనీ ఎప్పుడయితే విందో, అప్పుడామె కాళ్ళు కింద నిలవలేదు. గుమ్మం లోంచి ఇంట్లోకి వొక్క అంగలో వెళ్ళి వచ్చింది. గుండెలమీంచి పెద్ద కొండ దించేస్తే ఎలా వుంటుంది, అదిగో అలా తేలిక అనిపించిందామెకి. రాయిగా వున్న అహల్య మనిషిగా మారింది. ఇల్లూ వాకిలీ ఎంత బావున్నాయో ఇప్పుడు! బరజు పళ్ళెందగ్గిర కూచుని అన్నాడు, "ఛకడిని పిలు."

మంత్రం వేస్తే వెళ్ళినట్లు వెళ్ళింది పెద్ద కోడలు. ఛకడిని పిలిచింది. ఆ ఛకడే కొద్దిదానికి ముమ్మారు కలబడ్డాడు. అదేదీ జ్ఞాపకం లేదామెకి.

దుకాణానికి వెళ్ళి వచ్చాక తింటానని చెప్పి ఛకడి బైటికి వెళ్ళిపోయాడు.

పెద్దకోడలు మనసు ఖుసీతో* వుప్పొంగిపోతూ వుంది. అందరూ ఆమెకి మంచిగానే అవుపిస్తున్నారు. అందరితోనూ మాట్లాడాలని ఆమె మనస్సు గెంతులువేస్తూ వుంది. ఛకడి వెళ్ళిపోయాక పెద్ద కోడల్ని ఎవ్వరూ ఏమీ బెత్తాయించ లేదు. తనంతటతానే చిన్న కోడలు దగ్గిరికి వెళ్ళిందామె. ఆమె చెయ్యి పట్టేసుకుని అంది, "చెల్లి రావే, రెండు అప్పాలు తిందాం. ఛకడి ఎటో వెళ్ళారు. ఎంచేపటికి వస్తారో ఏమో!"

---

* సంతోషంతో.

చిన్న కోడలు పసికట్టింది- మొగుడు దగ్గర ఆదరణ పొందాలని పెద్ద కోడలు తన దగ్గరికి వచ్చి ఇదవుతూ గునుస్తోంది. మొహం దూపించేస్తూ ఆమె అంది. "ఉఁహూఁ, ఈ రెండు జాములవ్పుడు ఎవరు తింటారు? ముందు మీరు తినెయ్యండి."

పెద్ద కోడలు చిరునవ్వుతో అంది, "చెల్లీ వెనకటి మాటలు మరచి పోవమ్మా. ఎంతయినా నేను పెద్దదాన్ని కదూ!- ఎప్పుడో ఏదో అనేసి వుంటాను. అవన్నీ మూటకట్టుకు కూచుంటావా?"

చిన్న కోడలికి సూదుల్లా వుంటున్నాయి ఈ మాటలు- ఆలు మొగులు పడకండా వున్నప్పుడు ఎత మొగమంచే పెత్తనంగా వుండేది — ఇవాళ కలిసి పోయారని పెళ్ళాం వచ్చి పులుముకుంటూ వుంది!

చిన్న కోడలు మొహం ముంగలా చేసుకుని అంది, "ఎందుకూ! ఎవరన్నా నన్నేమనుకంటారూ? ఎవర్నన్నా నేనేమనుకంటాను?"

పెద్ద కోడలికి ఏమీ పాలుపోలేదు. తిరిగి వచ్చేసి బరజుతో చెప్పింది. అన్నీ విన్నాక బరజు అన్నాడు, "సరే చిన్న కోడలు తినే దాకా నువ్వూ తినకు."

పెద్ద కోడలు భర్త మొహం చూసి చిన్న వంకనవ్వు నవ్వింది. బరజుకూడా భార్యకేసి చూసి నవ్వాడు. ఇలా ఇద్దరు ఇంత క్రితం ఎప్పుడు నవ్వుకున్నారో, ఇద్దరికీ జ్ఞాపకం లేదు. తన నవ్వే అద్దంలో చూసుకున్నట్టు భార్య మొహంలో చూశాడు బరజు. ఆమె కూడా అలాగే తన నవ్వు భర్త మొహంలో చూసుకుంది. ఆశ్వయుజ మాసంలో నిర్మలమైన నల్లటి నీళ్ళలో కుమార పూర్ణిమ చంద్రుడు కలకలా నవ్వు తాడు. తాను నీళ్ళలో వున్నాననుకుంటాడు చంద్రుడు. తాను చంద్రుడిలో వున్నాననుకుంటుంది నీరు. ఇద్దరి దేహాలూ వుప్పొంగుతాయి. ఇద్దరికీ రోమాంచ మవుతుంది. అదిగో అలాగే భార్య మొహంలో ఈ నవ్వు చూసి బరజు శరీరం పులకరించింది. అతడికి తెలిసి వచ్చింది- పెళ్ళ

యిన రోజునుంచీ ఇవాళదాకా  ఆమెతో అతడు మీద మీదే కలిసి వుంటున్నాడు. ఇద్దరి మధ్యా వొక ప్రాకారం నిలబడి వుండేది– పేరుకి మాత్రం మూడు ముళ్ళూ పడ్డాయి. యింకా చెప్పాలంటే, యిద్దరు ఎడిపోయినప్పటి నుంచీ, యింకా ఎడమయిపోయారు. తమ మధ్యవున్న ప్రాకారం యివాళ వీరదర్పంతో పగల గొట్టేశాడు బరజు. భార్యా భర్తలు యివాళ దగ్గరగా కలసి వున్నారు. బరజులోని స్పర్శమణి తగిలి భార్యలోని యినుము కాస్తా బంగారంగా మారిపోయింది. యిద్దరూ యివాళ మేలుకున్నారు. భార్య మారిపోవడం చూసి బరజు ఆశ్చర్యపోయాడు. తానిలా కొత్త మనిషిలా అవుపించడం చూసి తనలో తానేనివ్వెరపోయింది పెద్దకోడలు.

మనుషులందరిలోనూ యిలా స్పర్శమణి వుంటుంది. తాకించ గలిగితే చాలు యినుము యావత్తూ బంగారమయి పోతుంది.

సగం రాత్రి యింటికి వచ్చాడు ఫకడి. అర్ధరాత్రిదాకా చిన్న కోడలూ పెద్ద కోడలూ ఎవరూ తినలేదు. పెద్ద కోడలికి లవలేశమూ కష్టమనిపించలేదు. తనకి ఆలశ్యమయిందని. ఆ చిన్న కోడలే, తన పిల్లల్ని ఎన్ని శాపనాకారాలు పెట్టలేదు! బరజుని ఎంతని తిట్టి పోసెయ్యలేదు! ఆ చిన్న కోడలు కోసం యివాళ తాను ఆకలితోనూ, పస్తుతోనూ పడివుంది!

ఫకడి రావడం తెలుసుకుని బరజు అన్నాడు. "ఏంరా, అర్ధరాత్రి దాకా ఎక్కడ తిరుగుతున్నావు. రా– ఏదీ, ఫకడికి తినడానికేదో పెట్టవే."

రోజూ భోజనం దగ్గర కూచునేముందు బరజు ఫకడిని పిలిచేవాడు. భోజనం చేశాడా లేదా అని కనుక్కునేవాడు  ఎటో వెళ్ళాడనో, భోజనం చేసి నిద్రపోతున్నాడనో జవాబు వచ్చేది.

ఫకడి ఎన్నడూ అన్నగారి ఎదుటపడేవాడు కాడు. అన్నగారికి వొకనాడూ జవాబు చెప్పిన పాపాన పోలేదు. ఏ గూడుపుఠాణీ చేసినా

నేత్రమణితో చేసేవాడు. అన్నగారు లేనప్పుడు వదినెతో జగడమాడే వాడు. హరిమిశ్రతో అన్ని మాట లాడేవాడు. కాని అన్నగారు ఎదురైతే మాత్రం పుంజాలు తెంపుకు పారిపోయేవాడు. నేత్రమణి వెనకనించి ఎంత పొడిస్తే మాత్రం ఏం లాభం ? అన్నగారి ఎదటికి వెళ్ళి అతడు వొక్కమాట నోరువిడిచి చెప్పలేకపోయాడు. ఛా !

పడకగదిలోకి వెళ్ళి ఛకడి నేత్రమణితో ఏదో గుసగుస లాడుతున్నాడు. బరజు మళ్ళీ పిలిచాడు. "ఏంగా. ఎక్కడ దూరావు ? ఇక్కడ వడ్డించారు. చల్లారిపోతుంది."

"ఆఁ వస్తున్నాను" అంటూ ఛకడి గబగబా కాళ్ళు కడిగేసుకు వచ్చి, అప్పాలపళ్లెం ముందు కూచున్నాడు.

పెద్దకోడలు మళ్ళీ చిన్నకోడల్ని పిలిచింది. "చెల్లీ, రావే. ఎవళ్ళమట్టుకు వాళ్ళు తిని పడుకుంటున్నారు. మన ఇద్దరమే ఏం తప్పు చేశామని, రా."

"నాకోసం నువ్వెందుకు కూచోడం ?" అంటూ చికాకు పడుతున్నట్టు లేచివచ్చింది నేత్రమణి. ఆఁ, ఇంత ఆదరణ ఎప్పటినుంచో ! చిన్నకోడలుతో కలిసి తినకపోతే పెద్దకోడలికి రుచించదులా వుంది !

పెద్దకోడలు పడకగదిలోకి వెళ్ళింది. పెళ్ళయి యిరవయ్యేళ్ళయాక ఇవాళ తన ఘనసంబంధానంలా వుంది. లోకమంతా తన బంధువులే అనిపిస్తున్నా రామెకి. శత్రువులంటూ ఎవ్వరూ లేనేలేరు. తొల్లింటి అందమూ యవ్వనమూ ఇప్పుడు ఆమెలో లేవు. నిజమే. కాని ఇవాళ తనకి వచ్చిన యవ్వనమూ అందమూ — అయిదేళ్లు, పదేళ్లు గడిచినా వాడిపోవు. శాశ్వతమైన వవి — ఎన్నడూ క్షయమంటూ లేదు వాటికి.

పెద్దకోడలంది, "ఏమండీ. హోరాపెళ్ళిలో మంచిదొక చీర తేలేదని చిన్నకోడలు చిన్నబుచ్చుకుంది. సున్నా పెళ్ళికి దానికోసమొక మంచి చీరె పట్టుకురండి."

లన చెవులు తాను నమ్మలేకపోయాడు బరజు. చిన్నకోడలు కోసం మంచి చీరె తెమ్మని పెద్దకోడలు చెపుతూవుంది. చిన్నకోడలు కోసం ఏదన్నావస్తే, ఈ పెద్దకోడలుకే తేహ్నా జెర్రుజూ పాకేవి. బరజు మెల్లి మెల్లిగా అన్నాడు "సరే, తెస్తానన కో మరినీకోసమో ?"

"ఆఁ, మంచి చీరలు కట్టడానికి నాకింకా వయస్సు వస్తోంగా ఏమిటి? నా పిల్లలు కడితే నేను కట్టినట్టుకాదూ!"

బరజు అన్నాడు, "నిజమే చెపుతున్నావా?"

"అబ్బే. మీరు వొక్కరే సత్యహరిశ్చంద్రులు. తక్కిన వాళ్ళంతా అబద్ధాలు చెపుతారు!"

"కాదు, నేను నిజం చెపుతున్నానని కాదు. ఆమనిషివేకదా నువ్వు! కాని ఈ మనస్సు ఇలాగే వుండాలి మరి !"

భార్య నవ్వుతూఅంది. "మనస్సు ఇలాగే వుండక ఏమవు తుందండీ?"

"బాగుంది, కాని చెప్పు, మనం ఇంటింటా బిచ్చమెత్తుకు తిరిగినా ఈ మనస్సు ఇలాగే వుంటుందీ? మారదుకదా?"

"ఎందుకండీ ఇన్నిమాటలంటారు? మీరు బిచ్చమెత్తుకు తిరిగితే నేను నాయరాలినై కూచుంటానా? బిచ్చమెత్తడం సంగతలా వుండ నివ్వండి, ప్రాణంపోయినా మారదనుకోండి."

బరజుకి బ్రహ్మానందం కలిగింది. పెద్దకోడలులో వున్న దేవత సైతానుని వోడించి కూచుంది.

మర్నాడు పెద్దకోడలు కోనేటికి స్నానానికి వెళ్ళింది. శారదమ్మా, బోడిపండా ఆవిడా వచ్చారు పెద్దకోడలి మనస్సు ఆనందంతో తాండవ మాడుతూవుంది. నూరేళ్ళయి పోగొట్టుకున్న బరజు ఇవాళ దొరికితే ఎలా వుంటుంది, అదిగో అలావుందామెకి. ఇవాళ ఏదీ చిన్నకోడల్ని, మరిదినీ నిందిస్తూ వొక్కమాట అనలేదే ఆమె! "మాకు మరేముందమ్మా, మాపిల్ల

లిద్దరికీ ఆ మూడు ముహ్నా, పడిపోతేసరి, చేతులు ముడుపుకుంటాం. తరవాత ఇల్లావాకిలీ వాళ్ళే అనుభవించనీ. లోకం మీద మనిషిజన్మ మెత్తాక, ఏది వచ్చినా తలవొగ్గాలి పంతమా? ఎవళ్ళమీద పంతమే అప్పా! తోడికోడలుతోనూ, మరిదితోనా పంతం! ఎందుకమ్మా, నెత్తిమీద పెట్టుకు ఎవరేం మోసుకు పోయారు కనుక, మేంమాత్రం మోసుకుపోరాం!"

పెద్దకోడలు నోట ఈ వేదాంతం విని శారదమ్మా, బోడిపంతా ఆవిడా నోళ్ళు వెళ్ళబెట్టి చూస్తున్నారు. పెద్దకోడలు చెప్పుకుపోతూ వుంది, "వాళ్ళ-చేస్తే చప్పట్లుకావు, అన్నా రాయన – 'మనది తప్పులేదా? వాళ్ళిద్దరిదేనా తప్పంతా? వాళ్ళు కుర్రాళ్ళు – వాళ్ళమాట మనం పట్టించు కుంటే తప్పు మనదవుతుందా, వాళ్ళదవుతుందా?' అన్నాడు. నిజం విచారిస్తే నాదిమాత్రం తప్పులేదంటే? అది నాకోసం ఏమి చెయ్యలేదే కట్టండి.* నేను పెద్దదాన్నికదా, నేనుమాత్రం దానికోసమేం చేశాను? ఎంచక్కా ఆయన బోధపరిచి చెపుతారంటే, అప్పా! – 'మనతప్పులు మనం చూసుకోలేం పరాయివాళ్ళతప్పులుమాత్రం మూటకట్టుకు తిరుగుతాం, నిజమే – నేను నా తప్పు ఎన్నడూ విచారించలేను. వీధీవాడా లోకులు ఆయన్నెంత మెచ్చుకుంటా రంటావు! నిజంగా దేవుడులాంటి మనిషి."

పెద్దకోడలు మరి అధికం చెప్పలేకపోయింది. తన సొంతాయన ప్రశంస ఎంతని ఎలా చెపుతుంది! ఛా, సిగ్గు సిగ్గు! తడిబట్ట మార్చు కుంటూ ఆమె అంది. "ఒలే అప్పా, ఒలే బోడీ, రండి రండి మీకోసం కొయ్యతోటకూరా, వడియాలూ అట్టేపెట్టి వచ్చాను."

పెద్దకోడలు వాటం చూచి శారదమ్మా బోడిపంతా ఆవిడా నిచ్చెర పోయారు. ఇంతదాతగా ఇది ఎన్నాళ్ళయి మారిపోయిందమ్మా!

---

* అనుకోండి.

బిరజు దగ్గర ఎంత ఖరారు చేసిందో, అంతా అక్షరాలా పాలించింది పెద్దకోడలు. తోడికోడలు సంగతి మరిది సంగతి రోజూ ముందుచూసే దామె. పెద్దకోడలు తననిలా ఆదరించడమే వాజీబయిన * పని అని భావించేది చిన్నకోడలు. ఇన్నాళ్ళ వరకూ తనకీ ఆదరణ దొరకలేదంటే అది పెద్దకోడలు దోషంవల్లే. పెద్దకోడలు చేస్తూవుంటే తాను కలుగజేసుకొని చేసిన పని తాను అధికంగా చేస్తున్నదన్నమాట: ఏమంటే పిల్లాజెల్లా బెడద పెద్దకోడలికేవుంది. అంచేత ఇంట్లో మూడువంతులపని ఆమె చెయ్యాలా వద్దా ?

* సక్రమమైన.

# 9

"ధరమా! ఎవర్రా కొట్టారు నిన్ను? ధరమా!—" పిలుస్తూ ధరమా దారిక ఇంట్లోకి వెళ్ళాడు బరజు. ధరమా వీపుమీద దూలగుండు కొమ్మల దెబ్బలు వాచిపోయి వున్నాయి. దుడ్డుకర్ర దెబ్బలు నల్లనల్లగా కమిలి పోయి వున్నాయి. చూసి బరజు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అతడు ఇంట్లోకి వెళ్ళి చూసేసరికి ధరమా భార్య కసింత నూనె తెచ్చి ధరమా వీపుమీద రాస్తూవుంది. బరజు అన్నాడు: "ధరమా, ఎవర్రా నిన్ను కొట్టారు?"

ధరముదాసు మూలుగుతూ మూలుగుతూ చెప్పాడు: "మీరు ఇంట్లో లేరా అన్నా! — ఒలే తేయే, ఆ బల్లచెక్క తెచ్చి అలావెయ్యే — ఆశియాళ గుంటడు లేడూ చందగాడూ — వాడు కొట్టాడు — బాపనోడు కొట్టించాడు."

"ఎందుకనిరా? ఏమయిందేమిటి?" నెమ్మదిగా అడిగాడు బరజు.

"మీకు తెలీదా అన్నా, అవడానికేటుంది? — మిశ్రబ్రామ్మడు ఎన్నాళ్ళయో పగపట్టాడు. ఇయాళ తీర్చేసుకున్నాడు. దుకాణం దగ్గిర కసింత జవాబు చెప్పాను. ఆయాలనించీ అగ్గిమీద గుగ్గిలం ఏసినట్టు న్నాడు—ఇయాల ఎద్దుల జత ఆడి అంటిపెరట్ల దూరిపోనాయి. దానిమీద అడిగావా మరి, ఆ కోపంతో నన్ను పట్టుకెళ్ళి కొబ్బరిసెట్టుకి కట్టేశారు. నా నొర్ని ఏమి అనలేదు. నా మాటతీరే అంత!"

బరజు కళ్లలోంచి నాలుగయిదు కన్నీటి చుక్కలు కిందపడ్డాయి. అయ్యో ధరమా! లోకంలో ఎంతమంది ధరుముదాసుల వీపులో ఇలా

పెట్లిపోతున్నాయి! ఎంతమంది బరజుల కళ్ళల్లోంచో కన్నీళ్ళు కారుతున్నాయి! కానైతే ఎవరేం చెయ్యగలుగుతున్నారు?

ధరమా అన్నాడు. "నన్ను ఈసారి ఆమమామ్మాయి తినిపించేశాడు. నానిక ఆ మిశరగాణ్ణి, చందరాగాణ్ణి సూసేత్తాను. మాదేవుంది? సర్వవూ తెగించుకు కూకుడున్నాం. సెయ్యాడితే కమపాడుద్ది. డబ్బుందా దనకవుందా, ఎవడన్నా వొట్టుకుపోయిందికి? పయిగా నా కొంపకాస్త సెటిలుమింటులో ఆడి పేర్నయి పోయిందన్నాడు. నా ఇంటి దిబ్బమీద వంగపెరడేస్తాడంట! ఆడెందుకేస్తాడు? నానే ఏసిపోతాను. అందుకనే మా ఇంటిదాంతో టన్నాను. 'నీ సేతికడియాలు ఇరిసేసి పారెయ్యి. నా ఆశ వొదిలేసుకో!' అన్నాను-'బారికాళ్ళ పడుసువి నువ్వు. రేపుపొద్దున మరో మనువు సూసుకుని సుకపడతావు. లేదంటే ఇక్కడెలా కూలినాలి సేసుకు బతుకుతున్నావో, ఇంకోదగ్గర అలాగే బతుకుతావు-నీ కడుపేనా పస్తుంటాది?' అన్నాను."

ధరమా మాటలు బరజు తెలుసుకోలేక అడిగాడు. "ఎందుకురా ఇలా పిచ్చాడిలా వాగుతున్నావు?"

"వాగడంకాదు బరజన్నా, యిదిగో చువానూనే. సిందూరం రాసి జాగ్రత్త సేశాను. సూడు!" బాగా సానపెట్టిన కత్తి తీసి చూపించాడు ధరుముదాసు. "ఇదిగో బరజన్నా, మనిషి పీకకి బాగా లేదూ!"

బరజు శరీరం నిలువునా రావి ఆకులా వణికింది. ధరమా నోట ఇవాళ ఈ మాటా? ధరముదాసు చెయ్యి పట్టుకుని అతడన్నాడు, "ధరమా, నా తమ్ముడివికదూ! కొంచెం వోపికపట్టు. యివాళ మంగళా అమ్మవారి దగ్గర పూజ – నిన్ను పిలవడానికి వచ్చాను – రాగలవా?"

ధరుముదాసుకి మంగళా అమ్మవారి పూజమీద బుద్ధిపోలేదు. మొదటిలాగే మళ్ళీ అన్నాడతడు. "చచ్చిన తల తూరుపుకీ, లేచంటె పడమటికి. ధరముదాసు మిశరగాడి నెత్తురు బొట్టెట్టుకుంటాడు."

"ధరమా, నా తమ్ముడిని కదూ! నామాట విను. కొంచెం వోపిక పట్టు. యిలా యిదయితే ఏమయినా జరుగుతుందా? ఇవాళ సాయంకాలం మంగళా అమ్మవారి పూజ —రాగలవుకదూ!"

"ఎందుకు రాలేను అన్నా. నాకేటయిందేటి? యింతకంటే గట్టి దెబ్బలే అరిగించుకున్నాను, యివేపాటి?"

మునిమాపు వేళయేసరికి ధరుముదాసు మంగళా అమ్మవారి చావిడి దగ్గిర చేరుకున్నాడు. ఎంతో ముందే వచ్చి కూచున్నాడు బరజు పధాను. సాంబ్రాణి పొగ చుట్టుపట్ల గమ్ముమనిపోతోంది. జయఖబెయి, ఉదసు తార, రూపజనా- జదుదళ్లొయి-వొక్కొక్కరే వచ్చి చేరుకున్నారు. తల వంచి మంగళాఅమ్మవారికి వొక్కొక్క దండం పెట్టేసి మాలతీలత మొదట కూచున్నారు.

జదుశెయి అన్నాడు "అన్నా బరజూ, అంతా అదృష్టంరా అదృష్టం! ధరుము దాసు పాపం, బడుగు పేద, ఎవడికేం నష్టం చేస్తు న్నాడు చెపూ? ఇవాళ ఇన్ని దెబ్బలు వాడి నుదుటిమీద రాసిపెట్టాడా?"

బరజు అన్నాడు, "అవాళ నీకు విడమరిచి చెప్పలేదూ—ధరుము దాసు అదృష్టం మరేమీలేదు, సాక్షాత్తూ హరిమిశ్రగారే. హరిమిశ్ర ధరుముదాసు నుదుటిరాత తయారు చేస్తాడు. ఒకప్పుడు మంచీ, ఒకప్పుడు చెడ్డా—ఎప్పుడేది తనకి నచ్చితే అది."

"లేదురా అన్నా, నాకెందుకో ఆమాట మీద నమ్మకం కలగడం లేదు. ధరుముదాసు రాత హరిమిశ్ర తయారు చెయ్యలేదు. హరిమిశ్ర రాత ధరుముదాసు తయారుచేశాడు."

"నువ్వు ఎలా అన్నా చెప్పు జదూ, ఒకటే అర్థం రావణాసురుడు రాములవారి దుష్టగ్రహమయి పుట్టడమెంతో రాములవారు రావణాసురుడి దుష్టగ్రహమై పుట్టడమూ అంతే. నుదుటిమీద రాసివుందంటూ కష్ట

మూసుకు ధ్యాసం చేస్తే జగరడు. దుష్టగ్రహం వచ్చిపడినా లోకులు గ్రహశాంతి అంటూ చేస్తున్నారు కదా!"

"అవును, అది నేను కాదనగలనా అన్నా!"

"అయితే, ఈ గ్రహశాంతికోసం ఎంతమంది నమం కడతారు?"

"బరజన్నా, నాను మీకేటి సూపెట్టాను?" అందరూ చెప్పాక కేకవేసి చెప్పాడు ధరుముదాసు.

బరజు తుళ్ళిపడ్డాడు. తరవాత అన్నాడు. "సరే, ఇవాళ హరి మిశ్ర కొట్టారు. రేపు జమీందారు గుమస్తా కొడతాడు. ఎల్లుండి సాహుకారు బంట్రోతు కొడతాడు — మనం ఊరికే దెబ్బలు తినడానికే పుట్టామా?"

"లేదు లేదు, దెబ్బలు తినడానికే కాదు, దెబ్బలు కొట్టడానికిన్నీ—"

"ఇవి వొట్టి గుండామాటలు. ఈఊళ్ళో యిన్ని రైతు కొంపలున్నాయి. ఎవరయినా ఎవర్నయినా కొట్టడానికి సాహసిస్తున్నారా? అంచేత సోదరులారా! దెబ్బలు తినడానికే మనం పుట్టాం. అయితే మనం ఎవరినీ కొట్టడం లేదన్నదీ అబద్ధమే. ఏమంటే మనమే మనవాళ్ళని కొడుతున్నాం. మన బంధువుల్ని, మన అన్నదమ్ముల్ని మనమే కొడుతున్నాం. మన తగువులు మనం తీర్చుకోలేం — అంచేతకదా పయి నుంచి తగు మనుషులు పిలవడం—!

ఉదనుతార అన్నాడు. "అది నిజమేరా తమ్ముడూ, మనం కుమ్ములాడుకోకపోతే అమీను డబ్బులెలా తింటాడు? అమీనురానీ, మేస్రీటు రానీ మనలో ఎవడి పొలం వాడిదే. తాత తండ్రులు ఏమ ఎరాలనుండీ ఎవళ్ళ పొలం వాళ్ళం దున్నుకుంటున్నాం. వాళ్లు కలం కాగితం పట్టుకుని ఏం చేస్తున్నారో చెయ్యనీ, మన పొలం మనం

దున్నుకుందాం. కలంతో గీసేస్తే మాత్రం నీ పొలం నాచేత దున్నిం చెయ్యరుకదా?"

బిరజు అన్నాడు, "ధరుముదాసు దెబ్బలు తిన్నాడు — ఎవరు కొట్టారు? మనలోంచి చందరాశియాళ లేకపోతే హరిమిశ్ర వొక్క మనిషి మూడువందలమందిని ఏం చేస్తారు? ఎంత మందిని కొడతారు? అసలు సంగతేమిటంటే మనలో కట్టులేదు- ధరుముదాసు దెబ్బలుతింటే, అతడి పొరుగింటి సోదరుడు ఉపియా నవ్వుతాడు. తాను మంచయి పోతాడు. ధరుముదాసు దెబ్బలుతింటే మనమందరం దెబ్బలు తిన్నట్టు. ఆలోచించండి! దమా ఇల్లు కాలిపోయింది. వాడి కొడుకు చచ్చిపోయాడు- ఆ దుఃఖం మన అందరి దుఃఖమున్నూ అని గుర్తించండి. అపర్తియా కాయిలా పడ్డాడు. మన ఇంట్లో ఒకడు కాయిలా పడ్డాడని భావించండి- దమా ఇల్లు నిలబెట్టడమూ మనపనే అనుకోండి. అపర్తియా కాయిలా మన కాయిలా అనుకోండి. ధరుముదాసుని వోదార్చడం మన అందరిపనే అని ఊహించండి. అప్పుడు దుఃఖమన్నది నీళ్ళలా ఇంకిపోతుంది. ఇంతమంది మంచివాళ్ళలో హరిమిశ్ర వొక్కమనిషి చెడ్డవాడయిపోగ లడా? ధరుముదాసు దెబ్బలు తిన్నప్పుడు యింతమంది నుంచున్నారు కదా, ఏం చేశారు?"

ఇద్దరు ముగ్గురు అన్నారు "మేమేం చేస్తామక్కడ. దెబ్బలు తినాలి కాని?"

బిరజు గట్టిగా అన్నాడు. అవును. దెబ్బలు తినాలి ధరుముదాసు దెబ్బలుతింటే మీరు తిన్నట్టుకాదా? నిన్న మీలో ఎవడో దెబ్బలుతిని వుంటాడు. రేపు మరొకడు తింటాడు. ఏమంటారు? ధరుముదాసు వొక్కడే దెబ్బలుతిన్నాడా, మీరందరూ తిన్నారా?

ముసిలి రతనభాయి అన్నాడు. "అవును, అందరూ దెబ్బలు తిన్నారు. ఇది మాటయిన మాట"

రూపజెన్నా అన్నాడు. "మేమక్కడ ఏం చెయ్యగలం చెప్పండి? హరిమిశ్రని ఎరుగుదురు కదా, అతడు ఎవరి మాటయినా వింటాడా? హేమా హేమీలకే దిక్కులేదక్కడ?"

బరజు తాపీగా అన్నాడు. "మీరు పదిమందీ ధరుముదాసు పక్షాన నిలబడిపోవల్సింది, "మిశ్రగారూ, ధరమా ఇవాళ వొక తప్పు చేసేశాడు. రేపు మేం చేస్తాం. మీరు గొప్పవారు. పదిమందిని తిప్పుకుంటున్నారు. మేం కూలివాళ్ళం. పశువులు కాసుకు బతుకుతున్నాం. మా మాట కొంచెం మన్నించండి ధరమా ఏం చేశాడో, ఏమన్నాడో పదిమందీ కూచుని విచారించండి. ఆ పదిమందీ ఏ శిక్ష నిర్ణయిస్తే ఆ శిక్షవెయ్యండి. కాదూపోదూ, కొడతామే అంటారా, అయితే మా అందరినీ కొట్టండి అని చెప్పవలసింది."

రూపజెన్నా నవ్వుతూ అన్నాడు. "హరిమిశ్ర ఈ మాట వింటాడా? మామీదకూడా దెబ్బలు కురిపిస్తాడు."

బరజు ఉద్రేకంతో అన్నాడు "బావుందేది-తింటే ధరుముదాసు కోసం దెబ్బలు తినివుండేవాళ్లం. మీ తమ్ముడుకోసం మీరు దెబ్బలుతినే వాళ్ళు. తప్పేంవచ్చింది. హరిమిశ్ర మనల్ని ఇవాళ ధరుముదాసు కోసం కొడతాడు. రేపు నీకోసం కొడతాడు. ఎల్లుండి నాకోసం కొడతాడు. ఒక్కొక్కడికోసం పాతికేసి మందిని కొడతాడు. ఎంత కొడతాడో కొట్టనీ. ఇప్పుడు మాత్రం కొట్టడంలేదు కనకనా! దెబ్బలికి జడిసి దొంగల్లాగ యిలా ఇళ్ళల్లో దాగుంటున్నాం. అలా అందరం కలసి గుండెలు చూపించి కలిసికట్టుగా నిలబడవలసింది. ఏది వీరత్వమో, ఏది మగతనమో తెలిసేది."

జమదశెయి అన్నాడు. "ధర్మమంటూ చొప్పగాలేదా ఏమిటి?— ఉత్తి అన్యాయం మీద సంసారం నడుస్తూవుందా?"

రూపజెన్నా అన్నాడు, "ఊరికే అనెయ్యగానే సరా! ఇంతమంది వున్నారుకదా. ఆపని ఎవరు చేస్తారో చెప్పండీ. చూద్దాం?"

బరజు పథాను మండిపోతూ అన్నాడు "నేను చూస్తాను. మిశ్ర గారి కాళ్ళమీదపడి చెపుతాను. మిశ్ర వినకపోతే ధరుముదాసుని కౌగిలించుకు నిలబడతాను-ఎంత కొడతారో కొట్టండి. ధరుముదాసు నా తమ్ముడు. అతడికోసం నేను దెబ్బలుతింటాను. ఈప్రాణం పోయినాసరే వొదిలి పెట్టను. ఊరికే ఈ దెబ్బలూ అవమానమూ పడడంకంటే, ప్రాణం పోతే మాత్రం ఏమంటాను! ఈ ఊరు ఊరంతా నిర్మానుష్యమయిపోతే మాత్రం పోయేదేమిటి? పథానపడాలో వంద పేదకొంపలు దుంపనాసనమయి పోతేమాత్రం లోటేమిటి? అందరినీ చంపేసి మిశ్రగారు వొక్కడే వుండాలనుకుంటున్నాడా? అందరి కొంపలూ కూల్చేసి, తన వొక్క ఇల్లే పెద్దది చేసుకోవడమే సుఖమని భావిస్తున్నాడా? అయితే కానీ, ఆయన వొక్కడే వుండనీ ఆస్తిమీద ఆస్తి పెరగనీ ఈ ఊరిలో మన అవసరమే లేకపోతే-ఇలా కుక్కల్లా, పురుగుల్లా బతకడంకంటే చావడం నయంకాదా? మనమంత బలంలేని వాళ్ళమనే మీ రనుకుంటున్నారా? అంత చేతకాని వాళ్ళమా మనం? గడ్డిని కాళ్ళతో తొక్కేసి గొర్రెలు మేసేస్తాయి. అయితే ఆ గడ్డితోనే తాళ్లు తయారయి, ఏనుగులాంటి జంతువు కట్టుబడిపోతుంది. మనం మనుష్యజన్మ మెత్తి, వంద కొంపజనం చచ్చిపోతాం, హరిమిశ్ర వొక్కడూ ఆ కొంప్లో వుట్టికట్టుకు ఊరేగుతాడా?"

ఎవరో వొకరు కేకవేశారు. "లేదు, లేదు. ఎక్కడన్నా వుందాయిది!"

బరజు అందుకున్నాడు, "మన దోషంవల్లే మనం చస్తున్నాం. మనం పదిమందిమీ వొక్క తాటిమీదికి వస్తే తెలుస్తుంది. హరిమిశ్రులు ఎటో మాయమయిపోతారు. మనం పదిమందిమి హరిమిశ్ర దెబ్బలికి చావడానికి సిద్ధపడితే చాలు, సోదరులారా, తెలుసుకోండి! ఈ పురుషు

నెత్తురు ఏ నేలమీద పడుతుందో, ప్రళయం వచ్చినాసరే, అక్కడ ఆ మరక మాసిపోదు. ఈ శుష్కించిన చర్మం ఎక్కడ మండుతుందో, ఆ అగ్నివొకదగ్గర కాదు, సోదరులాలా, పది దిక్కులు వ్యాపించి మండు తుంది. మరి — ఈ ఎముకలు — మిశ్రగారి దెబ్బలుపడి ఇనుములాగ గట్టిపడివున్న ఈ ఎముకలు — ఇవి ఎక్కడ పడనీ అక్కడ మాట్లాడ తాయి. భీముడులాంటి వీరుడు వచ్చి, మేరుపర్వతంమీద వాటిని కోటి కోటి యుగాలు రంగరించినా సరే, తరిగిపోవవి. సముద్రంలో పారేసినా సరే. అవి అరుస్తాయి. అన్నలారా, తమ్ములారా, మనం చేతకానివాళ్ళం కాదు. కొర్న్న నేలమించి మొలకలు పుట్టించగల రైతులం మనం కూలీలం!"

బరజు పధాను మాట్లాడలేక పోయాడు. సోఁ సోఁ జాపోసి పోయాడు. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ముసలి రతనభాయి అన్నాడు. "అవునురా, మన ఈ గడ్డిపరక బతుకు వుంటేనేం వూడితేనేం! చంపరా అంటే నేను చచ్చేవున్నాను అన్నాట్ట! మనం బతికే వున్నామా ఏమ న్నానా, మన్ని ఎవడన్నా చంపడానికి!"

ఉమదళెయి అన్నాడు. "ఇలా మనం చచ్చిపోయివున్నాం అలా అయితే ఇంకా బతికిపోతాం."

రూపజెన్నా అన్నాడు. "మీ ఇంట్లో శవంపడి కుళ్ళుతూ వుంటే నేను చూడనుకదా, మనలో ఇది జరుగుతుందా?"

గావంచాతో మొహం తుడుచుకుంటూ అన్నాడు బరజు, "అందు కనేరా తమ్ముడూ, మనకీ అవస్థ! అదేకదూ మొదట చెప్పాను! ఊఁ, ఏమంటారు? ఊరిలో పదిమందీ వొక్క కట్టుమీద వుంటారా? ఒకడి ఆపద, కష్టం, సుఖం పదిమందీ పంచుకుంటారా? ఏమంటారు? చెప్పండి. చెప్పరేం?"

వీణ్ణివాడూ, వాణ్ణివీడూ తోసుకున్నారు. "చెప్పు ఏం చెప్తావో!"

జదుదశెయి అన్నాడు, "ఇందులో ఎవడి చేతిదన్నా పనీ అయిదూ ఖర్చయిపోతుందా ఏమిటి? ఇది మనచేతులతో చెయ్యవలసినపని. నోటితో అనవలసిన మాట! ఊరిలో అందరూ అన్నదమ్ములే. ఊరంతా వొక్కటే ఇల్లు. ఈమాట గుర్తించుకుని అందరం కలిసి మసులుకుందామా? లేదంటే ఇప్పుడున్నట్టు జట్టీలూ జగడాలూ ఆడుకుంటూ వుందామా? నాకు ఆపదా హానీ వచ్చినప్పుడు నువ్వు వచ్చి నా గుమ్మంలో హామీగా నిలబడతావు. నీకు కష్టం వచ్చినప్పుడు నేనువచ్చి నీగుమ్మంలో నిలబడతాను. ఏంరా తమ్ముడూ రూపా! ఈమాట మంచిదా, లేకపోతే నీ ఇంట్లో జగడం జరుగుతూ వుంటే నేను గోళ్ళు గిల్లుకుని కూచుని, నీ పెరట్లో నా సొమ్ములు దూరితే నువ్వు బందెలదొడ్డికి తోలుకుపోయి – ఈమాట మంచిదా?"

రూపజెన్నా అన్నాడు, "ఈమాట వేరే అడగాలా అన్నా! అయితే నేనన్న మాటేమిటంటే, ఇది వొక్కరోజులో అయిపోయే పనికాదు. అదికాక మనలో వొకరో ఇద్దరో ఉలెత్తుతారు కదా!"

బరిజు అన్నాడు, "అలా లేచిన వాళ్ళని మనలోకి లాక్కుందికి ఎన్ని ఉపాయాలున్నాయో అన్నీ చేద్దాం. బతిమిలాడదాం. కాళ్ళు పట్టుకుందాం – ఎందులోనూ దారికి రాకపోతే వెలివేసి వేరే పెడదాం. పాకీ వాళ్ళు, మాలవాళ్లూ అన్యాయం చేస్తున్నారనేకదా మనం వాళ్ళని ముట్టలేదు. పదిమంది మాటమీదా నడుచుకోనివాడు. మంచి అన్నది ఎన్నడూ చెయ్యనివాడు పాకీవాళ్ళతోనూ మాలవాళ్ళతోనూ సమానంకూడా కాడు. పాకీవాళ్లూ, మాలవాళ్లూ కల్లు తాగుతారు– పాపంపనులు తలపెడతారు, పది రూపాయలు పాడుచేస్తారు, అంతే. వీళ్ళు అంతకంటే హీనులు."

జదుదశెయి అన్నాడు, "అవునయ్యా, పదిమందిలోంచి విడిపోయి వొక్కడు ఎటుపోతాడు?"

బిరజు పళ్ళి అందుకున్నాడు. "అచ్ఛా. అయితే మనలోంచి మొదట పదిమంది ముందుకి ఉరకండి. పెద్దవాణ్ణి మంచి దారికి తీసుకు వద్దాం. మనం మనుషులం మనిషి చేస్తే కానిదేముంది? ఊరి మంచి కోసం అంతాచేద్దాం. తిల్లకీ దెబ్బలికీ భయపడవద్దు. చావు వచ్చినా జంక వద్దు ఇదిగో నేను చెపుతున్నాను. ఈ పది మందిలో నేనొకణ్ణి. నేను ముందు అగ్గిలో దూకుతాను."

"నేనొకణ్ణి. నేనుముందు అగ్గిలో దూకుతాను."

తరవాత-జదు, నిధియా, రూపా, ఉదియా, నేపరా, ధరమా- పది మంది ముందుకివచ్చారు.

జదు అన్నాడు. "అన్నీ చేశావు కాని బిరజూ, మనిషి చేతిలో ఏమీ లేదురా. భగవంతుడు ఎంతచేస్తే అంత."

బిరజు నవ్వుతూ అన్నాడు "భగవంతుడు మన చేతులతోనే అన్నీ చేయిస్తున్నాడు, మనిషి దేవుడినుంచి వేరే ఉన్నాడా ఏమిటి?"

జదు అన్నాడు. "నువ్వన్నమాట నిజం"

"చేసేవాణ్ణి నేనేనోయి చేయించేవాణ్ణి నేనేనోయి. నన్నొకణ్ణి తప్పించేస్తే వేరేగతి లేనేలేదోయి"ధరముదాసు అన్నాడు. "అంతా సేస్తన్నారు మీరు. చావుంచి, కాని జరజన్నా, నా కత్తి మాత్రం నేను ఇడిసి పెట్టను. బాగా నూరినూరి అట్టేపెడతాను."

బిరజు నవ్వేసి అన్నాడు "నీకత్తి ముందు ఏట్లో పారేశాక నేనే పనయినా చేస్తాను."

రూపజెన్నా, బంఛా ఇళ్ళకివెళ్ళిపోతూ బంఛా అన్నాడు "బిరజు భాయి బాగా చదువుకున్నాడు. ఎంచక్కా మాటలు కూర్చి చెప్పాడో!"

రూపజెన్నా అన్నాడు "బరుణెలు పర్వతం బుద్ధావతారం నువ్వు. అలా అనకపోతే ఎలా అంటావు! ఓరే వాడు అమీనుపనిచేశాడు కదరా! చదువులేకపోతే వూరికే సర్కారువారు పనిఇచ్చేస్తారా ఏమిటిరా!"

# 10

వచ్చేపై శాఖలలో సున్నా పెళ్ళి. ధాన్యం వుడకబెట్టడమూ ధాన్యం దంచడమూ మినుములు దబ్బడమూ, వడియాలు పెట్టడమూ, పెద్ద కోడలికి ఊపిరితీసిందికి తీరుబాటు లేదు.

నేత్రమణి మంచి పట్టుబట్టి కూచుంది. "కన్నవారింటికి వెళతాను. అన్నయ్యకి కబురుచెయ్యండి" ఛకడి చుక్కలు లెక్కపెడుతూ కూచున్నాడు-వేర్లుకాకండా మరో దారిలేదు.

ఛకడి సన్నయ్య జారికితో చెప్పాడు. పెసలకోసం కళ్ళం తయారు కావాలి". సన్నయ్య ఆరు నెలల నౌకరు. బరజు పధాను ఇంట్లో అతడు ఆరు మాసాలు పాలేరుపని చేసేవాడు. మిగతా ఆరు మాసాలు వీళ్ళింటా వాళ్ళింటా కూలీ నాలీ చేసుకునేవాడు. ఛకడి చెప్పిన మాటవిని తెల్లబోయి చూశాడు సన్నయ్య.

ఛకడి అన్నాడు, "ఏంరా, బోధపడలేదూ?" సన్నయ్య అన్నాడు, "ఏమిటి సెపుతున్నారు? ఏరే కళ్ళ మెందుకు తయారుసెయ్యాల?"

"అరే. నీ కదంతా ఎందుకు? నీకు నేనేం చెప్పానో అది చెయ్యి. కోళ్లు మేపుకున్నవాడికి కొల్లో సంగతెందుకు?"

"ఊ, కోళ్లు మేపడమా? కొల్లో సంగతులా? నాకేటీ తెలవడంలేదు. దొరా, ఏర్లవుతారా? ఏ అన్న దగ్గర ఏర్లవుతారండీ- బరజు పధానుగారి దగ్గిరా? లచ్చమనుషుల్లో బంగారం ముద్ద కదా?"

"ఒరే, ఈ చలాకీ చూపమని ఎవరు చెప్పార్రా నీకు! నేను ఏన్తి చెప్పానో అది చెయ్యి వెళ్లు"

"సరే, కానీండి. కూలిబుర్రమాది. ఇదంతా మాకేం పట్టింది?"

సన్నయ్య మనసులో అనుకున్నాడు, "ఈడూ ఒక మనిసేనా? బరజుపథాను లాంటి అన్నదమ్ముడు నెత్తి కొట్టుకుంటే దొరుకురాదా?"

బరజు అరిటి గెలలకోసమని రెండు రోజులై ఎటో వెళ్ళాడు. ఇంటికివచ్చి అన్నీవిన్నాడు. చిరునవ్వు నవ్వుతూ భార్యతో అన్నాడు. "కానీ కానీ, మంచిదే అబ్బాయికి కొంచం సంసారం చేసే బుద్ధిరానీ, ఏమంటావు?"

"కానీ, మంచిదే. ఇందులో మనకి నష్టమేముంది?" పెద్దకోడలు కూడా నవ్వింది. ఆమెకి ఏమీ తెలిసినా తెలియకపోయినా ఒక్కటిమాత్రం తెలుసు. బరజు ఏది చేసిన సరైన పనే చేస్తాడనీ, ఏం చెప్పిన అసలయిన మాట చెపుతాడనీ ఆమెకి తెలుసు. అ పైన ఆమెకి తెలియక పోతే పోనీ— బరజు నుండి ఆమె ఎందులోనూ భిన్నం కాదు.

బరజు వెళ్ళి సన్నయ్యతో అన్నాడు, "ఏంరా సన్నీ, ఈ పెసలు ఏ మడివిరా?"

"పంచహాణియా బొలానివి దొరా!"

"తక్కిన పెసలు ఎండిపోయాయా ఏమిటి?"

"ఊఁ, రేపు తీసి పట్టుకొస్తాం— అవి మీ కళ్ళంలో కుప్పెయ్యాల కదా!"

"నా కళ్ళం వేరే ఏమిటిరా? ఇది మరెవడి కళ్ళమేమిటి?" వంకర నవ్వు నవ్వుతూ అడిగాడు బరజు.

సన్నయ్య అన్నాడు, "ఊఁ, గంధం తీస్తూ కర్ర పేరడుగుతారేటి దొరా! ఇది ఛకడి దొర కళ్ళం కాదా! ఏరే తయారు సెయ్యించినారు. ఆవి పెసలు ఏరే వుంటాయి. మీ పెసలు ఏరే వుంటాయి."

"వాడిదేమిటి నాదేమిటిరా సన్నీ — వాడిదీ నాదీ అయితే అంతా వాడిదే. నాదేమీ లేదు. తక్కిన పెసలు పట్టుకు వచ్చి ఈ పెసలుతోనే కలిపి యిక్కడే ఉంచు."

సన్నయ్య చూశాడు, ఇలాంటి మనిషితో ఏం చెయ్యడం? అడిగాడు. "అయితే అన్నీ పెసలూ ఆరే తీసుకుంటారా?"

బరజు నవ్వుతూ అన్నాడు, "అవునురా, వాడు కాకపోతే మరెవడు తీసుకుంటాడు?"

సన్నయ్య బలబలా చూశాడు, "వొంతు వేసుకోరా మరి?"

బరజు అన్నాడు, "ఒరే, తెలివి తక్కువ వాడా! ఒంతులు వేయడం ఎప్పుడయినా చూశావుట్రా? నేను పట్టుకు వెళ్ళితే వాడు పట్టుకువెళ్ళినట్టయేది, వాడు పట్టుకు వెళితే నేను పట్టుకు వెళ్ళినట్టు ఎందుకుకాదురా?"

సన్నయ్యకి ఏమీ అర్థం కాలేదు. పెసలన్నీ తెచ్చి ఒక్క దగ్గర కుప్పవేశాడతడు. ఛకడి అడిగాడు.

"ఏంరా సన్నయ్యా, ఇదేమిటి, పెసలన్నీ ఒక్క దగ్గిరే కుప్పేశావేమిటిరా?"

"పెద్దదొర సెప్పారండీ, అన్నీ మీరే తీసుగుంటారంట."

ఛకడి మనస్సు చివుక్కుమంది, "ఆఁ— ఏమిటీ?"

"అదేనండీ— మీ అన్నగారు సెప్పినారు. పెసలన్నీ మీరే తీసుగుంటారంట!"

ఇలాంటి మాటలికి రుషిలాంటి వాడైనా జుత్తు పీకుకుంటాడు! సులువుగా వేర్లయి పోదామనుకున్నాడు ఛకడి. పైగా ఈ గోలుమాలే• మిటి?

నేత్రమణి అన్నీ విన్నాక అంది. "మంచిదే ఆయన ఎంత మంచితనం చూపించుకుంటాడో చూపించుకోనీ, అన్నీ పెసలు పట్టుకు వచ్చెయ్యండి. అమ్మెయ్యండి."

• గందరగోళం

హరిమిశ్రగారన్నారు. "బావుందోయి, పిల్ల అదృష్టానికి వుట్టి తెగి పడింది. ఇంకా అడుగుతావా? వొదిలి పెట్టరు."

ఛకడిఅన్నాడు. "దద్దయ్యగారూ, అన్ని మాటల్లానూ వాళ్ళు ఇలాగే అంటారు— ఇటు కూతురు పెళ్ళి కొడుకు పెళ్ళి జరుగుతోనే వుంటాయి."

మిశ్రగారు కన్నుకొట్టి అన్నారు, "అదిగదీ అసలు కీలకం అక్కడే వుంది. నీకే సంగతి తెలియదు కనక; ఆవలిస్తే పేగులు లెక్క పెడతావు."

మిశ్రగారి మెచ్చుకోలు విని ఛకడి మొహం చేటంత అయిపోయింది. "సంగతేమిటో నేను తేల్చెయ్యనా దద్దయ్యగారూ, ఇంటి ఆడది నన్ను దద్దమ్మ అనేస్తేసరా;"

మిశ్రగారు కాస్తా ఉబ్బవేశారు. "ఒరే, నువ్వు దద్దమ్మ వయితే మరి: తెలిసినవాళ్ళెవర్రా?"

ఛకడి అన్నాడు "పెసలు సంగతేమో తేలిపోయింది, ఇంకా ఏమిటి చేస్తానో చెప్పనా?"

"ఇంక బెల్లం."

"సరిగ్గా చెప్పారండి దద్దయ్యగారూ——మీ బుద్ధికి మించింది లేదు. మీకు తెలియని సంగతేముందని; అవునండి దద్దయ్య, బెల్లం మాటచెప్పారు కదూ, వినండి. పది పన్నెండు కుండలికి మకాణానికి రెండేవచ్చాయి. తక్కినవన్నీ పట్టుకుపోయి ఇంట్లో పెట్టేశారు. ఖర్చు పెట్టిగన్న ఖర్చు పెట్టేసి. నాలుగయిదు కుండలు అమ్మేశారు. మరి రెండో ఎన్నో పెళ్ళికోసం ఇంట్లో అట్టిపెట్టేరు."

"ఒరే, నీకు చెపితేకాని తెలియదు— పన్నెండు కుండల్లో నీ వాటాకి ఆరు వస్తాయి. నువ్వు రెండు పుచ్చుకున్నావు— ఇంకా నాలుగు నీకు రావాలి కదా; అవి ఇంట్లో వుంటేనేం బైట వుంటేనేం? అవి నీవే."

"అవునండీ దద్దయ్య గారూ, మా ఆడది నాతో మహా పోరు పెడుతూ వుంది. 'మిగిలిన బెల్లం పట్టుకువచ్చి మన పడకగదిలో పెట్టండి మన బెల్లం మధ్యగదిలో ఎందుకుండాలి?' అంటుంది."

"అది కలిగిన వాళ్ళింటి పిల్లరా—ఏ మాట చెప్పినా ఇల్లు బాగు పడే మాట చెపుతుంది."

ఒకడి మధ్యగదిలోంచి మూడు బెల్లపుకుండలు తెచ్చి తన పడక గదిలో పెట్టాడు. పెద్దకోడలు నోరు విప్పలేదు. ఒకడి అనడం మాత్రం వింది, "పెళ్ళికి బెల్లం కొని పట్టుకు రండి. ఈ బెల్లం పురాణానికి కావాలి."

బరజు ఇంటికి వచ్చాక పెద్దకోడలు చెప్పింది.

"ఇదేమిటండీ బెల్లపు కుండలన్నీ ఒకడి పట్టుకుపోయాడు?"

ఇప్పుడు బరజు మొహాన ఎప్పుడూ చిరునవ్వే. గంపలాంటి మొహానికి ఆ నవ్వు అందంగా వుండేది కాదు. అతడన్నాడు' "పెళ్ళికి కొని తెస్తాం కదూ, అందుకని వాడు పట్టుకుపోయాడు."

"ఇదేం న్యాయమండీ, కొనితేవడ మెందుకూ?"

"కొనకపోతే పెళ్ళికార్యమెలా జరుగుతుంది?"

భార్య ఊరుకుంది. ఈ మాటకి మరేం జవాబు చెబుతుందామె?

సన్నియ్య దానికి అన్నాడు, "మరి లాబం లేదు! ఊ, ఊఁ అర్ధ రేతిరి నక్కలు రాపిస్తెంచెవడు?— నీళ్లు తోడించెవడు? ఫలసాయం పండిం చిందెవరు? బెల్లం తినేసరికి తినిందెవరు?"

నెత్తిరౌయు అన్నాడు. "ఒరే, మనిషయితే వాడిలా చేస్తాడా? ఎవడయినా అలాంటి అన్న దగ్గర వేర్లవుతాడు? ఉత్తిమప్పిన బుద్ధివల్ల ఇలా అవుతున్నాడు కాని వాడికి బుద్ధేమయినా వుందా?"

సన్నియ్య అన్నాడు, "బుద్ధున్నవాడు ఎవడన్నా ఇలా చేస్తాడా? ఆయన ఒక్క మనిషి, ఏది పండించకపోతే అదికాదు. పండించిన పెతీ పంటా కొంపకే వచ్చింది, అందరి కర్చూ అందులోనే కానేదా? అందులో

నుంచే నీ మకానం పాకకి రెండుకుండ లిచ్చినాడు గదా! ఆ వాపతేమన్నా కాని డబ్బు అడిగినాడా? పెళ్ళినాటికని రెండు కుండ లుంచినాము. అయి ఎగరేసుకెళ్లిపోయినావు! నువ్వు సిగ్గుమాలినోడి వయినావని అందరూ అలా గవుతారేటి? ఇంత అనాకారి బుద్ధా?"

ఇంట్లో ఏమయినా కానీ, పైటికి మాత్రం రాకుండా వుంటే చాలు — అదీ బరజు ఉద్దేశం. పైటిబుద్ధి వల్లే ఇల్లు ముక్కలు కాడానికి సిద్ధంగా వుంది. ఆ పట్టు మాత్రం అతని దృష్టిలేదు. ధీమా పెట్టుకు కూచున్నాడతడు. తాను విరవకపోతే ఇల్లు విరుగుతుందే? ఎవడి సాధ్యం? ఊరు వూరంతా ఒక్క ఇల్లు చేయడానికి పూనుకున్నాడు తాను. వాళ్ళందరినీ అన్నదమ్ములుగా చెయ్యడానికి సంకల్పించాడు. ఇటు తన ఇంట్లో అన్నదమ్ములిద్దరూ వేర్లవుతారా? అసంభవం! తండ్రి చెప్పాడు — "ఇంటి మధ్య గోడ లేవకూడదు, పొలం మధ్య గట్టు పడకూడదు. బరజు పధాను ఈ మాత్రం చెయ్యలేడా? చూద్దాం ఈ ప్రాణం వుంటే ఎంత వూడితే ఎంత?

మొన్న సాయంకాలమే కదూ ఊళ్ళోవాళ్లు యానస్మంది మంగళా అమ్మవారి వాళ్ళ నీళ్ల పుచ్చుకుని కాపూ, డొరికా, గుడియా * మంగలీ ఒకరి నొకరు అన్నా అంటే తమ్ముడూ అని పిలుచుకున్నారు! ఇవాళ, ఒకే రక్తం పంచుకుని, ఒక్క తల్లిదండ్రుల కడుపున పుట్టిన అన్నదమ్ములు ఛకడీ బరజులు వేర్లవుతారా? రేపు చందరా, జగువా ఏమంటారు? 'బరజు ఇంట్లోనే కట్టులేదు — ఒక్క కడుపున పుట్టిన అన్నదమ్ములే వేర్లయిపోతున్నారు — ఇక వూరంతా అన్నదమ్ములెలా అవుతారు? ఒకడు కాయిలాపడితే ఒకడు వచ్చి ఎలా సాయం చేస్తాడు?' అంటూ అనరూ? బరజు పధాను బతికివుండగా ఈ మాట వింటాడా? అలా అయితే తాను చవ్వకుండా బతకడ మెందుకు?

---

* బెల్లం పిస్తుప్పులు చేసే జాతి.

కట్టికర్ర విరిగిపోతుంది కాని వంగదు. బరజు పధాను నికరమైన మనిషి హారా పెళ్ళి ఎలా జరిగిందో సున్నా పెళ్ళి జరగాలి. మోతీ పెళ్ళి అలాగే జరగాలి. హారా పెళ్ళికి తాను ఎక్కడయినా బిదులు తెచ్చాడా? ఇంట్లో పాతుదేమయినా తీశాడా? ఆ ఇంట్లోనే ఎలాగో వొకలాగ జరిగి పోయాయి. సున్నా, మోతీలకోసం భయమెందుకు? వాళ్ళని పుట్టించిన వాడే చెప్పకండా చెయ్యకండా మొదట తల్లి రొమ్ముల పాలు సిద్ధం చేసి పెట్టాడు. వాడే ఇప్పుడున్నూ అన్నీ నెరవేరుస్తాడు. దీనికొక విచారపంటూ ఎందుకూ బరజుపధానుకి?

"చేసేవాణ్ణి నేనేనోయి, చేయించేవాణ్ణి నేనేనోయి."

నన్నొక్కణ్ణి తప్పించేస్తే వేరేగతి లేనేలేదోయి! చేసినా వాడే చెయ్యాలి, చేయించినా వాడే చేయించాలి. దీనికోసం యింత బుర్ర చించు కోడమెందుకూ బరజూ? ముసలిపధాను కళ్ళు మూసినప్పుడు ఆకాశం కేసి చెయ్యిచూపించి చెప్పిపోయాడు, 'మీ కోసం ధర్మం దాచాన'ని, ఏదీ ఎక్కడ దాచాడు? బరజు దగ్గిర దాచాడా? భకడి దగ్గిర దాచాడా? మరిం కెవరిదగ్గిర దాచాడా? ఎక్కడ దాస్తేనేం? ధర్మం అందరి కోసమున్నూ కాదా! అందరి యిళ్ళల్లోనూ అది నిండేవుంది. బరజుకి భయందేనికి - భయ పడేవాళ్ళు నాస్తికులు, బరజుకోసం ధర్మం వుంది- చెట్ల చేమల్లో వుంది, నదుల్లో వుంది, పర్వతాల్లోనూ, అడవుల్లోనూ— అన్నిచోట్లా బరజు కోసం ధర్మం వుంది. మనుషుల గందిక * లోనూ, ఊళ్ళలోనూ, పట్టణాల్లోనూ ఏ ధర్మం వుందో మనుష్యమాత్రుడు లేనిచోటా, జీవ జంతువులు లేని చోటా అదే ధర్మం వుంది. బరజు దేనికి భయపడుతున్నాడు? మానవ బాలుడే కదా, ధ్రువుడు! అడివీ గిడివీ ఏదీ లక్ష్యపెట్టలేదతడు. పులికీ, పాముకీ దేనికీ బయపడలేదు.

---

* సంపది

బరజు గదిలో చేతులు జోడించి అన్నాడు, "హే ధర్మదేవతా! నాకు బలం ప్రసాదించు. సాహసం ప్రసాదించు. అధర్మం వున్నచోట, పాపం వున్నచోట నేను బోర * విరుచుకు నుంచో గలిగేట్టు. ప్రాణాలర్పించ గలిగేట్టు అనుగ్రహించు. అధర్మం హతమార్చడానికి, పాపం ధ్వంసం చేయ్యడానికి నా ఎముకలు ఆయుధాలు కానీ!"

సున్నా పెళ్ళి జరిగిపోయింది.... చిన్న కోడలు కోసం మంచి కోక వచ్చింది– అయితే ఆమెకి మాత్రం నచ్చలేదు– "ఊఁ, పెళ్ళిమీద పెళ్ళిచేసి ఇల్లు గుల్ల చేసేశారు. ఊరికే నా కళ్ళు తుడవడానికని చీరె ముక్క పట్టుకువచ్చారు. ఓ, ఎన్నికోకలో చూశాను– మీ చీరె మీరే పెట్టుకోండి."

ఎన్ని కాలాలనుంచో మనుష్యజాతి ప్రవాహంలా సాగిపోతూ వుంది. మనిషిని మనిషి కుమ్ముకుంటూ పోతున్నాడు. కాళ్ళకింద చచ్చి చావని మనుషులు "చచ్చాను చచ్చాను" అంటూ అరుస్తున్నారు. కుమ్ముకు పోతున్న వాడి చెవులకు వినిపించడం లేదు. ఈ వడిలో అతడు కొట్టుకు పోతూ నడుస్తున్నాడు. క్షణం కూడా ఆగడం లేదు. నిలవడం లేదు. ఎవరో కేక వేస్తున్నారు. కొంచెం విందామన్నా మాటలేదు. కెరటం మీద కెరటం– వొకడు మునిగితే వొకడు తేలుతున్నాడు– వొకడి సంగతి వొకడి కక్కరలేదు! తన అన్నదమ్ముల రక్తం తాగడం తన బంధువుల రక్తం, తన కుటుంబం వాళ్ళ రక్తం, ఇరుగు పొరుగు వాళ్ళ రక్తం తాగడం నేటిదాకా మానలేదు మనిషి. ఇంకా ఏ నాడు మనిషికి సభ్యత్వం వస్తుంది? అడవులూ, మహారణ్యాలూ మారిపోయి మేడలూ మిద్దెలూ అయిపోయాయి కాని మనిషి ప్రకృతి మాత్రం– మతం, కపటం, అహంకారం– ఎలాంటి దలాగే వుంది–

---

* రొమ్ము

భూమి సూర్యుడి చుట్టూ తిరుగుతూ వుంది. పగలూ, రాత్రీ, నెలలూ, సంవత్సరాలూ తయారుచేస్తూ వుంది. మనుష్యజాతి ప్రవాహం యుగయుగాల నుండీ వొకే విధంగా సాగిపోతూ వుంది. ఎన్నెన్ని కలహాలు, కపటాలు, అహంకారాలు– ఎంతలేసి యుద్ధాలు, మహా యుద్ధాలు, రాజులు, మహారాజులు ఎటో వెళ్ళిపోయారు. సత్య, ద్వాపర, కలియుగాలు ఎటో ఏష్యమై * పోయాయి. ఈ కాల ప్రవాహంలో ఎవరి స్థానమెంతవుందో, దాని బేరీజు వేసినవాడెవడు? బరజుపథాను! బరజుపథాను దీనిలో ఎక్కడ? ఈ ప్రవాహంలో అతడొక గడ్డిపరక. ఎన్ని సుళ్లో ఎన్ని సుడుగులో, ఎన్ని బుడగలో దాటుకుంటూ నడిచిపోతున్నాడతడు. కాని హటాత్తుగా మధ్యలో అడ్డం వచ్చింది. ఆగూ, ఆగూ– ఎవరో పిలుస్తున్నారు– ఎవరో చీత్కారం చేస్తున్నారు. ఇది మనిషి గొంతుకే! మనిషి! మనిషి!

ఒరే మనిషీ! భూమి నీకు చాలడం లేదురా, ఆకాశం చాలడంలేదు– పైగా యేమిటీ పని? నీ అన్నదమ్ముల్ని, నీ జాతివాళ్ళని, నీ రక్త బంధువుల్ని కుమ్మేసి, తొక్కేసి వెళ్ళిపోతున్నావు!– ఒకడు రోగంతో మూలుగుతున్నాడు. అలడికి మందు పిసర తెచ్చిపెట్టే దిక్కులేదు– చేతిలో ఎర్రని ఏగానీ లేదు– వొకడు ఒకపూట తిని, మూడుపూటలు పస్తుపడి వున్నాడు. చంకలో పిల్లాడికి కుడపడానికి వొకతల్లి రొమ్ములో పాలులేవు– వొకడి వీపు దెబ్బలతో పెంప్లోయి వుంది. నూనె చుక్క కోసం చేతిలో దమ్మిడీ లేదు– ఇదంతా మనుష్యజాతి! ఆగూ, ఒక్క క్షణమైనా నిలబడు! ఎంతమంది మనుషులో వెళ్ళి పోయారు. రాజులూ, మహారాజులూ వెళ్ళిపోయారు నువ్వు కొంచెం ఆగిపో. రవంత వినసయినా విను– మనిషి గొంతుక కదూ!

---

* గడిచి,

బిరజు పధాను మానవ ప్రవాహంలో అడ్డుకుపోయాడు. అతడు కేక వింటున్నాడు— రోగులూ సగం చచ్చినవాళ్ళూ, పస్తుపడున్నవాళ్ళూ, దెబ్బలుతిన్న వాళ్లూ అరుస్తున్న అరుపులు వింటున్నాడు. అతడిక దేనికి భయపడతాడు? ఇంటింటా బిచ్చ మెత్తుతాడు. దెబ్బలు తింటూ చచ్చి పోతాడు. బిరజు పధాను చావుకి భయపడతాడా? తనది ఏమంత గొప్ప జీవనమని! తన కోసం ఏడ్చేవాడెవడు? వెదికేవాడెవడూ? రోగంతోనూ, పస్తుతోనూ కోట్లకొద్ది మంది ఊరూ పేరూ లేకుండా చచ్చిపోతున్నారు. పుడిసెడు నీళ్ళు దొరకడం లేదు. పుట్టినప్పటినుంచీ చచ్చినదాకా ఎంతో మంది హరిమిశ్రుల చేత పశువుల్లాగ దెబ్బలు తింటున్నారు. బొబ్బలు పెట్టి పిలిస్తే వినేవాళ్ళు లేరు. బిరజు పధాను వాళ్ళలో వొక్కడయి చస్తాడు. హే ధర్మ దేవతా! నువ్వు ప్రపంచం భరిస్తున్నావు. నీ దగ్గర రాజులూ, మహారాజులూ ఎంతో, నిరుపేదలూ, గర్భ దరిద్రులూ అంతే. లోకంలో ధనం కలవాళ్ళకి, బలమున్న వాళ్ళకి, శక్తికల వాళ్ళకి నువ్వు మంచిబుద్ధి ప్రసాదించు. మంచి మాటలు నేర్పు— దుఃఖితుల మీద, దుర్బలుల మీద వాళ్ళ హృదయంలో దయ పుట్టించు. ధరమావాడికి! వాడికి ఈ బుద్ధి ఎవరిచ్చారు? దెబ్బలు తినితిని వాడు చచ్చిపోతున్నాడు. వాడు మరి మనిషయి లేడు— చచ్చిన శవమయి పోయాడు. ఎంతమంది ధరముదాసులు ఇలా బతికివుండి శవాలయి పోయివున్నారు! ఓ ధర్మదేవతా! ఓ సత్య దేవతా! వాళ్ళని మరు మనుషులు చెయ్యండి. మంచిబుద్ధి నేర్పండి. గొప్పవాడు తక్కువ వాళ్ళని మంచి చూపు చూడనీ— మనిషి మనిషిని గుర్తించనీ— గౌరవించనీ, చిన్నవాడు పెద్దవాణ్ణి ఈసుతో చూడకుండా వుండనీ. ఎదటివాడు గొప్పవాడని అతడి నాశనం కోరకుండా వుండనీ. —బిరజు కళ్ళలో గిర్రున నీళ్లు తిరిగాయి.

"బిరజు అన్నా — బిరజు అన్నా !"

"ఏంరా నిత్తా, ఇలాంటపుడు వచ్చావు?"

నితెయి మహరణా వొంటినిండా ధూళి — కాళ్ళనుంచీ తలదాకా విభూతి పూసుకున్నట్టుంది.

నితా మహరణ బాంద్రుమని ఏడుపు మొదలు పెట్టాడు. "బరజు అన్నా, నాపని అయిపోయింది — నాబిడ్డలు వీధిలో బికార్లయిపోయారు. కర్రలు నరుకుతే కడుపు నిండుతూవుంది, పాతిక రూపాయలు నే నెక్కడి నించి తెచ్చేది చెప్పూ? నా పిల్లలు ముష్టెత్తుకోవాలి కానీ ఇంకేమయినా వుందా అన్నా!

బరజు అన్నాడు, "ఎందుకలా ఇదవుతావురా నితెయి. ఏమిటయిం దేమిటి?"

నితెయి కూలబడిపోయి, నెత్తిమీద చేతులు పెట్టుకుంటూ అన్నాడు, "కూతురు పెళ్ళికి, కులంవాళ్ళ సంతర్పణకని పదిరూపాయలు బదులు తెచ్చాను. ఇరవైదాకా తీర్చాను. కాగితంముక్క ఇచ్చెయ్యమంటే ఇవాళ పాతిక రూపాయలు తెమ్మంటున్నాడు. 'బీదముండావాణ్ణి, ఇన్ని రూపాయలెక్కడ తెచ్చేది? నాకేముందని!' అన్నాను. దానిమీద 'ఏం ఊరంతా కమిటీ కట్టారుకదా, ఇప్పుడు నీబాబు ఎవడిస్తాడో ఇవ్వదేం? అంటున్నాడు. ఈ మాటవిని అన్నా, నాగుండెలెండిపోయాయి. కడుపులో శూలనొప్పి లేచింది. నా పిల్లలు నష్టేట్లో మునిగిపోతారుకాని ఇంకా ఏమన్నా వుందా? గంజీ కడుగూపోసి పెంచాను వాళ్ళని — రేపు పొద్దున్న వీధిలో బికార్లయి తిరుగుతారు. పిల్లాడికీ ఉబ్బసా కఫం ముంచుకొచ్చింది. మందుతెచ్చి ఇద్దామంటే చేతిలో దమ్మిడీలేదు. పాతిక రూపాయలు ఎక్కణ్ణుంచి తెచ్చేది చెప్పూ!"

నితెయి మహారణ భో భో ఏడ్చాడు. బరజు అడిగాడు, "ఎవరి రూపాయలు రా నితెయి, మిశ్రగారివటరా? ఏం నువ్వు ఎప్పుడెప్పుడు ఎంతెంత ఇచ్చావో విడమరచి చెప్పలేదూ?"

"ఇంకా చెప్పే దేమిటిరా అన్నా. బుగ్గిలో దొర్లిదొర్లి తలమీద వెంట్రుకలు వూడిపోయాయి. ఏమీ లాభం లేకపోయింది — 'పోషో ఊరంతా కమిటీ కట్టారు కదా. ఊళ్ళోవాళ్ళు ఇవ్వరా ఏమిటి?' అంటూ కసిరికొట్టేశాడు.

"కానీ, నితెయి కొంచెం నెమ్మదిపడు—ఇలా వూరికే అన్యాయంగా అన్నీ సాగిపోతాయా?"

"బరజు అన్నా, నష్టేట్లో కొట్టుకు పోతున్నాను — నాకు దిక్కు మరెవరున్నారు? పగలూ రాత్రి చేస్తూ మీదవున్న భగవంతుడే చూడాలి."

బరజు కళ్ళు చెమ్మగిల్లాయి. పెదవులు వణికాయి.

"అన్నీవాడే చేస్తున్నాడు రా నితెయి. పైనా కిందా వాడే వస్తూ పోతూ వున్నాడు. వాడే అన్నీ చూస్తున్నాడు. వాడే అన్నీ చేస్తున్నాడు. వాడే తప్ప నీ సంగతి ఎవడు విచారిస్తాడు?

బరజుపధాను కళ్ళలోంచి నాలుగయిదు కన్నీటిచుక్కలు రాలి కింద పడ్డాయి. బరజుపధానా విచారిస్తాడు! చేత్తో గడ్డిపరక తెంచలేడు. నితెయి మహారణాని ఎవడు చేశాడో, హరిమిశ్రుని ఎవడు చేశాడో వాడే నితెయి మహారణ సంగతి విచారిస్తాడు."

"చేసేవాణ్ణి నేనేనోయి చేయించేవాణ్ణి నేనేనోయి
నన్నొకక్కణ్ణి తప్పించేస్తె వేరేగతి లేనేలేదోయి"

బరజుపధాను ఏంచేస్తాడు? అదిగో వాడి ఆజ్ఞా వాడి ఇచ్ఛా బరజు పధానులో ప్రకాశిస్తూవున్నాయి.

# 11

సున్నా పెళ్ళి జరిగిపోయింది. నేత్రమణి కోక కట్టుకోలేదు. బిరజు పధాను పెసలు కొన్నాడు. బెల్లం కొన్నాడు. పెళ్ళి చేశాడు. భకడి బెల్లం అమ్మాడు, పెసలు అమ్మాడు. నేత్రమణికోసం కుత్తగంటు తయారయింది. గోవతాడు వచ్చింది.

భకడి అన్నాడు. "దద్దయ్యా నేనేం చేసినా సరే. అన్నయ్య కిక్కురుమనడం లేదు. పెసలు అమ్మేశాను. బెల్లం అమ్మేశాను. అంతా పట్టుకెళ్ళి ఖర్చు పెట్టేశాను. అన్నయ్యా వదినా దేనికీ నోరు విప్పలేదు. మా ఆడదిమాత్రం వేరే పొయ్యిపెడదామని ఎల్లప్పుడూ ప్రాణం తినేస్తుంది, 'మందెడు పిల్లలు. అందరికీ పెళ్ళిళ్ళు చేస్తారు. దొంగతనం చేసినవాళ్ళు అన్నిటికీ వూరుకోక ఏంచేస్తారు? ఊరుకుంటేనే వాళ్ళకి లాభం. మళ్ళీ మోతీ పెళ్ళి జరుగుతుంది. పెళ్ళయి వెళ్ళిన కూతుళ్ళ ఇళ్ళకి ప్రతినెలా కావుళ్ళు నడుస్తున్నాయి. చిన్నగుంటడి కోసమని రోజూ గిన్నెడు పాలు వాడిక?' — ఏమయినాసరే, దద్దయ్యా. నా మనస్సెందుకో వొప్పకుండా వుంది. అన్నయ్య ఎందులో అయినా పల్లెత్తుమాట అంటే అనుకోవచ్చు. లోగడ వదినన్నా చిర్రూ బుస్సూ లాడేది. ఇప్పుడు ఆమె కూడా గమ్మని వూరుకుంటుంది — చిత్రం! నేను వొక్కణ్ణే ఎంతని కయ్యానికి కాలుదువ్వేది? లోకులేమంటారు నన్ను! 'లోకులు మనని చెడ్డవాళ్ళంటే అననీ' అంటుందది — 'లోకులు మంచీ అంటారు. చెడ్డా

అంటారు — కాని ఎవరయినా మనఇంట్లో తెచ్చి పెట్టేస్తారా ఏమిటి?' అంటుంది.

మిశ్రగారు నవ్వారు, "అవునురా, నేనేమిటి చెప్పాను? — పులిపిల్ల పులిపిల్లే, పిల్లిపిల్ల పిల్లిపిల్లే. — అయినింటి పిల్ల అది. నువ్వు నిజంగా దద్దమ్మవి. ఒరే, వీధిలో తలమాసిన వాళ్లు, పూటకి గతిలేనివాళ్లు ఏదో అంటారు. వాళ్ళమాటల్లో ఏముంది? నన్ను అందరూ మంచంటున్నారా ఏమిటి? అందుకని ఈ దరిద్రగొట్టువాళ్ళ మాటలికి భయపడతానూ? ఇలాంటి నూరు కుక్కలు మొరిగితే నన్నేం చేస్తాయి?"

భరడి ఉంటూరూ అన్నాడు, "అయితేనేంగాక, దద్దయ్యగారూ అన్నీ తెలుసునాకు. అయినా ఎంచేతో ఇదంతా గందరగోళంలావుంది. అన్నయ్య అన్నిటికీ తల వూపుతున్నాడు. నేనైనా ఎలా వేళ్లవుతానన్న మాట ముందు ఎత్తుకోడం?"

"అరే అవివాహరా, కుండలు వేర్లయినంతమాత్రాన వచ్చిపడేదేముంది? అవన్నీ ఉత్త ఆడంగుల మాటలు. కుండలు వేరుచేసి రెండు రోజులు వేరే తింటారు. మళ్ళీ కలుస్తారు - మళ్ళీ వేళ్లవుతారు — ఈ తతంగం సాగుతుంది. వేళ్లయితే మగాడిలా వేళ్లవాలి. పొలమూ పెరడూ, గొడ్లూ, గోదా, కంచాలూ, ముంతలూ అన్నీ వొంతులు వేసుకోవాలి. అంతేకాని, ఇవాళ కుండలు పట్టుకు వెళ్ళి వేరే ఇంట్లో పెడతావు. రేపు మళ్ళీ తీసుకువెళ్ళి ఆ వంటింటిలోనే కలుపుతావు — ఈ ఆడంగుల మాటలు నాకేమీ నచ్చవు సుమా!"

"మరేం చెయ్యమంటారు దద్దయ్యా, నాకేమీ పాలుపోవడంలేదు. 'ముందు కుండా మండా వేరుచేసుకుందాం. తరవాత పొలం, దొడ్డి, గొడ్డూ గోదా అన్నీ వాటాలువేసి తీసుకుందాం' అంటుందది — ఇద్దరు కూతుళ్ళ పెళ్ళికీ ఎంత ఖర్చయిందో లెక్కవేసి, అందులో సగం మనకి వాళ్లు ఇచ్చుకోవాలి, అంటుంది."

"ఛకడీ, నువ్వు చాలా అదృష్టవంతుడివి. ఇలాంటి ఇల్లాలు ఎవరికి దొరుకుతుందిరా? ఎక్కడ ఏదీ ఎలా చెయ్యాలో, అన్నీ అది నీకు బెత్తాయించేస్తూ వుంది. అలాంటపుడు నువ్వు గందరగోళంగా వుందం టావా? ఇహీహీ! ఇందులో గందరగోళం ఏముందిరా? నలుగురు తగు మనుషుల్ని పిలుచుకువెళ్ళి ఎక్కడి మడిచెక్క అక్కడ చెరిసగం పాలు వేసుకుంటారు. ఇందులో చిక్కేముంది?"

"అవునండి దద్దయ్యగారూ, ఠీక*యిన మాట చెప్పారు. మరి తగుమనుషులూ గిగుమనుషులూ తెలీదు నాకు - మీరు వొక్కరూ వస్తే చాలు. అయితే, వొకటేనండి దద్దయ్యా. వేర్లవటంమాట అన్నయ్యతో ఇవాళదాకా అనలేదు నేను. ఎలా చెప్పమంటారు? ఏమని చెప్పేది?"

"ఛా దద్దమ్మా, ఎన్నిమాటలెవడు నేర్పుతాడు నీకు? అన్న దగ్గిర మాట్లాడకండా మూగినోము పడితే వేర్లెలా అవుతావురా! పోపో. ఎలా ఇంట్లో కలిసివున్నావో అలావుండు" హరిమిశ్ర చిరాకుపడుతూ అన్నాడు.

ఛకడి అన్నాడు. "మా ఇంటిది దద్దయ్యా, ప్రాణం కొరికేస్తూ వుంది - లేదండి దద్దయ్యా, రేపు పొద్దుట మిమ్మల్ని తీసుకు వెళ్ళకపోతే కుదరదు. మీరువచ్చి కూచోకపోతే ఏదీ జరగదు."

"ఛా, వొక నేనువచ్చి కూచుంటే ఏం చెయ్యగలనని? నువ్వు అన్న ఎదట నోరు విప్పితేనా? తగు మనిషినయి వెళ్ళి నేనా మీ యిద్ద రికీ వేర్లు చేసేది? మంచిమాటే చెపుతున్నావు నువ్వు!"

"లేదండీ దద్దయ్యగారూ నేనంత దద్దమ్మనా? ఇవాళ ఇంటి దగ్గర అన్ని మాటలూ తేలిపోవా?"

మిశ్రగారి ఎదటేమో ఇలా చెప్పాడు ఛకడి. కాని ఇంటిదగ్గర ఏమాటా ఎత్తుకోలేదు. అవాళ మధ్యాహ్నం ఛకడి చూశాడు, తాటాకులూ

---

* సరి అయిన

గంటం పట్టుకొని బరజు భాగవతం దశమ స్కంధం చూసిరాస్తు న్నాడు. ముసలి శామప్రధాను చతుర్థ స్కంధందాకా ఎత్తి రాశాడు. తక్కింది రాయమని బరజుకి బెత్తాయించాడు. తండ్రి గుడికట్టాడు, కొడుకు శిఖరం పూర్తి చేస్తున్నాడు. బరజు పరపరా రాసుకుపోతున్నాడు. ఒకటే ధ్యానం. ఛకడి అక్కడికివెళ్ళి తచ్చాడుతున్నాడు. బరజు అతడి దిక్కు మొహమెత్తి చూడలేదు. ఎవ్వరి దిక్కూ అతడి నజరు* లేదు.

ఛకడి పేర్లయేమాట ఎలా చెపుతాడు ? ఒకటి రెండుసార్లు గదిలోకి దూరిపోయాడు. నేత్రమణిని పిలిచి అన్నాడు, "వోలే. అన్నయ్య ఇవాళ వొక్కడే కూచున్నాడు – మంచి సమయం దొరికింది – పేర్లయే సంగతి చెప్పనా ?"

"ఊం, ఎందుకు చెప్పరూ ! ప్రతిదీ అడుగుతా రేమిటండీ ," నేత్రమణి మొహం ఝూడిస్తూ అంది.

ఛకడి మళ్ళీ వీధి గుమ్మానికి వెళ్ళాడు. బరజు అలాగే రాసుకు పోతున్నాడు. ఈలోగా ఛకడి వస్తూపోతూ వుండడం అతడికి తెలియదు. ఛకడి ఈ పక్కా ఆ పక్కా తారాడాడు. మళ్ళీ గదిలోకి వెళ్ళాడు.

"ఒలే, ఏమిటి చెప్పేది చెప్పూ ?"

"పో. ఈ సత్తెప్ప మాటలు నా దగ్గర చెప్పకు." నేత్రమణి ఇంతలేసి గుడ్లు చేసింది.

ఛకడి వీధి గుమ్మానికి వచ్చేశాడు. "ఛీఛీ, ఆడదాని దగ్గిర ఇంత అవమానమా ? ఈసారి ఏమయినా సరే చెప్పేస్తాను."

వీధిగుమ్మానికి వచ్చి ఛకడి పిలిచాడు "అన్నయ్యా !"

బరజు రాత నిలిపేసి, కళ్లెత్తి చూశాడు – ఛకడి నుంచున్ని వున్నాడు.

"ఏంరా, నన్ను పిలిచావా ?"

---

* ఇటూ ఇటూ తిరుగు , దృష్టి

పాపం, భకడి నోరు తొట్రుకుంది." ఊఁ ఊఁ, లేదు, అలా వెళ్ళి వస్తున్నాను."

భకడి అక్కడి నించి వెళ్ళిపోయాడు - అమ్మయ్యా, బతికి పోయాడు.

బిరజు మళ్ళీ రాత మొదలు పెట్టాడు.

భకడి జబర్దస్తీగా పెసలు పట్టుకు వచ్చేశాడు. దేనికీ అన్నతో మాట్లాడవలసిన అవసరం లేకపోయింది. ఇప్పుడు వేళ్ళేమాట ఎలా చెపుతాడు? అదారి సర్తిప్పా, ఆదారి సర్తిప్పా అని అందరూ అనేస్తున్నారు - కాని చేసేవాళ్ళెవరో పద్మను చూద్దాం!

మర్నాడు తెల్లవారు ఝామునే లేచి బిరజు నీళ్ళతోడటానికి వెళ్ళాడు. కార్తీకమాసం అఖరవుతూవుంది - నీళ్లింకి పోయాయి. వర్షాలు లేవు. రైతన్నవాడు ఏం చేస్తాడు? అందుకనే అంటారు, పొట్టలోంచే రోగం, మేఘంలోంచే కరువు!

బిరజుప్రధాను గూడా, పారాపట్టుక వెళ్ళి, సన్నయ్యా జానకితో గూడ వేస్తున్నాడు. చుట్టుపట్ల తక్కిన రైతులు కూడా వేస్తున్నారు. పాటలూ, మాటలూ, నీటిశబ్దం వినిపిస్తున్నాయి. వీళ్ళలో వేగుచుక్క మిలమిలా వెలుగుతూ వుంది. చుట్టుపట్ల పూళ్ళూ, చెట్లూ మెల్లమెల్లగా, మొదట మసకగానూ, తరువాత స్పష్టంగానూ అవుపిస్తున్నాయి. ఉదయం భళ్ళున తెల్లవారుతూ వుంది. కట్టి విడిచిన తెల్లబట్టల్లాగా కొంగలు కొన్ని పచ్చ మైదానంలో వాలి పురుగు లేరుకు తింటున్నాయి. కాకులూ, గోరపిట్టలూ, గెద్దలూ, నత్తగొట్టూ పొలమూ ఆకాశమూ చిల్లలు పట్టిట్టు అరుస్తున్నాయి. తూరుపున ఆకాశం ఇంతింత ఎర్రరంగు పులుము కుంటూ వుంది. దూరంగా కొండమీద తెల్లటి ఉత్తరీయంలా పొగమంచు చుట్టుకుంది.

గూడ వెయ్యడం పూర్తిచేసి, వొక పచ్చగడ్డిమోపు నెత్తిని పెట్టుకుని బరజు పధాను ఇంటికి బయలు దేరాడు. కట్టుకున్న కొల్లాయి గుడ్డ వరిచేనుమీద మంచుబిందువులు తగిలి తడిసిపోయింది. బరజుపధాను ఇంటి గుమ్మంలోకి వచ్చి చూశాడు. వీధి అరుగు మీద హరిమిశ్రా, ఛకడీ ఏదో గుసగుస లాడుతున్నారు. బరజును చూసి మిశ్రాగారన్నారు — "ఏంరా బాబూ, నీకు రాత్రిళ్ళు నిద్రపట్టనట్టుంది! అవును, వొంటిగాడివి! సొంతంగా చేసుకోక పోతే ఏలా?"

బరజు సొమ్ముల పాక దగ్గిర గడ్డిమోపు పడేసివచ్చి అన్నాడు, "ఉదయాన్నే ఎటువచ్చారేమిటి దద్దయ్యా?"

మిశ్రగారు అన్నారు, "ఒరే, ఈ ఛకడి నన్ను కూచోనివ్వకుండా వున్నాడు. వేళ్లవుతాడట! పాటాలు వెయ్యాలట! నేను రాకపోతే వాడికేమీ చేతకాదట! నాకు పనీపాటూ లేదా? రోజూ ఈ వ్యాపారం ఎవడు చేసుకు కూచుంటాడు?"

బరజు బిల బిలా చూస్తూ అన్నాడు. "ఎవరు వేర్లవుతారు దద్దయ్యా? వేళ్లా గిళ్లా ఏమిటి? నాకేమీ తెలీదే"

మిశ్రగారు ఆశ్చర్యపోతూ అన్నారు, "ఆఁ నీకేమీ తెలీదూ? ఈ గుంటడు నాతో అబద్ధం చెప్పాడూ? నెలరోజులయింది — 'దద్దయ్య గారూ, మీరు రావాలి, మేం వేళ్లవుతాం. మీరు కాస్త కూచుని పాటాలు వేసి పెడుదురు కాని' అంటూ ప్రాణం కొరికేస్తున్నాడు. 'నువ్వు కుర్రాడివి, వేర్లవుతానంటా వేమిటిరా?' అన్నాను. నా మాట వింటేనా? కాదండీ దద్దయ్యగారూ' అంటూ పట్టుపట్టి కూచున్నాడు. 'బోలెడంత ఖర్చు — ఇద్దరు కూతుళ్ళకి పెళ్ళి చేశారు — ఏ మాత్రం ఆస్తని! ఇంత బాదరబంది నేను భరించలేను. నా వొంతు నాకు కేటాయించెయ్యమనండి. కూతుళ్ళ పెళ్ళి ఖర్చు జాబితా ఇమ్మనండి. వాళ్ళదారి వాళ్ళది, నాదారి నాది. బురదలో దిగడమెందుకు? కాళ్ళు కడగడమెందుకు?'

అంటాడు. ఏం చెయ్యమంటావురా బాబూ, తెలతెలవారకుండా వచ్చేశాను. ఇప్పుడు వెళ్ళేసరికి ముగ్గులేసి మనుషులు వీధిగుమ్మంలో కూచుని వుంటారు. నాలుగూళ్ళ కేసులు విచారణ చెయ్యాలి. అర్థమైన వాళ్ళ కొంపల్లోని తగువులూ తీర్చాలి. ఈ బెడదలో కిందా మీదా పడుతూ నా సొంత పని ఏదీ కాకుండా వుంది. వరిమళ్ళు ఎండిపోతున్నాయి. ఎక్కడ నీరు పెట్టాలో, ఎక్కడ అక్కరలేదో ఎవరు చూస్తారు? ఎవరు చేస్తారు?

దివ్వె ఎగవేస్తే నూనె చేతికి తగులుతుంది. మిశ్రగారు వూరికే తగాయిదాలు విచారణ చేసి సొంతపని తగలేసుకుంటున్నారా? నోటితో అనేశారు, అంతే. కేసులు విచారణ చెయ్యనీ, తగవులు తీర్చనీ– ఎక్కడా మిశ్రగారి చెయ్యి తడికాకుండాపోదు.

బరజు నవ్వుతూ అన్నాడు. "ఈ పాటి పనికోసం పనీపాటూ మానిపించి మిమ్మల్ని లాక్కువచ్చి కూచోపెట్టాడు! వేర్లవడం, వాటాలు వేసుకోవడం– ఇదొక పెద్ద పనా? మీరు వెళ్ళండి– తెలియని కుర్రాడు వీడు, వీడిమాటమీద–"

"ఆ సంగతి మరి చెప్పకురా బాబూ! ఎంత చెప్పినా విన్నాడా ఏమన్నానా? 'తండ్రి తరవాత తండ్రంతవారు మీరు. మీరు రాకపోతే నేనేమీ చెయ్యలేను' అంటూ వొకటే పాట."

బరజు అన్నాడు. "మంచిదే ఎవరు కాదన్నారు? అలా అని ఈ మాత్రందానికి ఇన్నిపనులు మీవి పాడుచేసి ఇలా లాక్కువచ్చాడు!"

మిశ్రగారు లేచిపోయి. గావంచతో కాళ్ళు దులుపుకుని అన్నారు. "ఆఁ, పిలుచుకు వచ్చాడు. పిలిచినంత మాత్రాన తప్పేముంది? దాని కోసంకాదు కాని– ఏంరా ఛకడీ.– ఏడీ ఎటు వుడాయించాడు? చూశావా, ఇక్కడ వాడిసంగతి మాట్లాడుతున్నాం. వాడెటో వెళ్ళిపోయాడు!"

అన్న రావడం చూసి, ఛకడి ముందే ఎంతసేపయో జారి పోయాడు. అతడి మనస్సు దొంగాడి మనస్సులా వుంది. మిశ్రగారు

లోపల్లోపల ఛకడిమీద కారాలూ మిరియాలూ నూరుతూ ఇంటికి వెళ్ళి పోయారు. ఎంత చెడ్డ గుంటడో చూడండీ. ఊరికే తగుమనిషిని బైట పెట్టేశాడు!

బరజుకి ఇవాళ బాగా తెలిసిపోయింది— ఛకడి వేర్లవడం కోసం పట్టుబడుతున్నాడు. "సరే, నువ్వు ఎలా ఈ ఇల్లు విరిచేసి రెండుముక్కలు చేస్తావో చూస్తాను! బరజు పధాను వున్నంతకాలం ఎంతమాత్రం ఈ సంగతి జరగదు."

ఛకడిని పిలిచి చిరునవ్వు నవ్వుతూ అన్నాడు బరజు, "ఏంరా ఛకడీ. వేర్లు కావడానికి పైనించి ఇంతమంది తగుమనుషుల్ని పిలుస్తున్నా వెందుకురా? మన ఆస్తి పనం పంచుకుంటాం. తగు మనుషులు వచ్చి దాన్నేమయినా అధికం చేస్తారా ఏమిటి? — సరే, వేర్లుకావడానికి ఎందుకింత ఇదవుతున్నావో చెప్పు?" నెలల తరబడి నేత్రమణి ఛకడిని తరిఫీదు చేసింది, నూరిపోసింది. హరిమిశ్రకూడా ఎన్నో విధాల వూదాడు. అంత చేతకానివాడా తాను! ఛకడి బాగా ధైర్యం తెచ్చుకున్నాడు. ధాటీగా అన్నాడు— "వేర్లు కానా మరి! ఇంటిరాబడి ఎక్కణ్ణుంచి ఏం వచ్చినా అంతా మీకిందే ఖర్చవుతూ వుంది. రెండేసి పెళ్ళిళ్ళు, ఇంతమంది మనుషుల ఖర్చు— ఇంత బాదరబందీ నేను భరించలేను."

బరజు నిచ్చెరపోయాడు. ఇప్పటిదాకా అన్న ఎదట తలఎత్తి పిసరంత మాటాడి ఎరగని ఛకడినోట ఇవాళ ఈ మాటలు బైటకి వస్తున్నాయి! కాదు కాదు, వీడు ఛకడి కాడు. ఛకడి వేషంలో ఇంకెవరో నుంచుని మాటాడుతున్నారు.

బరజు అన్నాడు, "మంచిదే, అయితే వేర్లు కావడమే నీ ఉద్దేశమన్నమాట! నా ఉద్దేశమేమిటో తెలుసా? నా ఉద్దేశం వేర్లు కావద్దని. ఈ ఇల్లూ, వాకిలీ, పొలమూ, గొడ్డూగోదా ఏదీ వాటాలు కాకూడదని.

అచ్చా, ఉద్దేశమూ, నా ఉద్దేశమూ రెండూ ఎలా జరుగుతాయి? చెప్తూ చూద్దాం!" బరజు ఛకడికేసి చూసి నవ్వాడు.

ఛకడికి అర్థం కాలేదు; మొహం వేలవేసి అన్నాడు, "నాకీ అడ్డ దిడ్డం మాటలు తెలీవు. అన్నీ సంగోరు * సంగోరు చేసేస్తే తెగి పోతుంది. ఇంత రాద్ధాంత మెందుకని!"

బరజు అన్నాడు, "సంగోరు సంగోరు కాదనే కదూ, నేనంటు న్నది! అన్నీ అలాగే వుంటాయి."

ఛకడి చికాకుపడుతూ అన్నాడు! "చెపుతున్నాను కదూ, నేను కలిసివుండలేను."

"నేను వద్దంటున్నానా ఏమిటి ?- వేర్లుకి వేర్లే అవుదాం, ఆస్తి మాత్రం అలాగే వుంచుదాం – అలా అయితే నీ ఉద్దేశం, నా ఉద్దేశం – ఇద్దరి ఉద్దేశాలూ నెరవేరుతాయి."

"ఇలా అడ్డదిడ్డంగా చెపితే తెలుసుకోలేను. హారా, సున్నాల పెళ్ళిళ్ళ ఖర్చులూ, తక్కిన ఖర్చులూ అన్నీ లెక్కలు చెప్పేసి, అన్నీ సంగోరు సంగోరు చేసెయ్యాలి."

హారా, సున్నాల పెళ్ళి ఖర్చు మాట చెప్పినప్పుడు ఛకడి గొంతుక తడబడింది — అతడు దగ్గాడు.

బరజు నవ్వుతూ అన్నాడు, "కామురా దద్దమ్మా, హారా సున్నాల పెళ్ళి లెక్కలు వేరే ఎవరు చెపుతార్రా ? హారా, సున్నా పెళ్ళాడారు. వాళ్ళ పెళ్ళిళ్ళనాటి ఖర్చు వెచ్చాలు ఇవాళ అన్నదమ్ముల పంపకంలో మనం లెక్క వేసుకు కూచుంటాం. ఇలాంటి బుద్ధిమంతులమా మనం ! ఎందుకూ ? నేను చెపుతున్నాను కదూ, ఆస్తి వాటాలు కావు. ఇంటిలో గోడ లేవదు, మనం వేర్లయిపోదాం — ఈ ఇల్లూ వాకిలీ నీది. పొలమూ పెరడూ,

---

* సగం

పంటా, ఎద్లూ, ఆవులూ, చెట్లూ, చేమలూ — అన్నీ నీవే. నాకెందుకు చెప్పు. మరి వొక్క కూతురుంది; మోతీ — ఎక్కడో ఒకదగ్గర ముడి పెడ్తేస్తే సరిపోతుంది. దామ మగ కుర్రాడు — ఎక్కడయినా, కూలి చేసుకుని వాడి పొట్ట వాడు పోసుకుంటాడు. మేం ఇద్దరం మనుషులం బతకలేమా ?" బరజు ఛకడి మొహం చూసి నవ్వాడు.

ఛకడి నోటమాట పెగలలేదు. అన్నకేసి బలబలాచూస్తూ గుటకలు మింగుతున్నాడతడు. ఎన్నాళ్ళయో బరజుని తాను ఎరగనే ఎరగనట్టు నుంచున్నాడు. అతడి నోట అప్రయత్నంగా వచ్చేసింది—"ఆఁ, ఏమిటి ?"

బరజు అన్నాడు, "అర్థంకాలేదూ ? ఆస్తి వంతులు రాసి – మనం వేర్లయిపోదాం. అంతా నీదే. ఇల్లూ, వాకిలీ, పొలమూ, పెరడూ, గొడ్డూ గోదా, ఎన్ని వున్నాయో అన్నీ నీవే. నేను పెళ్లాం పిల్లల్ని తీసుకుని ఇంట్లోంచి వెళ్ళిపోతాను, తెలిసిందా ?" బరజు నవ్వాడు.

ఛకడి నవ్వలేదు, ఏడవనూ లేదు. బలబలా చూస్తూ నుంచున్నాడు. బరజుకేసి చూస్తున్నాడో, మరెటు చూస్తున్నాడో తనకే తెలియదు. ఒక సారి "ఊహూఁ" అనేసి మాత్రం వూరుకున్నాడు.

బరజు అన్నాడు "తెలిసిందా ? - రేపు మోతీనీ, దామానీ, వాళ్ళ అమ్మనీ తీసుకుని ఇంట్లోంచి నేను వెళ్ళిపోతాను. ఆస్తి పాస్తులన్నీ నీవే."

ఛకడి మరేమీ అనలేదు. మరోసారి "ఉహూఁ" అనే అన్నాడు.

ఈ "ఊహూఁ" అతడి నోటిలోంచి కాదు, హృదయంలోంచి వచ్చింది. ఈ "ఊహూఁ"లో నేత్రమణి తాలూకు ఐబద్ధిస్తీ కలవలేదు. మిశ్రగారి చాకచక్యం చేరలేదు. మచ్చా, మరకా లేని నిర్మలమైన "ఊహూఁ" అది.

ఇంట్లోకి వెళ్ళి ముసి ముసి నవ్వులు నవ్వుతూ భార్యతో అన్నాడు బరజు, "ఇదిగో, అవాళ అంత ప్రతిజ్ఞ చేసి చెప్పావు. ఇవాళ నిజంగా

దాని అవసరం వచ్చింది. ఇంట్లోంచి వెళ్ళిపోవాలి మనం ఆస్తీ, ఇల్లూ, వాకిలీ అన్నీ వొదిలిపెట్టెయ్యాలి. ఏం, చెయ్యగలవా ?"

పెద్దకోడలు మొదట నమ్మలేకపోయింది. అంది, "ఆఁ, అబద్ధం."

బరజు అన్నాడు, "నీతో అబద్ధమాడతానా ?"

బరజు ఎక్కడ అబద్ధమాడాడని, భార్యదగ్గర అబద్ధమాడతాడు ?

అయినా పెద్దకోడలికి అదేదో అసందర్భంలా అనిపించింది. అంచేత ఎగతాళిచేస్తూ అంది, "ఇల్లు వొదిలేసి ఎలా వెళ్ళిపోతామండీ ?— ఎక్కడ వుంటాం ?"

బరజు నవ్వుతూ అన్నాడు, "ఎక్కడ వుంటామా ? ఎక్కడ వుండేదీ ఎవరయినా ముందే తేకీచేసి పెట్టుకుంటారా ?"

"మరి, తేకీలేదూ తికాణాలేదు. దెయ్యం పట్టినట్టు ఇంట్లోంచి వెళ్ళిపోతారా ?— ఇదేమిటండీ ?"

బరజు నవ్వుతూ అన్నాడు. "రేపు ఉదయమే వెళ్ళిపోతాను. నువ్వు వచ్చేట్టువుంటే ఇవాళనుంచీ సిద్ధపడు. తెలిసిందా ?"

పెద్దకోడలు ఇక చేసేదేముంది ? "సరే, కానివ్వండి; ఏమిటేమిటి కూడా పట్టుకు వెళ్ళాలో చెప్పండి. మూటకట్టి పెడతాను."

"చిన్న పిల్లిపిల్లకానీ ఒల్లగవ్వకానీ, వీల్లేదు. ఊరికే అవసరమయిన పాతగుడ్డలు వొకటో రెండో మూటకట్టు. అంతే."

"మరి కంచాలూ గిన్నెలో ?"

"ఏమీ వద్దు. మరొకమాట, ఇంటి కబురు పట్టుకు వెళ్ళి వీధీ వాడా దండోరా వెయ్యకు."

భార్య అంది, "ఆఁ, నాకు పట్టింది బాధ !"

ఛకడి వెళ్ళి అన్ని సంగతులూ నేత్రమణితో చెప్పాడు. "అమ్మయ్యా. పిసరంత మాటకి కలకత్తా పోవయ్యా ! ఇంతమాత్రానికే అందరూ అడిలిపోతారా ఏమిటి? ఏం జడిపిస్తున్నాడూ ? ఇల్లూ వాకిలీ

వాటిలేసి ఎంతమందో ఇలా వెళ్ళిపోయారు! మరి, ఇతగాడు వెళ్ళిపోతాడు? మంద మందంతా పడి ఎక్కడ వున్నదీ నొల్లుకు తినేస్తున్నారు. సర్వనాశనం చేస్తున్నారు. తిరిగి ఎవడికి భయపెడుతున్నారట! వెళ్ళిపో! నువ్వు పోతే నీ వెనకాల అందరూ వెంటబడతారా ఏమిటి? ఓయమ్మో! ఎంత భయపెడుతున్నాడే!"

నేత్రమణి చకడి మీద విసుక్కుంటూ అంది. "ఆడారి మొహమూ నువ్వూనూ! దొంగలా వెళ్ళిపోవచ్చా * వెంముకట! అనలేకపోయావూ, వెళ్ళితే వెళ్ళు అని! ఈ మాటకే భయపడిపోతారా? మగాడిలాగ జవాబు చెప్పడం మానేసి, దొంగలా వెళ్ళిపోవచ్చాడు!– ఆడారి సత్తెప్పా, నువ్వే చెడగొడుతున్నావు!"

"అదేమిటే అలా అంటావూ?– వుండు. ఉదయం కదూ ఎటో వెళతారు! ఎలా వెళతాడో వెళ్ళనీ– మనం గమ్మున వూరుకుంటే సరి."

నేత్రమణి అంది, "ఆఁ, అంతే!"

పక్కగదిలో బరజుకి చిన్నకోడలు మాట వినిపించింది "అనలేకపోయావూ, వెళితే వెళ్ళు" అని.

---

* పచ్చేళావెంముక

# 12

ప్రతీదినం లాగే మర్నాడు తెల్లవారింది. తెల్లవారు జామున ఎంతో చీకటి వుందనగా బరజు లేచాడు, ఛకడిని లేపాడు; ఇల్లూ వాకిలీ, పొలమూ పెరడూ, గొడ్డూ గోదా– ఎక్కడ ఉలవల విత్తనాలున్నాయో– ఎక్కడ వరి విత్తనాలున్నాయో, అన్నీ విడమరచి చెప్పాడు. ఏమంత ఆస్తని! గంటలో తెమిలిపోయింది.

బరజు అన్నాడు, "ఏం, అన్నీ తెలుసుకున్నావా? ఇక వేస్ల కావడమేనా– ఏమిటి?"

ఛకడి అన్నాడు: "ఊఁ– ఎందుకూ, సగం సగం పంచేసుకుంటే–"

"లేదురా ఛకడీ, నేనేమీ విచారిస్తున్నా ననుకుంటున్నావా ఏమిటి? ఈ ఆస్తి వాటాలు వెయ్యవద్దని అయ్య చెప్పిపోయాడు కదూ,"

"కానీండి, ఏం చేస్తారో చెయ్యండి. దీనికి ఎవరేం చేస్తారు?" ఛకడికి చికాపు వేసింది?

బరజు గదిలోకి వెళ్ళి చూశాడు, భార్య పిడతలూ,గిడతలూ బుట్టలూ గిట్టలూ ఎన్నో అన్ని మూట కడుతూ వుకది.

బరజు అడిగాడు. "ఇదేమిటి ఈ కార్ఖానా?"

"కూడా పట్టుకు వెళ్ళవద్దూ?"

"ఇవన్నీ కట్టమని ఎవడు చెప్పాడు? కంచాలూ, గించాలూ ఏవీ పట్టుకోవద్దని చెప్పాను కదూ! పిడతలూ గిడతలు ఎందుకు మూట కడుతున్నావు చెప్పూ?"

భార్య బుంగలా మొహం పెట్టుకుని అంది, "మరేం, నేను కొని పెట్టుకున్నానివి"

"తీసెయ్యి, తీసెయ్యి—కొని పెట్టుకున్నాను! అన్నీ తీసిపెట్టెయ్యి. బట్టలూ గిట్టలూ ఏవి మూటగడతావో చిన్నకోడలికి చూపించి మరీ కట్టు."

పెద్దకోడలు భర్త మొహం చూసింది. భర్త నవ్వాడు. ఒకరి నొకరు అర్థం చేసుకున్నారు. మాటా లేదు, మంతీ లేదు.

పెద్దకోడలు ఎవరితోనూ ఏమీ చెప్పలేదు. బరజు ఇల్లు వొదిలి వెళ్ళిపోతున్నాడని బస్తీలో గుప్పుమంది. ఊరంతా పాకిపోయింది. శారదమ్మా, బోడిపండా ఆవిడా, నెత్తరమ్మా, శోభమ్మా—ఎంతో అంతమంది అమ్మలక్కలు వచ్చి పధానుగారి ఇంట్లో మూగిపోయారు. ఒకరి చేతిలో పలుదోముపుల్ల వుంటే, వొకరి చేతిలో పసుపుముద్ద. ఒకరి చేతిలో నూనె గిన్నె వుంటే, వొకరి చేతిలో అరిటాకు చుట్టిన సగం కాలిన పొగాకుచుట్ట. "అవ్వ, ఇదేమిటోవిడ! ఇల్లు వొదిలేసి పారిపోతారా? దొంగలికి భయపడి కుండ పెంకులో తిన్నట్టుంది. ఎందుకని! అత్తెసం చేసుకుంటే ఏం పుట్టి మునిగిపోయింది! అన్నదమ్ముల్లిద్దరికీ పడలేదు, వొక్క దగ్గిర వుండకపోతే పోయింది—ఇలా లోకంమీద వుందా లేదా? అందరిళ్ళల్లోనూ వున్నదే ఇది—మరి ఈ సింగినాద మెక్కడా చూడలేదు. అన్నదమ్ముల్లో వొకడు ఇల్లూ వాకిలీ వొదిలేసి వెళ్ళిపోతాడా?"

వీధిగుమ్మంలో జటూ, విధియా, ధరమా, మగుడోయా — ఎంత మందో వచ్చి మూగిపోయారు. విధియా గావంచా చెంగుతో కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు, "బరజుభాయి ఎంతనుకుంటే అంతే, అది మార్చడం బ్రహ్మతరంకాదు. అతగాడు రుక్కుణాదళం, వెనక్కి తిరగడముండదు."

ధరుముదాసు అన్నాడు. "ఆఁ, బరజుభాయి మనల్ని వొదిలేసి ఎల్లిపోతాదూ! అంత మీద మీద పడుందా ఏటి?"

జదు నవ్వుతూ అన్నాడు. "మరేంచేస్తావు ధరమా, చెప్పరా!"

"ఏటిసేస్తానా? ఏం ఆయనెటెల్తె నానూ అటే ఎల్తాను. అతనే ఇంత ఆస్తి వొదిలేసి ఎల్లిపోనాడు. నా జమీందారీ ఏటన్నా సెడిపోతాదా ఏటి!"

మగా అన్నాడు. "చెడిపోవడం మాటంటున్నావేమిటి ధరమా, ఈ వూళ్ళోవుంటే మరి లాభమేమిటి చెప్పు? ముసిలి పధాసు కళ్ళు మూసేశాడు. బరజుభాయి ఇల్లు వొదిలీ; వూరు వొదిలీ వెళ్ళిపోతున్నాడు. మనమే ఇక్కడ వుట్టికట్టుకు ప్రారేగుతామా? మనం వుండమూ వుస్తదే ఇక."

ధరుముదాసు అన్నాడు. "ఆఁ, ప్రారికే అనేస్తే అయిపోతాదా? మనం ఇంతమందిమి వుండగా, ఆరు వొక్కరూ ఇల్లిడిసి పెట్టి ఎల్లిపోతారా? మనం కూకుదుండి సూత్తా వూరుకుంటామా?"

జదు దరెయి వంక నవ్వు నవ్వుతూఅన్నాడు. "నువ్వు వూడజొకి సేస్తావు! ఏంరా ధరమా చెప్పవేం?"

"ఎందుకూ, మీరు ముస్గిరూ ఇక్కడే కూకోండి. మిట్టకొంయితో ఇంటి ఆస్తంతా ఆయనగారికి పంచిపెట్టేస్తాను. ఆఁ, ధకడిపదాను మన మాట తప్పిపోతాడా ఏటి? — వొక్క మాటంటే శాన — సూత్తుండండి. సంగోరువాటా ఇచ్చేసేదాకా ప్రాపిరాడదు. ఆఁ— మరెవరో అనుకున్నారా ఏటి— ఈడు ధరుముదాసు!"

నిధియా అన్నాడు. "ఒరే ప్రారికే ఎందుకురా ఈ ప్రాకదంపు! అతడు వీర్లు వల్లకాదని చెప్పి, ఖుషిగా* ఇల్లూ వాకిలీ వొదిలేసి వెళుతున్నాడు. నువ్వు వాటాలు వేసి ఇంత పొడిచేస్తావు!"

---

* సంతోషంగా

"ఆఁ, వూరికే తేరగా పడుందా ఏటి? ఇల్లూ వాకిలీ వొదిలేసి ఎల్లిపోతాడు—మనమంతా ఇక్కడ దెయ్యాలిమా కూకున్నాం!"

"గోపాలపురం మొండి అని వీళ్ళనే అంటారు."

"ఈన మా తగుమనిసి!"

నిధియా ఏడో చెప్పబోయాడు. జరుదశెయి అడ్డువచ్చాడు—"ఊరుకో, వృత్తనే ఎందుకీ రభస!"

బరజు చూశాడు. ఊరంతా సంతలా వుంది. ఏది ఏమయినా సరే—అతడు వెళ్ళితీరాలి. తమ్ముడి నోట వేళ్లయే మాట విన్నాక, హేరా. సున్నాల పెళ్ళి ఖర్చులు లెక్క చెప్పాలన్నాక—వెనకటి మాటలు. పెసలు మట్టించడం, బెల్లం అమ్మేయడం – వొక్కొక్కటే అన్నీ జ్ఞాపకం వచ్చాయి. ఊఁహూఁ, మరి వొసగదు.

ఇంటిమీద మమత మధ్య మధ్య పీకుతూ వుండేది. కాని వేళ్ల కావడానికి ఒకడి ఎన్నాళ్ళమో తయారవుతున్నాడని తెలియగానే తాను మనసులో అనుకున్నాడు. "ఊఁహూఁ, మరి లాభంలేదు."

చిన్నకోడలు అన్నమాట జ్ఞాపకం వచ్చింది, "అనలేకపోయావా వెళితే వెళ్ళు అని—ఊఁహూఁ, ఈ కొంపలో మరి ఉండకూడదు."

బరజు వెళ్లి భార్యతో అన్నాడు, "లే, ఇక బయల్దేరు."

ఊరిలో ఆడంగులు పెద్దకోడల్ని వంద ప్రశ్నలు వేసి ఊపిరాడనివ్వడం లేదు. "పెద్దకోడలా, ఇదేమిటమ్మా. మొగుడుచాటు ఇల్లాలివి. వీధీవాడా ఎలా తిరుగుతావమ్మా! ఏ ఊళ్లోవిన్నాం చెప్పూ. ఇలాగ? ఏం, బరజుతో చెప్పలేక పోయావా, వొద్దని?"

పెద్దకోడలు నవ్వింది. "నేను వొద్దంటే ఎవరైనా వింటేనా?"

శోభమ్మక్క అంది "ఆడబిడ్డవి నువ్వు, నాలుగు దిక్కులా ఎలా తిరుగుతావేమిటి? రైతింటి కూతురువి. పంగల కులమా, మాదిగ కులమా!"

శారదమ్మ అంది, "ఒలే సుబ్బీ, ఎందుకా పొందని మాట అంటున్నావు నువ్వు. పెళ్ళికూతురు సంతకి వెళుతుంది, దారిలో లెమ్మన్నా రట! ఈ రోజుల్లో గొప్ప గొప్పవాళ్ళ ఇంటిపడుచులు వీధుల్లో తిరుగుతున్నారు. మరి పెద్దకోడలు బైటికి వెళితే పాపం పట్టుకుంటుంది!"

చిన్నకోడలూ బోడిపండా ఆవిడా ఛకడి పడకగదిలో కూచుని గుసగుసలూ, నవ్వులూ, కేరింతలూ సాగిస్తున్నారు.

"ఊఁ, మరి ఆలస్యం చెయ్యకు," అంటూ, బట్టలమూట చంకని పెట్టుకుని, తలకి గావంచా చుట్టుకుని, మూడు మూళ్ళ చేపాటి కర్ర చేతో పట్టుకుని వీధిగుమ్మం దాటి వచ్చేశాడు బరజు. అతడి వెనక పెద్దకోడలు అద్దాల్లో పిల్లాణ్ణి చంకని ఎత్తుకుని- మోతి చెయ్యి పట్టుకుని. వారి ఆడంగులతో నవ్వుతూ, మాట్లాడుతూ బైటికి వచ్చేసింది. ఇం నిండా పెట్టే బేడా, పండా మండా, కాయగూరమడీ, మిరపతో చెట్టూ చేమా—దేనినీ చూసింది కాదామె. దేనిమీదా మమత నిలి. కాదు—ఆడది, ధన్యురాలామె!

సుగా, నెతరా, చందరా, ధరమా—యావన్మందీ వాకిట్లోపై బరజుని మళ్ళించడానికి పూనుకున్నారు. జటు అన్నాడు. "ఉత్తమాటలు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడూ-ఎవ్వరూ మళ్ళించలేరు గాక మళ్ళించలేరు. కష్టకర్ర విరిగిపోతుంది కాని వొంగదు. బరజు భాయి ఏ పనిలో వేలుపెట్టాడో ఆ పని నెరవేరినట్టు భగవంతుడు అనుగ్రహించని. ఇంతే మీకు కోరవలసింది. అంతేకాని, జరగని పనికి ఎందుకు పెనుగులాడతారు"

"అడవిలో అజగరంలాగ శరీరం కర్మఫలమనుభవిస్తుంది. ఈ శరీరం కర్మఫల మనుభవించక తీరదు." అయితే బరజుభాయి ఈ శరీరం లక్ష్యపెడతాడా ఏమన్నా?—"

నిధియా అందుకన్నాడు. ఒక తికాణాస్థలమని వుంటేనా, ఇదిగో ఫలానాచోటికి వెళతాడు అని అనుకోడానికి?"

జదు అన్నాడు, "లోకమంతా బిరజుభాయి ఇల్లే. అతడికోసం, విచారిమెందుకంటా! సొంతకొంప విడిచిపెట్టెయ్యగలవాడికి, ఇక లోటేమేముంటుంది? తిండీ తిప్పల చింత ఏముంటుంది?

"ఆహారంలో మంచీ చెడ్డా లేదు.

ఎక్కడ ఏది దొరికితే అదే మంచిది!"

బిరజుభాయి నవ్వుమొహంతో చేపాటికర్ర చేతో పట్టుకుని బైటికి వచ్చేశాడు. వెనక తన ఇల్లాలు మోతీ చెయ్యిపట్టుకుని, చిన్నకొడుకు దామాని ఎత్తుకుని వెనకకి మెల్లిమెల్లిగా చూస్తూ, ఊరి అమ్మలక్కలకేసి నవ్వుతూ, తలవూపుతూ నడిచి పోతూవుంది.

బిరజు జదునిచూసి అన్నాడు. "జదుభాయీ, ఈవూరి సంగతి నీమీద పడింది."

జదుభాయి నవ్వుతూ అన్నాడు, "ఒంటిగాణ్ణి అంతా భరించ గలనా?"

"మళ్ళీ అదేమాటా? — వొంటిగాడివా నువ్వు? ఇదిగో, నేను వొంటిగాణ్ణా?"

జదుదళెయికి జ్ఞాపకం వచ్చింది.

"చేసేవాణ్ణి నేనేనోయి చేయించేవాణ్ణి నేనేనోయి నన్నొకణ్ణి తప్పించే స్తే వేరేగతి లేనేలేదోయి."

కాదు, జదు వొంటిగాడు కాదు — మరొకడు తనదగ్గిర వున్నాడు - బిరజు ఇవాళ వొంటరిగా ఇంటినుండి బైలుదేరలేదు. మరొకడు అతణ్ణి అంటిపెట్టుకు నడుస్తున్నాడు — అతడికి పరవా ఏమిటి ? భయం దేనికి ?

జదు కళ్ళు తుడుచుకున్నాడు.

ధరమా, నిధియా, మసా, నెతరా — అందరితోనూ బరజు చెప్పాడు. "సోదరులారా, వుండండి. విచారం దేనికి? అన్నిటికీ ఆ వొక్కడే వున్నాడు. నేను ఎక్కడవున్నా మీ సంగతి ముందు తలుస్తాను, ముందు కనుక్కుంటాను."

బరజు మొహంచూసి ఇవాళ యావన్మందికీ భక్తిభావం కలిగింది. ఎంతమందో ఏమేమో అనాలనుకున్నారు. ఎన్నో ఊహల్లుకు కూడు న్నారు. కాని ఎవ్వరినోటా మాటపెగల్లేదు — గొర్రెలమందలాగ అంతమందీ వెనక నడుచుకు వెళ్ళారు.

హారాతల్లి అయినింటి కోడలు! అంతమంది వూళ్లో మగాళ్ళు! ఏంచేస్తుంది? బాగా ముసుగు లాగేసుకుని, చంకలో పిల్లాణ్ణి పెట్టుకుని, పైటచెంగు కొసా, కూతురిచెయ్యీ కలిపి పట్టుకుని నడుస్తావుంది. ఊరికి కొత్తగావచ్చిన కోడళ్లు సగం గుమ్మాలుతెరిచి, తలుపుల చాటునుంచి తొంగి తొంగి బలబలా చూస్తున్నారు. చిన్నకుర్రాళ్ళూ, అమ్మాయిలూ గడపలమీద మూగి, మోతీనీ, దామూనీ కన్నుగీటి సైగ చేస్తున్నారు. జబ్బుతోనూ, పస్తుతోనూ కాళ్లూచేతులూ ఈనెపుల్లల్లా వున్న ముసిలిముఢా నొకడు అరుగుమీద కూచుని అంటున్నాడు. "ఒరే, ఏమిటిరా! — ఈ వూరిలోంచి ధర్మం లేచిపోయిందా ఏమిటిరా!"

బరజుపధాను వూరిలో పెద్దపెద్ద వాళ్ళని చూసి, వొక్కొక్కర్ని నమస్కారంచేసి, ఎప్పటిలాగ తలవొంచుకు నడిచిపోతున్నాడు. దేనికీ పరవాలేనట్టు, ఏదో ఎక్కడో బంగారం ముద్ద దొరికినట్టు, ఇవాళే కోటీశ్వరుడయిపోతున్నట్టు పరిగెడుతున్నాడు!

ఊరి సరిహద్దుదగ్గిర అందరినీ మళ్ళించి, నవ్వుతూ అందరి వీపులూ తట్టి, బరజుపధాను నడిచిపోతున్నాడు. పొలాల్లో వొకడు నీళ్ళు తోడుతూవుంటే, వొకడు కలుపు తీస్తున్నాడు, వొకడు గడ్డి కోస్తున్నాడు — తుకిడీకి తుకిడీ నల్లనల్లటి జంతువులు లేచి పరుగెత్తాయి — వొకడు తల

వంచి మొక్కాడు. వొకడు చేతులు జోడించాడు. వొకడు కళ్ళుతుడుచుకున్నాడు. వొకడు ముక్కుతుడుచుకుని టపీమని నిలబడ్డాడు. బరజు వొకరికి నమస్కారం చేశాడు. ఒకణ్ణి దీవించాడు అందరితోనూ నవ్వుతూ మాట్లాడాడు.

బరజు పధాను మూడుమూళ్ళ కొక అంగవేస్తూ నడుస్తున్నాడు; భార్య వెనకనించి పిలిచింది. "మీరు గబగబా నడిస్తే మోతీ నడవ లేకుండా వుంది."

బరజు వెనక్కి చూశాడు. నవ్వుతూ అన్నాడు. "నీమాట చెప్పు, మోతీ మీద ఎందుకు నింద మోపుతున్నావు? — సరే, వచ్చినప్పుడు చిన్నకోడలుతో చెప్పివచ్చావు కదూ! ఏడీ ఛకడి ఎక్కడా కనపడలేదు నాకు!"

"ఊఁ, చిన్నకోడలుతో చెప్పాను, కాని నా మొహంకేసి చూడ లేదామె. మాట్లాడలేదు. మరి నేనేం చేసేది?"

వెనకనించి ఎవరో వగర్చుకుంటూ పరుగెత్తుకు వస్తున్నట్టు అనిపించింది బరజుకి. వెనకతిరిగి చూశాడతడు.

"ఏంరా గౌరా, నువ్వెక్కడికిరా?"

హరిపురం గౌరాంగశేఠ బరజుపధానుకి నచ్చిన స్నేహితుడు. బరజుభాయి అంటే అతడు ప్రాణం పెడతాడు. తగువులూ, జగడాలూ, మంచీచెడ్డా ఏదయినాసరే, బరజుభాయిని పిలవందే వొదిలేవాడు కాడు. వారం పది దినాలకొకసారి బరజుభాయి కొకదండం పారేసి వెళితేకాని అతడి మనస్సు కుదుటపడేదికాదు. వచ్చేటప్పుడు పుంజెడు వంగపిందెలో, రెండు ముళ్ళ దోసకాయలో పట్టుకొచ్చేవాడు. బరజుభాయి దగ్గిరకూచుని వొక గంట మాటామంతీ ఆడేవాడు. తరవాత ఇంటికి వెళ్లేవాడు.

గౌరాంగ అన్నాడు "మీఇంటి దగ్గరనుంచే తిన్నగా* వస్తున్నాను."

గౌరాంగుడి కళ్ళు రెండూ బాగా వాచి ఎర్రగా వున్నాయి. మాటలు బరువుగా వస్తున్నాయి. మాట్లాడలేక పోతున్నాడు. నోరు తొట్రుపడుతూ వుంది.

"బరజుభాయి, నాదొకమాట మన్నించాలి."

బరజు గౌరంగకేసి చూసి అన్నాడు. "ఏమిటామాట ?"

"మన్నిస్తానంటే చెపుతాను."

"అరే. ఏమిటో చెప్పవేం?"

"ఊహూఁ, నువ్వు ముందు చెప్పు, మన్నిస్తావా?"

బరజు తత్వం గౌరాకి బాగా తెలుసు. మొదటే అతణ్ణి వొప్పించక పోతే నెగ్గడం కష్టం. ఒకసారి అతడు 'ఊఁ' అనేస్తే తరవాత పరవా లేదు. గౌరా చిన్న పిల్లాడిలాగ మారాము చేశాడు. "ఊహూఁ, నువ్వు ముందు చెప్పు, మన్నిస్తావుకదా!

బరజు చాలలేకపోయాడు. చివరికి అన్నాడు. "అరే. నేనేం హరిశ్చంద్ర మహారాజుని కనుకనా, ఏదంటే అది చెయ్యడానికి ? సరే, ఏమిటో చెప్పు — చేస్తాను."

గౌరా ఖుసీ అయిపోయి అన్నాడు. — 'మా ఇంట్లో ముందు వొక నాలుగురోజులు మీరు వుండాలి. బరజుభాయి, తరవాత నీ ఇష్టం ఎటయినా వెళుదురుకాని. వొక నాలుగు రోజులు — బరజుభాయి, నాలుగు రోజులికి వొక పూట దాటదు."

బరజు అన్నాడు. "గౌరా, నేనొకమాట చెపుతాను—"

"నేను మరేమాటా వినను — నువ్వు మాట ఇచ్చావు. మన్నిస్తే మన్నించు, మానేస్తే మానెయ్యి."

---

* సరాసరి.

గౌరా చిన్నపిల్లాడిమల్లే వెక్కి వెక్కి ఏడ్చాడు. మరి మాట్లాడలేక పోయాడు.

బిరజు చూశాడు. లాభంలేదిక, భార్యతో అన్నాడు. "పద. ఇదిగో ఈదారే వాళ్ళవూరికి వెళ్ళాలి — వెళ్ళకపోతే తప్పదు."

భకడి అన్న దగ్గిర ఆస్తిపాస్తులు విన్నాక, ఉదయాన్నే చీకటితో నాగపురం సంతకి వెళ్ళిపోయాడు. ఆఁ నిజంగా ఆస్తి పాస్తులు వొదిలేసి వెళ్ళిపోతారూ! నేత్రమణి చెప్పింది, హరిమిశ్ర చెప్పారు అబ్బే. ఎవరయినా ఇలా వెళ్ళిపోతారా? నిజానికి వొక అన్నదమ్ముడు ఇల్లు వొదిలి వెళ్ళిపోవడం ఎక్కడయినా వుందా! భకడి ఎంతో బుర్ర చించుకున్నాడు. లేకేం, లోకంలో ఇలాకూడా వుంది. రాములవారు రాజు కాకుండా రాజ్యం వొదిలి వెళ్ళిపోయారు. భరతుడికి రాజ్యమిచ్చేశారు. నిజమే. కాని ఆ కాలం సంగతివేరు. తమ్ముడిగొంతుక అన్న కోసేస్తున్నాడిప్పుడు. ఇదుగో నిన్నగాక మొన్న. అంతపెద్ద జమీందారు. పిసరంత ఆస్తి కోసం అన్నదమ్ముణ్ణి భార్యా పిల్లలు యావన్మందినీ కలిసి ఒక్కరాత్రిలో నరికి పారేశాడు. ఈ రోజుల్లో ఏ అన్న తమ్ముడికోసం ఆస్తిపాస్తులు వొదిలేసి వెళ్ళిపోతాడు. నేత్రమణి చెప్పినట్టు అంతా వూరికే బెదిరించడం కాని!

ఐతే అన్న అంటే ఎలాటిమనిషో భకడి ఇవాళదాకా బాగా తెలుసుకోలేకపోయాడు. "తిక్కమనిషి– ఏమో ఏంచేస్తాడో!"

భకడికి దినుసు ఖరీదు చెయ్యడం మీద మనసులేదు– బుర్రలో ఇదే ఆలోచన?

ఉచ్ఛవా బారికి వచ్చినంతలో చెప్పాడు. "బిరజు ఇల్లు వొదిలేసి పెళ్ళాం పిల్లలతో వెళ్ళిపోయాడు."

వినడంతోనే ఛకడి గతుక్కుమనిపోయాడు. నిజంగా అన్నీ వొదిలేసి వెళ్ళిపోయాడూ? ఏమిటీ?– మరి రాము? వదినె ఎలా వెళ్ళింది? మోతీ, దాము ఎలా వెళ్ళారు.

ఛకడి అడిగాడు. "కూడా ఎవరు వెళ్ళారు? సామనులూ అవీ ఎవరు పట్టుకెళ్ళారు?

"ఆఁ సుట్టాలింటి కెళ్తున్నారా ఏటి? మొగుడు ముందు నడుస్తున్నాడు, అలి దమ్మాని సంక నేసుకుంది. మోతీ సెయ్యి పట్టుకుంది, ఎన కాల నడుసుకు పోతుంది– సిగ్గులేని మొగానికి పయిగా నవ్వుతుంది. ఇలాటి దెక్కడన్నా ఇన్నామా కన్నామా?"

"ఎంతదూరం వెళ్ళివుంటారు? ఏ తట్టు వెళ్ళారు? కటకం దిక్కు వెళ్ళారా?"

"ఆఁ ఇదేటి పరుగుచ్చుకెళ్లి మళ్ళించుకొస్తావా ఏటి? ఎంత మందో నెత్తి గొట్టుకున్నారు. లాభం లేకపోనాది–"

"కాని ఇలా ఎవరయినా వెళ్ళిపోతారా?"

"అదేమరి, వందమంది ఎదట సొంత అన్నదమ్ముడు పారిపోతున్నాడు, మళ్లి అడుగుతావేటి?

"అవును, వెళ్ళిపోయాడు–కాని మళ్ళీ రాడా?"

"సొంత దమ్ముడివి కదా, నీకు తెలీకపోతే పరాయి ముండావోణ్ణి నాకేటి తెలుస్తాది?"

ఉచ్ఛవాజారికి సంతలో సామాను కొనడానికి బయల్దేరాడు: ఛకడి పిలిచాడు, "ఉచ్ఛవా, నిలబడు, ఎటు వెళ్ళిపోతున్నావు? చూడూ, అన్నయ్య వెళ్ళినప్పుడు ఏమయినా చెప్పాడా?"

ఉచ్ఛవా చిరాకుపడుతూ అన్నాడు, "నాకేమయినా పనుందా, ఇక్కడ వాగుతూ కూకుండీదా?"

ఛకడి నెమ్మదిగా అన్నాడు. "ఉచ్చవా కొంచెం ఆగుదూ,---చెప్పు అన్నయ్య ఏమిటన్నాడు ? నా విషయమేమన్నా చెప్పాడా?"

"ఎవడికి ఏపారం లేదని వూరికే ఈమాటలింటూ కూకుం టాఁయ్యా ! సంత అయిపోతంది, ఎన్నో దినుసులు కొనాల నాసు--"

ఉచ్చావా బయలుదేరాడు.

ఛకడి వెనకనుంచి మళ్ళీ పిలిచాడు. "ఉచ్చవా, ఉచ్చవా---నీ కొడుకు తోడు. చెప్పేసి వెళ్ళు."

ఉచ్చవా వెనుకకి చూశాడు. "ఎలాటి మనిసివయ్యా. నాను ఇన లేదు మొర్రో అంటేని ! కొడుకు తోడు. అయ్యతోడు రోకలి మింగు"

ఛకడి నిరాశతో ఇంటికి వచ్చేశాడు. దారిలోనూ, ఊరిలోనూ ఎందరో ఎన్నో రకాల ప్రశ్నలు వేశారు. ఎన్నో అడిగారు. మిశ్రగారి మాట జ్ఞాకం వచ్చింది. "తక్కువరకం మనుషులు ఎన్నో అంటారు. ఎన్నో చేస్తారు-- వాళ్ళెవరన్నా ఇస్తారా, చస్తారా?"

ఛకడి వీధిగుమ్మానికి వచ్చి చూశాడు. ఇల్లంతా ఇవాళ నిశ్శబ్దంగా వుంది. కొబ్బరి చిప్పల్లో బుగ్గి పోసుకుని దామూ, మోతీ ఆడుకోవటం లేదు. అన్నయ్య వీధరుగుమీద కూచుని భాగవతం రాయటం కాని, సులక పేనడం కాని లేదు ! ఛకడి ఇంట్లోకి వెళ్ళాడు. ఇల్లుమీద పడి పోతుందా అన్నట్టుంది. చటీ చప్పుడూ లేదు.

నేత్రమణి ఇల్లు సద్దడంలో నిమగ్నురాలై వుంది-- ఈ ఇంటంత టికీ ఆమె ఇల్లాలిప్పుడు. ఆమెని వొకమాట అనడానికి కాని, వొకపని పెత్తాయించడానికి కాని ఇంకెవ్వరూ లేరు-- చాటుగా వుండిందికి బావగారు లేరు. తగువులాడిందికి తోటికోడలు లేదు. ఇక ఆమె ఆడిందే ఆట, పాడిందే పాట-- ఇంటంతటికీ ఆమే అధికారి.

భకడిని చూపి నేత్రమణి నవ్వుతూ అంది. "ఇంతసేపటికి జ్ఞాపకం వచ్చిందా ఇంటికి రావడానికి? ఒక్కదాన్ని నేను ఎంతని సర్దేది? ఇల్లు ఇల్లంతా అడ్డంగా పడివుంది."

నేత్రమణి మాటలు ఇవాళ ఎందుచేతో భకడికి నచ్చలేదు. మనస్సులో అనుకున్నాడతడు. "అన్ని చెయ్యడానికి నువ్వే- నువ్వు ఇల్లు సర్దకపోతే ఇంకెవరు సర్దుతారు?" బయటకి అన్నాడు. "అయితే, అందరూ వెళ్లి పోయారు? మరి రారూ?"

"పరిగెత్తు. మళ్ళించుకు వద్దవు కాని !"

చేటలూ, బుట్టలూ, ఉట్టిమీద పిడతలూ అవీ సర్దడంలో మునిగిపోయి వుంది నేత్రమణి.

భకడి భోజనం చేశాక వీధి గుమ్మానికి వెళ్ళాడు. ఇల్లు ఇల్లంతా ఏదోలా వుంది. అన్నయ్య తిరిగిరాడా ఏమిటి? వెళ్లి ఎక్కడ వుంటాడు? పైగా భార్యా పిల్లలూ- అందరూ వెళ్ళారు- ఎన్నాళ్ళని వుంటారు, ఎక్కడ వుంటారు?

వీధి గుమ్మంలోంచి ఇంట్లోకి వచ్చాడతడు-మళ్ళీ వీధిగుమ్మానికి వెళ్ళాడు—— మళ్ళీ ఇంట్లోకి. ఉఁ ఊఁ ఏమీ తోవుంగలేదు—— వస్తాడు. అన్నయ్య తిరిగి వస్తాడు. తప్పకుండా వస్తాడు.

నేత్రమణి అంది, "ఎందుకలా పచారు చేస్తారేమిటి? వాళ్ళ పడక గదిలో ఏమేమి దినుసులున్నాయో- మీకు తాళాలిచ్చి వెళ్ళారేమో- అన్నీ సరిచూసి జాగ్రత్త చెయ్యరేం?"

"ఎందుకలా బడబడా వాగుతావు? వాళ్ళేమో ఇల్లూ వాకిలీ వొదిలేసి వెళ్ళిపోయారు. ఇంకెవరన్నా పట్టుకుపోతున్నారా ఏమిటి? గదిగొండెం వేసివుంది కదా విప్పమా చూదమా?"

"ఓలమ్మో, ఎంతడాబు చేస్తున్నాడో! వాళ్ళు వెళ్ళిపోతే నువ్వు వెంటబడలేక పోయావా?"

"కాకపోతే – ఇంట్లోంచి ఏమయినా ఎత్తుకుపోయారా ఏమిటి. ఇప్పుడే చూడకపోతే మించిపోవడానికి?

"ఏమిటి ఎత్తుకుపోతారు – కుండా ముండా, చేటా బుట్టానా? ఏమిటి పట్టుకెళ్ళారో నీకు చూపించి పట్టుకెళ్ళారా ఏమిటి?"

ఛకడి మనస్సు బాగా చెడిపోయింది. "బట్టలమూటా, బటువా – అన్నీ చూపించారు. ఎందులోనూ వొక ఎర్రని ఏగానీలేదు. బుట్టపెట్టెలో అయిదు రూపాయలు పడివున్నాయి పావలా, అర్ధలాలూ, దమ్మిడీలూ వున్నాయి. మరెలా పట్టుకుపోయారు?"

"ఇలా పట్టుకు వెళ్ళామని నీకంట్లో వేలుపెట్టి చెప్పవలసింది. ఉండు, కొంచెం ఓపికపట్టు – నాలుగురోజుల్లో మళ్ళీ వింటావు. ఎక్కడో వెళ్ళి ఇల్లూ వాకిలీ తోటా గీటా పెట్టుకుని వాళ్ళగొప్పగా వాళ్ళు వున్నారని నువ్వే వింటావు. ఆగు ఇలా ఇదయిపోతావెందుకు?"

ఛకడి ఆగాడు – దినం రెండు దినాలు, మూడుదినాలు ఏదీ? కబురూ కాకరకాయా లేదే! బరజు హరిపురం గౌరంగ సేఠు ఇంటికి వెళ్ళాడని జగ్గాశెటి చెప్పాడు. ఇన్నాళ్లూ అక్కడే వున్నాడా? ఉఁ హుఁ, వాళ్ళింట్లో ఇన్నాళ్ళుంటాడా? ఒకరోజు రెండురోజులు, మూడు రోజులు– రోజుకి రోజూ ఇల్లు దీం దీం మంటూ వుంది. ఇంటా బైటా దేనిమీదా ఛకడి మనస్సు నిలవడం లేదు. అచ్చే, ఊరికే పిచ్చెత్తినట్టు వెళ్ళిపోవాలా అన్నదమ్ముడు? వేర్లు కొవద్దంటే ఛకడి వినుకోడా? తనతప్పు తనకి గుర్తులేదు ఛకడికి.

మిట్టమధ్యాహ్నం. ఎండ మండిపోతూ వుంది. భోజనం చేశాక ఛకడి అన్న పడకగది తాళం పట్టుకు వెళ్ళాడు. అతడి శరీరం వణుకుతూ వుంది. గది ఎలా తెరవడం? ఆ గదిలో ఏమో, ఏముందో? – పట్టపగలు

ఛకడికి భయం వేసింది. పెరట్లో గువ్వపిట్ట కూస్తూ వుంది. "బియ్యం మానిక నిండింది, లేరా కొడకా లేలే!" ఇంటిమీద మాలకాకి అగి అగి అరుస్తూవుంది. "కా-కా," ఛకడి మనస్సు నీరసించిపోయింది. అమ్మా, అయ్యా-అందరిమాటా జ్ఞాపకంవచ్చింది. అందరూ వున్నప్పుడు ఈ ఇల్లు ఎలావుండేది-ఇప్పుడెలా వుంది! ఎవరి ఆస్తి, ఎవరి ఇల్లు, ఎవరివాకిలి-ఛకడికి ఏమీ అవగతం కాలేదు, అంతా చీకటిగా అవుపించింది. మనస్సు చేదయి కుంగిపోయింది.

ఛకడి గదితెరచి చూచాడు. ఎలాంటి వస్తువులలాగే వున్నాయి. బుట్టపెట్టి తిరిగి కిందపడి వుండినా, తుంగచాప చెదలుకొట్టేసి వుండినా, పిడతలూ బుంగలూ ఏదీలేకండా గది గదంతా శూన్యంగా వుండినా-ఛకడికి కాస్త బావుండేది. ఒక్కవస్తువయినా వాళ్ళు కూడా పట్టుకువెళ్ళలేదు. ఎక్కడివక్కడే వున్నాయి. పిడతలూ, ముంతలూ, తుంగచాపా, పక్కా-అన్నీ ఎలాటివలాగే వున్నాయి. ఏదో పోగొట్టుకున్నట్టు వెతుకుతున్నాడు ఛకడి. ఆ విత్తనాల కట్టలసందున ఏదో దొరుకుతుందన్నట్టు గది నాలుగుమూలలా దేవుతున్నాడు. అతడిచూపు వొకదానిమీద పడింది. ఆ రబ్బరు బాతులమీద నొక్కితే కూ౨ కూ౨ అరుస్తుంటే, అదిగో దానిమీద ఛకడి దానిని పట్టుకున్నాడు, గుండెల కద్దుకున్నాడు. అతడి కళ్ళల్లోంచి జలజలా సెలయేళ్ళలాగా కన్నీళ్ళు ప్రవహించాయి. ఛకడీ! ఛకడీ! కుటుంబమంతా పడి ఆస్తంతా నొల్లుకుతినేస్తూ వుండేవాళ్ళు. ఇప్పుడు ఈ ఆస్తి ఎవడు తింటారు? ఛకడీ ఆ బాతుబొమ్మ చేత్తో పట్టుకుని మళ్ళీ చూశాడు. నలుగురు పిల్లల చినచిన్న చేతులు ఎనిమిది కనిపించాయి. చాచుకుంటూ తన దిక్కే వస్తున్నాయవి, ఆ బొమ్మకోసం. కన్నీళ్ళతో గుడ్డివాడయిపోయాడతడు.

ఛకడి నేత్రమణిని చూశాడు కాదు. పల్లెత్తి వొకమాటయినా మాటాడలేదు. ఎక్కడ కూచుంటే అక్కడ జలజలా కన్నీళ్ళు వొలికి పోతున్నాయి, నేత్రమణి అతణ్ణిచూసి తనలో తాను నవ్వుకుంది-"ఆదారి సత్తెప్ప. అన్నమీద ప్రేమ వొలికిస్తున్నాడు-రోజు, రెండురోజులు ఇలా అవుతాడు- తరవాత తానంపటతాను సర్దుకుపోతాడు, ఎప్పటిలాగే వూరు కుంటాడు."

ఛకడి సాయంకాలం దుకాణానికి వెళ్ళలేదు. వీధిగడపమీద ముడుచు కుని కూచున్నాడు. సాధనమ్మ చేతిలో రెండు పుడకలు పట్టుకుని, చింకిబట్ట వొళ్ళు కప్పుకుంటూ నడుచుకుపోతూ వుంది. మూడుకాళ్ళ ముసలిదామె. కళ్ళకి బాగా అవుపించదు. తనలో తాను గొణుగుకుంటూ వెళుతూవుంది. "అయ్యో, ఇదా చేశారు! ఇదా తుదకిచేశారు-ఇదా మీ మనసులో వుండేది! ఎవరికేం చేశాడని! వంచినతల ఎత్తకండా నడిచేవాడు-పల్లెత్తు మాటని ఈగవంటిదాన్నయినా నొప్పించేవాడుకాదు. చీమన్నా చవ్వకండా అడు గులు వేసేవాడు. ఈ వీధి ఎంత చిన్నబోయింది! అలాంటి బంగారు తండ్రి మరి ఎవడున్నాడు? ఇంక ఎవడున్నాడు, ఈ వూరిలో! పధాను ముసిద్ది వుంటే ఇది జరుగునా? కొడుకుని పేరుపెట్టి పిల్చిన పాపాన పోలేదా యిల్లాలు."

ముసిలామె మామపేరు 'బరజు.' అంచేత ఆమెకూడా బరజుపేరు నోటితో అనేదికాదు! ఆమె కళ్ళల్లో కన్నీళ్ళు ఆప్పుకుపోయాయి. కను రెప్పలు చెమ్మగిల్లాయి. చింకిబట్టతో కళ్ళు తుడుచుకుందామె.

వీధిగుమ్మంలో కూచున్నవాడల్లా ఛకడి యింట్లోకి పరిగెత్తుకు పోయి, "అన్నయ్యా, అన్నయ్యా"అంటూ పిలిచాడు. ఇదేమిటి పిచ్చెత్తి పోతాడా ఏమిటి?

రాత్రి అన్నం కంచం దగ్గిర కూచున్నాడు ఛకడి. కన్నీళ్ళతో కంచం తడిసిపోయింది.

గదిలో నిద్రపోతున్నాడు ఫకడీ. అర్ధరాత్రి పలవరిస్తున్నాడు— "అన్నయ్యా, అన్నయ్యా!" నేత్రమణి ఎన్నో చెపుతుంది, ఎన్నో అడుగుతుంది. ఫకడి "ఊఁ" ఊఁ అంటూ జవాబు చెపుతున్నాడు— అతడి మనస్సు తిన్నగా లేదు.

మర్నాడు నేత్రమణి చూసింది. ఫకడి ఇంటిలో లేడు. మధ్యాహ్నమయింది. సాయంకాలమూ అయింది— ఏడీ ఎక్కడికి వెళ్ళాడు? అన్ని దిక్కులా మనుషులు వెదికారు. ఎక్కడా అవుపించలేదు..

ఫకడి ఉదయాన్నే లేచి ఎక్కడికి వెళ్ళలేదు—హరిపుర గౌరాంగ శేఠ ఇంటికి వెళ్ళి వీధిగుమ్మంలో కూచున్నాడు. చిన్నాన్నని చూసి దామ లోపలికి పరిగెత్తుకువెళ్ళి కేకలు వేశాడు. "అమ్మా వాలే, చిన్నాన్న వచ్చాడు."

బరజు వచ్చి చూశాడు, ఫకడివచ్చి మాటాడకుండా వీధరుగుమీద కూచునివున్నాడు.

"ఏంరా, ఇక్కడెందుకు కూచున్నావు, రా, లోపలికి రా" అంటూ ఫకడిని బరజు లోపలికి పిలుచుకువెళ్ళాడు.

ఇంటిలోపలికి వెళ్లాక బరజు అడిగాడు. "ఏంరా, నువ్విటు వచ్చేశావు?"

ఫకడి మెల్లిమెల్లిగా అన్నాడు. "నేనూ వస్తాను."

బరజు అడిగాడు. "నువ్వెక్కడికి వస్తావురా?"

"మీరు ఎక్కడికి వెళితే అక్కడికి."

టపటపా ఫకడి కళ్ళలోంచి కన్నీళ్ళు వాలికిపోతున్నాయి.

ఛీ ఛీ. లడారి సత్తప్పు!

## హరేకృష్ణ మహతాబ్

"శ్రీ పాణిగ్రాహిగారి నవల చదివిన పాఠకులికి ఒడియా గ్రామాల జీవనం ఎలా వుండేదో అవగత మవుతుంది. దాంతో పాఠకుల హృదయంలో సమిష్టి పరివారవ్యవస్థ యిప్పటిదాకా భారతీయ జీవనం వికసితం చేస్తూవున్న కోమల మైన ఆ మానవ గుణాలమీద ఆదరమూ, సానుభూతీ కలుగుతాయి."



154

